

రచయిత : శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య

జననం : 1934 జూన్, 26

తల్లిదండ్రులు : కీ॥శే॥ కొండముది అన్నపూర్ణమ్మ గారు
కీ॥శే॥ కొండముది సుబ్బారావు గారు

హైస్కూల్ చదువు : అప్పికట్ల, గుంటూరు జిల్లా.

కాలేజి చదువు : హిందూ కాలేజి, గుంటూరు.

- 1950లో మేనమామ కుమార్తె పద్మావతితో వివాహం.
- 1953లో అప్పికట్ల గ్రామాధికారిగా ఉద్యోగ బాధ్యతల స్వీకారం.
- 1953 నుండి రచనలతో తన సాహితీ అర్చన ప్రారంభించారు.
- 1964 జనవరి 10వ తేదీన జిల్లెళ్ళమూడి అమ్మకు దత్తత ఇవ్వబడి, అమ్మ ఆంతరంగిక కార్యదర్శిగా 'మాతృశ్రీ' మాసపత్రిక సంపాదకుడుగా, శ్రీ విశ్వ జననీ పరిషత్, మాతృశ్రీ విద్యా పరిషత్‌ల అధ్యక్షుడుగా, కార్యదర్శిగా అమ్మ సేవలకు తన జీవితాన్ని అంకితం చేశారు.
- అమ్మ జీవిత చరిత్ర (మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు) మాతృ సంహిత, మాతృ దర్శనం, హైమాలయం, అనసూయ వ్రత కల్పము, అనసూయ కళ్యాణం, అన్నపూర్ణాలయం, శ్రీచరణ వైభవం, వాత్సల్యగంగ, అంతస్సూత్రం, అక్షరోపాసన మొదలైన అమ్మ తత్వం, అమ్మ జీవిత విశేషాలను తెలిపే గ్రంధాలు రచించారు. 'అమ్మ' సినిమా వాఖ్యానం పలువురి ప్రశంసలు అందుకున్నది.
- అవతారమూర్తి అమ్మ నడయాడిన జిల్లెళ్ళమూడి గడ్డమీద తను కోరుకున్నట్లుగా 1998 ఆగస్టు 23వ తేదీన తుదిశ్వాస విడిచారు.



ర॰ చరణ వైభవమే - ర॰సృష్టి వైవిధ్యమంతా
ర॰ చరణ సౌరభమే - ర॰ సృష్టి సౌందర్యమంతా

# అమ్మసేవలో ....

## రామకృష్ణ అన్నయ్య




| | | |
|---|---|---|
| ప్రచురణ | : | **ఆగష్టు 2014** |
| ప్రతులు | : | **1000** |
| వెల | : | **50 /-** |
| డి.టి.పి. ప్రింటింగ్ | : | **రోహిత్ ప్రింటర్స్, విజయవాడ.**<br>ఫోన్ : 0866-6661823,<br>సెల్ : 90308 66059 |
| పబ్లిషర్స్ | : | **శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య, ఫౌండేషన్**<br>జిల్లెళ్ళమూడి - 522 113. |
| సెల్ | : | 9908018236<br>9246275586, 9246275584 |




ప్రచురణ

## శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య ఫౌండేషన్

జిల్లెళ్ళమూడి - 522 113.

## అభివందనాలు..

అమ్మతో అన్నయ్యకు ఉన్న అనుబంధాన్ని తనదైనశైలిలో విశ్లేషించి ఈ ప్రచురణను ప్రోత్సాహించిన శ్రీశ్రీశ్రీ మహేష్ బాబాగారికి మా పాదాభివందనాలు.

ఈ గ్రంథ ప్రచురణకు ప్రేరణ కలిగించిన మాన్య సోదరులు శ్రీ కొండముది హనుమంతరావు గారికి అభివందన చందనాలు.

ఈ గ్రంథానికి తన పీఠిక ద్వారా 'దర్పణం' పట్టటమేకాక "అమ్మ సేవలో రామకృష్ణ అన్నయ్య" అని నామకరణం చేసిన అగ్రజులు, పూజ్యగురువులు, ఆర్షవిద్యాసాగర, మధురభారతి అమ్మతత్వ ప్రచార సమితి అధ్యక్షులు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి గారికి మా అభివందనాలు.

డి.టి.పి. చేసి అందంగా ముద్రించిన రోహిత్ ప్రింటర్స్‌కు కృతజ్ఞతలు తెలియచేస్తున్నాము.

శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య ఫౌండేషన్



## అభినందనలు

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహకారం అందించిన దంపతులు చిరంజీవులు కొండముది హైమాకర్ శ్రీనివాస చైతన్య (నాని) చి॥ల॥సౌ కొండముది వేంకట మానస లకు మా అభినందనలు. అమ్మ ప్రేమ సుధా ధారలు వారిపై సదా వర్షించుగాక.

– శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య ఫౌండేషన్

# మా మాట

ఇది రామకృష్ణ అన్నయ్య 'ఆత్మకథ' కాదు. జీవిత చరిత్ర కూడా కాదు. ప్రచురణ కొరకు అన్నయ్య ఇవన్నీ వ్రాసుకున్నాడని మేము భావించటం లేదు. అయితే ఈ రాతలలో అన్నయ్య 'ఆత్మ' ప్రతిబింబిస్తున్న మాట మాత్రం యథార్థం. అమ్మకు అన్నయ్య సర్వాత్మనా అర్పణం చేసుకున్న తీరు, సంక్షోభ సమయాలలో అన్నయ్య ఆ సమస్యలను ఎదుర్కొన్నతీరు, అన్నయ్య వ్యక్తిత్వ వికాసం ఈ రచనలలో అనగా అమ్మకు అన్నయ్య వ్రాసుకున్న లేఖలలో, తన ఆత్మీయులకు వ్రాసిన లేఖలలో, తనకు తాను వ్రాసుకున్న డైరీ రచనలలో పూర్తిగా ప్రతిఫలిస్తున్న విషయం ప్రకాశకులుగా మమ్ములను ఎంతగానో ఆకర్షించింది. "అమ్మ చెక్కిన చందన శిల్పం" గ్రంథ రచయిత శ్రీ కొండముది దత్తాత్రేయ శర్మ గారు భావించినట్లు అన్నయ్య ఒక కావ్య నాయకునికి ఉండవల్సిన లక్షణాలన్నీ సంతరించుకున్నట్లు ఈ రచనలు వెల్లడిస్తున్నాయి. ఇది లోకానికి వెల్లడించవలసిన బాధ్యత శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య ఫౌండేషన్‌కు ఉన్నదని మా భావన.

ఆ భావం తోనే ఈ లేఖలను, దైనందిన జీవిత చర్యలను వాటిలో వ్యక్తా వ్యక్తలగా గోచరిస్తున్న అమ్మ తత్త్వాన్ని అన్నయ్య వ్యక్తిత్వాన్ని వెల్లడించటమే లక్ష్యంగా ఈ ముద్రణను మేము స్వీకరించాము. సహృదయంతో అందుకొని ఆశీర్వదించవలసిందిగా. అభ్యర్థిస్తూ...

**– శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య ఫౌండేషన్**



# అక్షర దర్పణం



"ఆర్ష విద్యా సాగర", " మధుర భారతి"
శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి, అధ్యక్షులు,
అమ్మతత్త్వ ప్రచార సమితి, జిల్లెళ్ళమూడి.

జిల్లెళ్ళమూడి అమ్మను అవతార మూర్తిగా, ఆరాధ్యదేవతగా, ఆపద్బాంధవిగా భావించి అర్చించే వారు కొందరు. విశ్వ ప్రేమకు ప్రతీకగా దర్శించి అభిమానించే వారు కొందరు. మహా మానవతామూర్తిగా అమ్మను గౌరవించే వారు కొందరు.

ఎవరు ఏ దృక్కోణం నుంచి చూస్తే, వారికి అలా దర్శనమిస్తూ, తన అశేషసంతానానికి నిరంతరమూ తృప్తిని ధైర్యాన్ని ప్రసాదిస్తూ, అవ్యాజ ప్రేమను ఈ సృష్టిపై కురిపిస్తున్న వాత్సల్యామృత వర్షిణి అమ్మ.

అమ్మను దర్శించి, అమ్మతత్వాన్ని ఎంతో కొంత ఆకళింపు చేసుకున్న ఎవరికైనా, అమ్మ సన్నిధి అంతులేని ప్రశాంతతను, అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగిస్తుందని వేరుగా చెప్పనక్కరలేదు. అమ్మ బిడ్డలందరికీ అది అనుభవైక వేద్యమే.

అమ్మ ఆశయాలను అర్ధం చేసుకుని, ఆ ఆశయాలకు ప్రతిబింబంగా అమ్మ నెలకొల్పిన సంస్థ పట్ల గౌరవ భావంతో అక్కడి సేవా కార్యక్రమాల నిర్వహణలో మమేకమైన వారికి అమ్మ సన్నిధి మరింతగా అమృతప్రాయం.

అయితే, అమ్మనే సర్వస్వంగా అర్చిస్తూ. వ్యక్తిగతంగా అమ్మ సేవలో తరిస్తూ, సంస్థ నిర్వహణలో కీలకమైన బాధ్యతలు నిర్వహిస్తూ, సారస్వత రూపంలో అమ్మ తత్వాన్ని లోకానికి వెల్లడిస్తూ, సర్వాత్మనా తన్నుతాను అమ్మకు సమర్పణం చేసుకున్న వ్యక్తికి అమ్మ సాన్నిధ్యం ఎలా ఉంటుంది ?. ఏ కారణాల వల్లనైనా అమ్మకు దూరంగా ఉండవలసి వస్తే, ఆ హృదయం ఎలా

పరితపిస్తుంది?. ఆనందంలో, ఆవేదనలో, సంతోషంలో, సంఘర్షణలో - జీవిత సన్నివేశాలలో అనుక్షణమూ అమ్మనే తలపులలో నింపుకొని, ఖేదమోదాలు రెండింటినీ అమ్మ ప్రసాదంగానే 'శిరసా' వహించి, అన్ని సందర్భాలలోనూ అమ్మ చూపిన మార్గంలోనే పయనించే బాటసారి అంతరంగం ఎలా ఉంటుంది?.

వ్యక్తిగతంగాను, సంస్థాగతంగానూ కూడా సమస్యలను సాధనకు సోపానాలుగా మలచుకుంటూ, గెలుపూ ఓటములను ఒకే భావంతో స్వీకరిస్తూ, క్రుంగు పొంగులకు అతీతంగా నిరంతర కర్తవ్యశీలిగా అమ్మ తత్త్వమే ఊపిరిగా బ్రతికే ఆ సాధకుని గుండె చప్పుడు ఎలా ఉంటుంది?.

ఇది తెలియాలంటే, అతడి హృదయాన్ని చదవాలి. అది ఎలా సాధ్యం. అతడు అమ్మకు తన సుఖదు:ఖానుభవాలను వెళ్ళబోసుకుంటూ వ్రాసుకున్న లేఖలలోనో, తన ఆలోచనలు వెల్లడిస్తూ ఆత్మీయులకు వ్రాసుకున్న లేఖలలోనో, తనకు తాను చెప్పుకుంటూ వ్రాసుకున్న 'దినచర్యల'లోనో అది వెల్లడి కావాలి.

అమ్మకు అంకిత భక్తుడుగా, ప్రియపుత్రుడుగా, కవిగా, రచయితగా, పత్రికా సంపాదకుడుగా, సంస్థ నిర్వహణలో ప్రధానపాత్రధారిగా అమ్మకు అర్చకుడుగా, ఆంతరంగిక కార్యదర్శిగా, అమ్మతత్త్వాన్ని అన్వేషించే జిజ్ఞాసువుగా, అన్నింటా అమ్మ చూపిన మార్గమే శరణ్యమని నమ్మిన సాధకుడుగా శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య కనిపిస్తారు.

అన్నయ్య అంతరంగానికి అక్షర దర్పణం ఈ లేఖలు, డైరీలు. అమ్మను సర్వాత్మనా ఆరాధించే వారికి అన్నయ్య అంతరంగం అర్థమవుతుంది ఈ రచనల వల్ల. అమ్మను ఆరాధించడం ఎలాగో తెలియని వారికి అమ్మను అర్చించడం అంటే ఏమిటో కొంతవరకైనా తెలుస్తుంది ఈ రచన వల్ల.

అంతేకాదు, ఆత్మవిశ్వాసము, పరమాత్మ విశ్వాసమూ కలగలసిన వ్యక్తిత్వం గల ఒక మహోన్నతుడు సుఖదు:ఖాలలో ఎలా స్పందిస్తాడో, రెండు సందర్భాలలో నూ కర్తవ్యానికే ఎలా అంకితమవుతాడో తెలియాలంటే కూడా ఈ రచన సహకరిస్తుంది.

జీవితంలో వచ్చే సన్నివేశాలన్నీ సుఖానికో దు:ఖానికో చెందినవే అయినా, వాటి ప్రభావం మనస్సుపై ప్రసరించకుండా, తామరాకు పై నీటి బిందువులా నిలిచే సాధకుణ్ణి ఈ రచనలో చూడవచ్చు.

అయితే, అన్నయ్య వ్యక్తిత్వం అంతటినీ సంపూర్ణంగా, సర్వ సమగ్రంగా ఈ రచన ప్రతిబింబిస్తుందని నేను చెప్పలేను.

తమకు అందిన సమాచారం అధారంగా ఈ ప్రచురణ కర్తలు తాము సేకరించగలిగిన కొన్నింటిని మాత్రమే రచనలో సంకలనం చేయగలిగారు.

అమ్మ తత్త్వాన్ని, అన్నయ్య వ్యక్తిత్వాన్ని, జిల్లెళ్ళమూడి సంస్థల చరిత్రను గుర్తించడానికి ఇది ఒక 'దిక్సూచి' మాత్రమే.

ఏమైనా, ప్రయోజన కరము, ప్రభావ వంతము అయిన సత్కార్యాన్ని చేపట్టిన 'ఫౌండేషన్'ను మనసారా అభినందిస్తూ, ఈ రచనల్లో అంతర్లీనంగా దర్శనమిస్తున్న అమ్మకు ప్రణమిల్లుతూ, అన్నయ్య వ్యక్తిత్వానికి వినమ్రభావంతో నమస్కరిస్తూ.... సెలవు.



**- జయహో మాత -**



# అమ్మా

24.12.1962 (12.15)

అమ్మా నమస్కారములు....

త్వమేవ మాతాచ

పితా త్వమేవ

త్వమేవ బంధుశ్చ

సఖా త్వమేవ

త్వమేవ విద్యా

ద్రవిణం త్వమేవ

త్వమేవ సర్వం

మమ దేవ దేవ"

క్షుభితుడు,

క్షతగాత్రుడు,

క్షంతవ్యుడు

నీ రామకృష్ణ

ఈ పూటనే పద్యం తీసుకున్నానమ్మా !

ఇవ్వాళ ఉదయం కూడా రాఘవయ్య తాతయ్య

మళ్ళీ వచ్చి వెళ్ళారు. నేను ఎల్లుండే రావాలనుకుంటున్నానమ్మా.

– కిష్టప్ప

# అమ్మా

అప్పికట్ల : 3-7-63

అమ్మా.... నమస్కారములు -

ఎందుకో ఆకాశం కార్చలేక కార్చలేక కన్నీరు రాలుస్తూంది. అశ్రు సిక్తమయిన అవని చిక్కులతో, చింతలతో చివికి పోయిన హృదయంలా చితచితలాడుతూంది.

భుజాన గొడుగు పెట్టుకుని, గొడుగు కఱ్ఱ చివర సంచీ తగిలించుకుని, ధోవతి మోకాళ్ళ వరకు పైకి కట్టుకుని నడుస్తున్నాను.

చిన్న చిన్న చినుకులతో చుట్టూరా చల్లని వాతావరణం... మనసులో వెచ్చని వడగాడ్పులు...

రకరకాల ఆలోచనలు, ఏవేవో భావనలు...

బయలుదేరేముందు నీ సన్నిధిలో చెల్లెలు హైమ ప్రసక్తి వచ్చింది. హైమను గురించి ఆలోచన వచ్చినప్పుడు మనస్సు ఏమవుతున్నదో, ఏ దావాగ్ని కీలలు మనసును దహనం చేస్తున్నాయో... అమ్మా - నీకు నేను చెప్పనవసరంలేదు. సర్వజ్ఞవు నువ్వు!

అయితే, యీ బాధ ఎందుకు?

హైమ ఆరోగ్య స్థితిని గురించా? నేనేం చేయగలను? సర్వప్రదాత అయిన సర్వేశ్వరుడిని కాకపోయినా, ఆ అంశ ఉన్నదనుకుని విఱ్ఱవీగే వైద్యుడినయినా కాదు. అందులో ఓనమాలు కూడా రావుగదా. (అంటే మిగిలిన వాటిలో వచ్చు అని కాదు. పై వాక్యం పొరబాటు. అందులో కూడా ఓనమాలు రావు" అంటే సరిపోతుంది. అనగా ఎందులోనూ రావని) మరేం చేయగలను అక్కడకు వెళ్ళి?

ఇక హైమ ఆరోగ్యం ఎట్లా ఉన్నదో తెలుసు కుందామనా ? ఏరోజు కారోజు అక్కడి నుంచి వార్తలు అందుతూనే ఉన్నాయ్ కదా.

మరి ఎందుకు నాకీ బాధ??

నేనుగా వెళ్ళి హైమను చూడలేదనా? చూడలేక పోయానే-అనా? అంటే బెజవాడ వెళ్ళలేకపోయిన నా అసమర్ధతను గురించా???

ఇది నిజమయితే ..... యిప్పుడు నా బాధ నావేదన హైమను గురించా? నా అశక్తతను గురించా ?

హైమబాధపడుతుందనా ? ఆ బాధను నేను ఏ విధంగానూ తొలగించలేక పోతున్నానే అన్న నా దౌర్బల్యాన్ని గురించా ? ? ? మనస్సు రెండు భాగలై ఘర్షణ పడుతోంది. ఆకాశం ఫెళఫెళామంది. తలపైకి ఎత్తాను. ఆకాశం మరీ నల్లబారి, క్షణంలో గుండెలు పగిలేలా భోరున ఏడవబోయే మనిషి ముఖంలా దీనంగా ఉంది.

గొడుగు విప్పాను. ముందుకు సాగాను. ఎక్కడో చెప్పిన ఉపమానం గుర్తుకు వచ్చింది. ఎదురుగాలిలో జండా పట్టుకు వెళుతుంటే కఱ్ఱ ముందుకు పోతుంటుంది. గుడ్డ వెనక్కు రెపరెపలాడతూ ఉంటుంది.

అలాగే నా కాళ్ళు ముందుకు, మనస్సు వెనక్కూ ఎందుకు ? నా సమస్యకు సమాధానం కోసం....

అమ్మా ....
పద్మావతికి తెరలు వస్తూనే ఉన్నాయ్. శ్రీపన్నాల రాధాకృష్ణ శర్మగారిని యిక్కడకు వేసినట్లు స్కూలుకు ఆర్డర్ కాగితాలు వచ్చినాయి. ఇవాళ ఇంతవరకు తహశీల్దారుగాని అసిస్టెంట్ కలక్టరుగాని రాలేదు. పిల్లలు క్షేమం.

అమ్మా
నమస్సులతో....
నీ అనుంగు బిడ్డ రహి





నీ పద్యావళు లాలకించు చెవులున్

నిన్నాడు వాక్యంబులున్

నీ పేరంబనిసేయు హస్తయుగమున్

నీమూర్తిపై చూపులున్

నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరమున్

నీ సేవపై చిత్తమున్

నీ పై బుద్దులు మాకు నిమ్ము కరుణన్

నీరేజ పత్రేక్షణా !

బమ్మెర పోతన



# అమ్మా

అప్పికట్ల : 5-7-63

అమ్మా.... నమస్కారములు -

జీవితం సుఖదుఃఖాల

గంగాయమునల సంగమంలో స్నానం.

జీవితం విషాద వినోద

వివిధరాగ విభిన్న స్వరాల విశిష్ట వీణాగానం.

అని లోగడ పాడుకున్నాను. వాస్తవంలో ఒక్కటే అనుభవ మయినా ఊహల మేఘాంచలాలపై ఉయ్యాలలూగుతూ కాని ప్రపంచం చూస్తున్నాను. జీవితం అనుభవిస్తున్నాను. రెండు కనుపించడం లేదమ్మా. అంతా ఒక్కటే. రెండోది అనుభవంలోకి రావడం లేదు. మరి నాకే లేదా? అసలు జగత్తే ఏకంతో నిండి ఉన్నదా?

ఎటుమీటినా

విశ్వవల్లకి విలాప స్వరములే మొరయు

ఎటు ఊపినా

విశ్వవల్లరి విషాద సుమములే కురియు

అనిపాడుకోడానికి ఆలాపన చేసుకుంటూంటే మనసు ఎదురు తిరుగుతోంది. ఆశాగీతికలుల్లుకోడానికి మనసు పదాలు వెతుక్కుంటోంది. మధువీణ మీటటానికి హృదయం ఆశాతంత్రుల సరిచేసుకుంటోంది. ఏం చేయనమ్మా? - అదిగో లోలోపల ఆశ ఏవో కూనిరాగాలు తీస్తోంది. ఇదీ వరస. హాయిగా వింటూ తల ఊపడమా?... నీ పాటలు హుళక్కి. అని చెవుల్లో వేళ్ళు దూర్చుకొనడమా?? ఏమిటి కర్తవ్యం? నీ ఆదేశం కోసం ఎదురుచూస్తూ.... నీ బిడ్డ

రామకృష్ణుడు.

## అమ్మా

అప్పికట్ల : 6-7-63

అమ్మా.... నమస్కారములు....

చేసుకున్న వాడికి చేసుకున్నంత మహదేవ! అన్నారు. అనుభవజ్ఞులు. కోరగాని నోములు నోచి కొండకొమ్ముల కెగబాకాలంటే ఎలా సాధ్యమౌతుంది?

అమ్మా ! నీ పాదాల చెంత పారాడాలంటే ఎంత పుణ్యం చేసుకు పుట్టాలి? నీ చరణధూళిలో పొరలాడాలంటే ఎంత అదృష్టవంతుడై ఉండాలి? నీ సాన్నిధ్యంలో నివాసం సామాన్యులకు దక్కుతుందా? నీవు విడిచిన గాలి పీల్చడానికయినా అర్హత, యోగ్యత ఉండవద్దూ?

అందుకే అంత దూరాన ఉండిపోయినాను, పరితపిస్తూ, హృదయాన్ని పరిశోధించుకుంటూ...

భగవంతుని కరుణ ఎలా అవ్యాజంగా ప్రసరిస్తూ ఉంటుందో, కాఠిన్యం కూడా అలాగే అకారణంగా పదును పెట్టుకుంటుందని తెలుసుకుంటూ ఉన్నానమ్మా. అందుకే అతని చేతలను 'లీలలు' అన్నారు. కాని అవి కొందరి జీవితాల పాలిట మహానల జ్వాలలై దగ్ధం చేస్తుంటే ఆ మహానుభావుడు విలాసంగా తిలకిస్తూ ఉంటాడు. అవునవును - అతని కిది క్రీడ!!

దౌర్భాగ్యుడు

**రామకృష్ణుడు**

# అమ్మా

రైల్వేస్టేషన్, విజయవాడ : 18-7-63, సా॥ 4-50 ని॥లు

అమ్మా.... నమస్కారాలమ్మా...

మూడు రోజుల నుండి ప్రయత్నం చేస్తున్నానమ్మా, ఉత్తరం రాద్దామని. నీ ఆజ్ఞకు విరుద్ధంగా జరుగుంతుందా ? నా పిచ్చిగాని. అందుకే యివ్వాళ యీ ఉత్తరం వ్రాయగలుగుతున్నాను.

కోచీలో అమ్మను, సుబ్బారావును తీసుకుని బయలుదేరాను. బామ్మా, సుబ్బారావు రాలేదమ్మా. వాళ్ళకోసం నిన్న సాయంత్రం, యివ్వాళ ఉదయం కూడా ఎదురు చూశాము. ఎందువల్ల రాలేదో...

తెనాలిలో చి॥ల॥సౌ॥ భానుమతి, వాళ్ళ నాన్న కలిశారు. 3 గంటలకు యిక్కడ దిగాము. వచ్చినప్పటినుంచి వాళ్ళకు టిక్కెట్లు, బర్త్ రిజర్వేషనులూ చూడడం సరిపోయింది. ఇంకో గంటకు గాని వాళ్ళు వెళ్ళే హౌరా ఎక్స్‌ప్రెస్ రాదు.

వెయిటింగ్ రూంలో సూర్యనారాయణగారు, అమ్మ, భానుమతి యేవేవో మాట్లాడుకుంటున్నారు. క్రొత్తకాపురం (క్రొత్తస్థలం) దాని విశేషాలూ జాగ్రత్తలూ.

నేను ఒక ప్రక్కన కూర్చుని జారిపోయాను, ఆలోచనల్లోకి...

అంతలో ఉత్తరం రాయాలనిపించింది. కవరూ, కలం తీసుకున్నాను వెంటనే. కాని ఏంరాయను? - మరో ఆలోచనకు తావు లేకుండా ఒకే దృశ్యం మనసంతా ఆదరించుకుని ఉంటే-

ఘోర ప్రమాదం జరిగిపోయిన తర్వాతలా అంతా ప్రశాంతత. అతి ప్రశాంతత. చైతన్యమే ఉడిగిందా అనేటంత నిశబ్దం. శిక్షించిన వాడు, రక్షింపబడ్డవాడు, ప్రేక్షకులూ అందరిలోనూ ఒకే జడత్వం.

వధ్యశిలపై మోకాళ్ళ మీద కూర్చుని తలవంచకుని.... ఏవేవో ఆలోచనల సుడిగుండాలతో నేను.... ఒకటి, రెండు, మూడు.... నిమిషాలు జరిగిపోతున్నాయి. అట్లాగే కూర్చుంటే యుగాలు అయినా కరిగిపో గలవు.

కాని యేదో ప్రేరణతో తలపైకి యెత్తాను. అమ్మా... బొమ్మలో అమ్మ.... నల్లకోటులో-నవ్వు. ఆ వెనక కరుడుగట్టిన విషాదం. విషాదానందమూర్తి ! అపరాధులను సైతం రక్షించే హృదయం. నిరపరాధిని శిక్షించే తరుణం ! (శేషగిరి రావు అన్నయ్య ఎంత బాగా ముందు చూపుతో అన్నాడమ్మా)

తల ప్రక్కకు తిప్పాను. మంచం మీద అమ్మ ఏమీ ఎరుగనట్టు నిరాయమయంగానూ, నిశ్చలంగానూ. ఆ గుండెల్లో నిప్పుకొండలే రగులుతున్నాయ్యో .... ఆ కన్నుల్లో అశ్రుజంఝా మారుత భయద్వీచికలు ప్రళయార్భటులే రేపుతున్నాయో.... ఎవరికి తెలుసు?

ఏమి చెప్పానో, ఏమిచెప్పలేదో తెలీదు. యాంత్రికంగా లేచి బయటకు నడిచేశాను, శిక్షించినవాడి అనుగ్రహ లేశంవల్ల. మరి మరోక్షణమే అక్కడ ఉంటే ఏమయ్యేదో....

ఏది శాపమో ఏది వరమో తెలుసుకోలేని నీ బిడ్డ

రామకృష్ణుడు.



**అమ్మా**

నన్ను నీవే చూచుకో
నన్ను నీలో దాచుకో

నీ బిడ్డ
రామకృష్ణుడు 9-12-63

ప్రేమా,

కారు మబ్బు ఉరిమినా
కడలి పొంగి తరిమినా
పథం విడచి పారిపోను
నీదు
పదం వదలి జారిపోను

— నమస్సులతో
నీ ప్రేమకు బానిస
రామకృష్ణుడు.
20.12.63

(రామకృష్ణ అన్నయ్య స్వదస్తూరి)

**అమ్మా**

కారుమబ్బు లురిమినా
కడలిపొరలి తరిమినా
పథం విడిచి పారిపోను
నీదు
పదం వదిలి జారిపోను

నమస్సులతో
*నీ అనుంగుబిడ్డ* - **రామకృష్ణుడు**
20-12-63

# అమ్మా

అప్పికట్ల : 2-1-64

ఏలో ఏలో ఏలేలో
నీలో నాలో యీ మమతా ॥
చందురు చూచీ సాగరవీచీ
ముందుకు దూకీ పొంగును ఏలా?
తల్లిని జేరీ ఒడిలో దూరీ
తన్మయ మందును పసికందేలా?
ఏలో ఏలో ఏలేలో
నీలో నాలో యీ మమతా??

నమస్సులతో
నీ అనుంగు బిడ్డ - రామకృష్ణుడు

# అమ్మా

అపికట్ల 2-1-64

అమ్మా,

నిన్న సుఖంగా బాపట్ల చేరాము. అక్కడ అందరినీ వదిలివేసి నేనూ క్రిష్ణుడూ కలిసి గుంటూరు వెళ్ళి శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారి దర్శనం చేసుకుని శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామి వారిని, వీరయ్యగారు మొదలయిన వాళ్ళను కలుసుకున్నాము. స్వామి వారు బ్రహ్మచారిగారితో కలిసి తప్పక జిల్లెళ్ళమూడి వచ్చే ఉద్దేశంలో ఉన్నట్లు చెప్పారు. కాని యింకా తేదీ నిర్ణయంకాలేదు.

అప్పికట్ల వచ్చి యీ ఉదయం బాపట్ల వెళ్ళి అక్కయ్య వాళ్ళందరినీ యిక్కడకు తీసుకువచ్చాను. నీ దయవల్ల ప్రయాణాలు అన్నీ నిర్విఘ్నంగానూ సుఖంగాను జరిగినవి.

అందరూ అడుగడుగున నీకు నమస్కారాలు సమర్పిస్తూ యింటికి చేరి - చేరినప్పటినుండీ నీ స్మరణలోనే కాలం గడుపుతున్నారు.

ఇవ్వాళ రేపూ... వసూళ్ళు....

నమస్కారాలతో

నీ అనుంగుబిడ్డ **-రామకృష్ణుడు**

శ్రీమన్నా, ....

నమస్కారం...

ఒకే స్వామి ; ఒకే భూమి

ఒకే ధ్యాస ; ఒకే ఆశ ॥

x x x

ఇంటి లోన చెదలు పుట్టె

కంటి లోన నదులు పుట్టె

x x x

నమస్సులతో,

నీ అనుంగు బిడ్డ

రామకృష్ణుడు.

28-1-64.

## **అమ్మా**

28-1-64

అమ్మా

నమస్కారాలు

ఒకే స్మృతి ; ఒకే శృతి

ఒకే ధ్యాస ; ఒకే ఆస

ఇంటిలోన చదలు పట్టె

కంటిలోన నదులు పుట్టె

నమస్సులతో

నీ అనుంగు బిడ్డ - **రామకృష్ణుడు**

28-1-64.

# అమ్మా

అమ్మా....

లావొక్కింతయులేదు

తనువు డస్సింది

మనస్సు విసిగింది

రావుల్ దప్పెను

(మూర్ఛ రాలేదు)

శ్రమం బయ్యెడిన్

నీవే తప్ప నితఃపరంబెరుగను

రావే యీశ్వర ! కావవే వరద !

వేగలేను, తప్పించుము బెడద

లెక్కసాగదు, మనస్సు

రెక్కలు విప్పుకుని ఎగురుతోంది

చుట్టూ కత్తులబోను

ఎటూ వెళ్ళలేను ఏమీ చెయ్యలేను.

అవుతుందా జమాబందీ

విడుదలవుతాడా యీ బందీ

ఇది పరీక్షా?

లేక శిక్షా??

**వృద్ధుడు**

**రామకృష్ణుడు**

25-5-64, సా : 4-45

తాలూకాఫీసు, బాపట్ల

# అమ్మా

చీరాల : 8-6-64

అమ్మా...

నమస్కారములు....

మా అమ్మ చేతి వ్రేలి మీది వ్రణం తగ్గక, మంటలు, పోట్లు ఎక్కువయి, ఈరోజు ఉదయం యిక్కడకు తీసుకువచ్చాము. హాస్పిటల్‌లో చూపించాము. జెప్టు కాదన్నారు. మేహవ్రణమన్నారు. కొన్నాళ్ళు యిక్కడనే ఉండి యింజక్షన్లు తీసుకోవాలన్నారు. మంటలు, పోట్లు భరించలేకుండా ఉన్నది. ఎంతసేపటికీ మార్ఫియా యింజక్షనులు యిచ్చి నిద్రబుచ్చాల్సి వస్తున్నది. మరి ఏం చేస్తాం? అందువల్ల నేను కూడా ఉండాల్సి వస్తున్నది.

ఎప్పటికి విముక్తి?

ప్రణామములతో...

**కొండముది రామకృష్ణ**

# అమ్మా

జిల్లెళ్ళమూడి : 20-10-64

ఆశ్వయుజ పూర్ణిమ

ప్రియమిత్రుడు సత్యనారాయణకు... నమస్కారములు

ఎన్నాళ్ళ తర్వాత నీకు మళ్ళీ ఉత్తరం రాస్తున్నాను! నాకే ఆశ్చర్యంగా ఉంది. ఇన్నాళ్ళు మనయిద్దరి మధ్య యింత నిశ్శబ్దమూ, నిస్తబ్ధతా ఎలా రాజ్యం చేయకల్గిందా అని. విధి బలవత్తరమూ మహత్తరమున్నూ. మన యిష్టా యిష్టాలతో విధి సంకల్ప వికల్పాలకు సంబంధం లేదు.

ఏమిటో, యీ ఉత్తరం రాయడానికి కూర్చుంటే లోగడ అప్పికట్లలోని మన జీవితం కళ్ళముందు బొమ్మకట్టుతున్నది. ఎన్ని సారస్వత గోష్టులు, ఎన్ని రాజకీయ సమాలోచనలు! ఎన్ని కథలూ, ఎన్ని చర్చలు!! ఎన్ని కవితలూ... అవన్నీ ఏమయినవి?? అవన్నీ యిప్పుడు కొత్త రూపుదాల్చినయ్. నదులన్నీ సముద్రంలోనేగా కలిసేది. నీ ఉత్తరం లోలో కదిలిస్తున్నది. నాలో స్మృతులును కరిగిస్తున్నది. ఎన్నెన్ని (మధుర-మధుర) విషాద జ్ఞాపకాలు! ప్రాణముండగా వాటికి విడువలేము కాబోలు తిలోదకాలు!

యాంత్రిక జీవితంతో కరుడుగట్టి మోడువారిన జీవితం అమ్మ మృదుల శీతల కరస్పర్శలోని సంజీవనితో క్రొత్తరూపు దాల్చింది.

ఒకనాడు నువ్వు ఉద్యోగంలో చేరావని విని ఎంత ఆనందపడ్డానో అంతకు రెట్టింపుగా ఆశ్చర్యపడ్డాను, మరి నీ స్వేచ్ఛా ప్రవృత్తి అందుకు పూర్తిగా వ్యతిరేకం గదా!

అట్లాగే యివ్వాళ నువ్వూ ఆశ్చర్యపడవచ్చు. నా సంగతి విని.

ప్రస్తుతం నేను జిల్లెళ్ళమూడిలో మాతృశ్రీ పవిత్ర చరణ సన్నిధిలో జీవితం వెలిగించుకుంటున్నాను. శారీరకంగా రెండు వంతులు యిక్కడ, ఒక వంతు అప్పికట్లలోనూ. అయినా మానసికంగా పూర్తిగా యిక్కడనే. సకల జగత్తుకూ హేతుభూతమూ, సర్వప్రాణికోటికి శిరోధార్యమూ అయిన ఆ పాదపంకజాలకే సర్వార్పణ!

ఇదంతా నీకు వింతగానూ కనిపించవచ్చు విడ్డూరమూ అనిపించవచ్చు.

కాని ఏక్షణాన ఏ జీవి జీవితపథం ఏ మలుపు తిరుగుతుందో ఎవరూ ఊహించలేరు. ఏ ఒక్క లిప్తలో జరిగిన ఏ ఘటనాలేశమయినా జీవిత స్రోతస్వినీ గమనాన్నే మార్చివేయవచ్చు. ఒక్కసారి నువ్వు యిక్కడకు రాకూడదూ?

యీ ప్రశాంత వాతావరణంలో ఒక్కసారి శ్వాసించవచ్చు. ఈ పవిత్ర తీర్ధంలో ఒక్కసారి సుస్నాతుడు కావచ్చు. ఈ అనురాగరాగలహరిలో నీ హృదయ వీణ తంత్రుల సయితం శ్రుతి చేసుకోవచ్చు. అరుణారుణ సంధ్యా సమయంలో యిక్కడ వినిపించే సుశ్లోక పఠన కార్యక్రమం నీ శ్రవణేంద్రియాల్లో వర్షించే పీయూష ధారలతో నీ జీవితాన్ని జాగృతం చేసుకోవచ్చు. వస్తావుకదూ- నీకోసం ఎదురు చూస్తుంటాను.

మాతృశ్రీ చరణ సేవలో....<br>నీ<br>రామకృష్ణ

## అమ్మా

అప్పికట్ల : 29-4-65

అమ్మా....

ఆకాశం నిప్పులు కక్కుతోంది. ఎండ మండిపోతోంది. ఊళ్ళో జప్తులూ, వేలాలూ... రెవిన్యూ ఉద్యోగుల హడావుడి... అంతా గగ్గోలూ, కల్లోలం. ఊరంతా సంక్షోభం. నేను మాత్రం హాయిగా నిర్విచారంగా, నిశ్చలంగా ఇంట్లో ఒక మూల ఒక గదిలో, గదిలో ఒక మూల మంచంమీద అదీ పందిరి మంచం మీద పట్టు పరుపువేసుకుని మహారాజులా విశ్రాంతిగా పడుకున్నాను. ఏముంది?

కాళ్ళు, చేతులకు, కళ్ళకు, చెవులకు ఒకటేమిటి. సర్వావయావాలకు విశ్రాంతి. మనసుకు విశ్రాంతి. కాని గుండెకు, శ్వాసకు విశ్రాంతి లేదు. మేమేం పాపం చేశాం? మాకెందుకు విశ్రాంతి నివ్వవూ! అంటున్నాయ్. కాదు, నిలవేసి అడుగుతున్నాయి.

ఏం చెప్పనూ... బొత్తిగా నిర్దయుడినయిపోయాను.

నీ చిరంజీవి

రహి

29-4-65

# అమ్మా

అప్పికట్ల : 29-4-65

అమ్మా.... నమస్కారములు....

హఠాత్తుగా నిన్న మధ్యాహ్నం అప్పికట్ల నుండి కబురు వచ్చింది. సాయంత్రానికి తహశీలుదారు, సబ్‌కలెక్టర్ వస్తున్నారని. వెంటనే పార్శిల్ ట్రైన్‌లో బయలుదేరి పగలు 10 గంటలకు అప్పికట్ల వచ్చేశాను.

నిన్న యీ కబురు లేకపోతే, యివ్వాళ బాపట్ల వచ్చి ట్యాక్సీలో జిల్లెళ్ళమూడి వచ్చి రేపు యిక్కడకు తిరిగి వద్దామనుకున్నాను.

అన్నీ ఈ నాకోరికలవలెనే యిదీ నన్ను ఒక్క మొట్టు మొట్టి వికటాట్టహాసం చేసింది.

ఏమయినా ఎలాగయినా నిన్ను చూడాలి. నీ పాదాలు ముద్దుపెట్టుకోవాలి. నీఒళ్ళో పడుకోవాలి. నాతపన చల్లారాలి. నా మంటలు ఆరాలి. కానీ ఆక్షణం ఎప్పుడో ? అసలు ఉన్నదా? తప్పక ఉన్నదనే నా ప్రగాఢ విశ్వాసం.

ఈలోగా కలలోనైనా.... అనుకుంటే తమాషా అమ్మా, పిలిస్తే పలికే నిద్ర బ్రతిమిలాడినా దరిదాపులకయినా రావటం లేదు. ఏమిటో నిద్రకు కూడా నామీద పంతం ? ఆప్తబంధువు కూడా అలిగితే నే చేయగలిగేదేముంది. ఎన్ని బాధల్లో ఉన్నా ఒళ్ళోకి జాలిగా తీసుకొని జోలపాడి మనసులో ఉపసమనం చేయగలిగేది అదేకదా. (అది ఒక్కటే కాదనుకో)

నోరు పూసింది. పెదవులు వాచినయి. ఏం చేయను. నా కాళ్ళకు నేనే సంకెళ్ళు వేసుకున్నాను. బందీ అయినాను. నీవే విడుదల చేయాలి. అందుకు అలమటిస్తూ

నీ **రహి**

# అమ్మా

అప్పికట్ల : 17-5-65
సా. 4-10 ని॥లు

చిరదుఃఖరహి ప్రియజనయిత్రీ...

నమస్సులమ్మా ....

నిన్న ఉదయం నేనూ, మా అమ్మా ఒకేసారి బాపట్ల బస్సుస్టాండులో దిగాము. ఆమె నాకోసమే బయలుదేరింది. సుధాకర్‌కు జ్వరం తీవ్రమయి, నాకోసం కలవరింతలు ఎక్కువయ్యేటప్పటికి తప్పనిసరిగా బయలుదేరింది బాపట్ల వచ్చి నా కోసం ఎవరినయినా పంపుదామని.

నిన్న ఉదయం బాపట్లలోనే ఆగిపోయినాము. సాయంకాలానికి అప్పికట్ల చేరాము. ఇవ్వాళ ఉదయమే జమాబంది పని మొదలు పెట్టాను. కాని 10 గంటలు గడిచినాయన్నమాటేగాని 10 అంకెలు పుస్తకం మీద పడలేదు. కారణం?

జమాబందికాగానే ఒకనెల యాత్రలు చేసి రావాలని ఉన్నదని యివ్వాళ ఉదయం ఒక ప్రకటన చేశాను. అప్పటి నుండి యింట్లో కల్లోలం ప్రారంభమయింది.

నన్ను చూడగానే సుధాయ్ జ్వరం "మాయమై" పోయింది. యివ్వాళ తిరుగుతున్నాడు. కాని క్షణం కూడా నన్ను వదలడంలేదు.

మధ్యాహ్నం మా చిన్నక్కయ్య భట్టిప్రోలు నుండి వచ్చింది. నీ కోసమని కొబ్బరి బోండాలు తెచ్చింది. వాటిని అక్కడకు ఎట్లా చేర్చడం ? అన్నది. ఏమీ తోచక నేనే తాగడం మొదలుపెట్టాను. యిక్కడనే పూర్తి అవుతయ్.

నాన్నగారికి నమస్కారములందించుము. బామ్మ ఎట్లా ఉన్నది ? తెలుప ప్రార్థన.

నమస్సులతో...
**నీ రహి**

శ్రీమాన్ శ్రీ[illegible]
18.5.65
సా. 4.25 ని.లు

శ్రీమాన్...

నమస్సులతో...

"ఇంద్ర భవనం లో ఉండి వచ్చాక
పూరిపాక కంటికి నచ్చుతుందా
అమృతం తాగిన తరువాత
కొబ్బరినీళ్ళు రుచి అనిపిస్తాయా
అలాగే నీ దగ్గర నుంచి వచ్చాక
నీవంటే నాకెంత అసహ్యంగా ఉందో"

నమస్సులతో

[illegible]

## **అమ్మా**

అప్పికట్ల : 18-5-65

సా. 4.25 ని॥లు

అమ్మా....

నమస్సులమ్మా...

ఇంద్రభవనంలో ఉండి వచ్చాక
పూరి గుడిసె కంటికి నచ్చుతుందా?
అమృతం తాగిన తరువాత
కొబ్బరినీళ్ళు రుచి అనిపిస్తాయా?
అలాగే నీ దగ్గరి నుంచి వచ్చాక
నేనంటే నాకెంత అసహ్యంగా ఉందో...

నమస్సులతో...

నీ అనుంగుబిడ్డ **-రహి**

# అమ్మా

అప్పికట్ల : 19-5-65

సా. 4-30 ని॥లకు

కంటకవ్రాత సంక్లిష్టమార్గ సంచార తత్పరా...

అమ్మా.... నమస్సులమ్మా...

మానవుడు మరణించడానికి చాలా దోవలున్నాయమ్మా

ఆహారం లేకున్నా,

నీరు లేకున్నా,

ప్రాణ వాయువు లేకున్నా

జీవజ్యోతి ఆరిపోతుంది. ఇవి కాక

హఠాత్సంభవాలు వేనవేలు

కానీ,

ఇవేమీ "నీవులేక" కృశించి నశించడం కన్నా

బాధాకరాలు కావమ్మా!!

ప్రణతులతో

నీ

చిరంజీవి **రహి**

# అమ్మా

అప్పికట్ల : 26-11-63, రాత్రి 10.00

అమ్మా.... నమస్కారములు....

రాత్రి నేను బాపట్ల వచ్చి లెక్కల పుస్తకాలు తీసుకొని బస్టాండులో కనుక్కుంటే గం॥9.30ని॥ల దాకా బస్సు రాదన్నారు.

తలనొప్పి తగ్గలేదు. వళ్ళు నొప్పులు జాస్తిగా ఉన్నాయి. ఎంతో నీరసంగా ఉంది. బస్సులో కూర్చోలేననిపించి. బుల్లేము గారింటికి వెళ్ళి రాత్రి అక్కడే పడుకున్నాను. ఇవ్వాళ ఉదయమే యిక్కడకు వచ్చాను...

నేను రాగానే నన్ను చూసి మా రాముడు బాబాయి మాట మాత్రం కూడా చెప్పకుండా - 10 నిమిషాల్లో నేను ఇంటికి వెళ్ళేలోపల పొన్నూరు వెళ్ళి పోయినాడు. అలా వెళ్ళిపోవడం చాలా బాధ అనిపించింది. ఏం చేయను.

అంతలోకి జీపులో రెవిన్యూ యిన్‌స్పెక్టర్ వచ్చాడు. మాట్లాడుతున్నాను. అంతలో టాక్సీలో తహశీలుదారు వచ్చాడు. వాళ్ళతో మాట్లాడి పంపించాను.

ఇంటికి వచ్చాను, శ్మశాననిశబ్దత.

ఇంట్లో ముఖ్యమైన మనిషి చనిపోగా ఏడ్చి ఏడ్చి దహన క్రియలు జరిపి గుండెలు రాయి చేసుకుని యింటికి తిరిగి వచ్చిన తర్వాత మౌనంగా, గంభీరంగా ఎవరి దారిన వాళ్ళు ఎట్లా ఉంటారో అట్లా ఉన్నది.

కంచంలో అన్న పెట్టారు. తినిలేచి వచ్చాను. ఎవరూ పలకరించలేదు. నేను ఆ నిశబ్ద నీరవతను భంగం చేయలేదు.

వెంటనే మళ్ళీ రాముడు బాబాయిగారింటికి వచ్చాను. ఆయన యింకా రాలేదు. నా మీద కోపంతోనే అట్లా వెళ్ళిపోయినాడా ? అనిపించింది. లోపలికి వెళ్ళి మా శేషమ్మ పిన్నిని అడిగాను. "ఏమి పనిలేదు. ఉరికినే వెళ్ళాడు. చిన్న పనిమీద. ఈ పాటికి రావల్సిందే". అన్నది. ఏమి చేయటానికి తోచలేదు. ఆఫీసు గదిలోకి వెళ్లి కూర్చోని పుస్తకాలు తెరిచాను.

లెక్కలలోకి మనస్సు మళ్ళలేదు. కుర్చీలో వరిగిపోయి ఆలోచనలలో మునిగిపోయినాను. ఎప్పటికో మా బాబాయి వచ్చాడు. లెక్కలు మొదలు

పెట్టాం. చీకటి పడింది. ఇంటికి వచ్చాను. స్నానం చేసి అన్నానికి కూర్చున్నాను. కంచంలో అన్ని వడ్డించి నేతి గిన్నె పక్కన పెట్టి ప్రక్కకు వెళ్లిపోయింది అమ్మ. బామ్మ అంత దూరంలో మంచం మీద పడుకుంది మాట్లాడకుండా.

పద్మావతి కూడా ప్రక్కనే కూర్చోకుండా పిల్లవాడికి అన్న పెడుతున్నది. కంచంలోకి చూశాను. ఫక్కుమంది.

అన్నం దీనంగా చూస్తూ నిట్టూర్పులు విడుస్తున్నది. అన్నం కలుపుకున్నా. అమ్మకోసం చూస్తూన్నాను నెయ్యి వేస్తుందని. అమ్మ రావటం లేదు గమనించాను.

నేను నెయ్యి వేసుకుని అన్నం తినడమా? – లేవటమా? తల్లికే అన్నం పెట్టడం భారం అనిపించిన పిదప యింకా ఎట్లాగమ్మా అన్నం తినడం? తల్లికే బరువైపోయిన ఆ కొడుకు యింకా బ్రతకడం అనవసరమమ్మా. నీచం కూడా. వాడింక బ్రతక్కూడదు.

కానీ... కానీ... అమ్మా నా గుండె యింకా పగిలిపోదేం ? నా రక్తం ఇంకా గడ్డకట్టుకు పోదేం ? నా తల వేయి వక్కలవదేం. దుర్భాషలాడిన దుష్టులను సైతం నీ చల్లని ఒడి చేర్చుకోగలిగిన నీ అమృత హృదయానికి నా మాట, అమ్మా అన్న నా దీనాలాపం చేదయిందా అమ్మా.

నా ఆక్రోశం నిన్ను చేరటం లేదా?
నా కన్నీరు నిన్ను కరిగించటం లేదా ?
నా వేదన నిన్ను కదిలించటం లేదా ?

కరుణామయి వన్నారే ! కఠినత్వం లేదన్నారే! నీ కరుణంతా ఏమయిందమ్మా? ప్రపంచంలో కఠినత్వమంతా యిప్పుడు నీవే ప్రోది చేసుకున్నావా, అమ్మా ! యీ అల్పుని మీద ప్రయోగించటానికి.

వెన్న ముద్దను కొయటానికి కత్తులు నూరాలా ? అమ్మా పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం సంధించాలా ? పంతం, పట్టుదల, లేని నీవు నా మీదనే అది చూపాలా అమ్మా ? ఒక్కసారి కళ్ళు విప్పు. ఒక్కసారి చేయి చాపు. అమ్మా ఒక్కసారి తల ఎత్తూ. అదేంటమ్మా నీ ముఖాన్న చెయ్యి. అడ్డం తియ్యి. అమ్మా ఒక్కసారి మాట్లాడమ్మా... మాట్లాడవూ, మాట్లాడవామ్మా.

పోనిలే అమ్మా ఏకాకిగానే పోరాడుతాను. నీ కోసం నీ పాదాలను చేరుకోవటం కోసం. కాదు కాదు నా అమ్మ కోసం. ఆ బాధల భగవంతుడి కరుణ కోసం. కాదు కాదు, ఆ భగవంతుని కడలేని కన్నీళ్ళ ప్రవహంలో కరిగిపోయేందుకోసం.

ఆ అనంత బాధల మహొజ్వల దారుణ దావాగ్ని జ్వాలల్లో ఒక సమిధనై పోయ్యేందుకోసం. ఈ పర్వతాలు ఈ నదులు ఈ అడవులు ఈ లోకం నన్నాకర్షించదు. ఈ సంసారం నన్ను బంధించదు. ఈ భార్య బిడ్డలు నన్ను కట్టేయలేరు.

నువ్వే సర్వస్వం అనుకున్నాను.

నువ్వు మినహా ఏమీ వద్దు అన్నాను.

నీ కోసమే చస్తానన్నాను.

అంతకన్నా నేను చేసిన తప్పేముంది ?

కత్తిదూసిన వాని మీద కనికరపు తేనె సోనలు కురిపించ కలిగిన కరుణామయివి. నాతో మాట్లాడ లేవా ?... నేనమ్మా నేను... అమ్మా..! అమ్మా..! అటు గొడవైపు తిరుగుతున్నావా ? మాట్లాడకపోతే మాల్లే, అమ్మా! ఇటు తిరుగమ్మా! ఒక్కసారి చెయ్యి అడ్డం తీయమ్మా! కళ్లు తెరువమ్మా! నన్ను చూడమ్మా...!

మకిలి పట్టిన గోడే నా కంటే నయంగా ఉన్నదా, అమ్మా నేనేం చేశాను? ఏమన్నా తప్పు చేశానా ? ఏమన్నా నేరం చేశానా ? ఏమన్నా పాపం చేశానా?

ఏమిటోనమ్మా ఒక్కసారి చూడమ్మా, చూడలేవా? ఎందుకలా నీ ముఖం నల్లపడుతూంది ? ఏమిటాలా చీకట్లు వెన్నెలను మింగేస్తున్నాయి? నీక్కుడా వెక్క సమయినానా ? నీ క్కూడా బరువయినానా, అమ్మా మరిలేకపొతే నేనేం చేశాను? నా ప్రాణాలు పోవేం? ఇంకా నా కన్నులు చూస్తున్నయ్యేం? నా చెవులు వింటున్నయ్యేం ? నా అవయవాలు సజీవంగా ఉన్నయ్యేం ? నాలో చైతన్యం ఉడిగిపోలేదేం ?

సరే, కానియ్, అమ్మా. ఒక్కడనే పోరాడతాను.

నా విశ్వాసమే నా కవచం, నా ప్రేమ, నా పవిత్రత, నా భక్తి, నా ధైర్యం నాకు చాలు. అవే నా ఆయుధాలు. ప్రపంచం రెండు వ్రక్కలవదేం? భూమి నె(రైలిచ్చి ఆకాశం విరిగి నా నెత్తిన పడదేం ?

నాకు బ్రతుకు మీద ఎంత తీపో అంత ఆవేశం జాస్తి. ఆ ఆవేశంలోనే నేనేమవుతానో ఏంచేస్తానో తెలియదు. కాని ఆ సమయంలో బ్రతుకు మీది ఆశ ఉద్రేకాన్ని అణచి మనసును చంపి అన్నం తిను అన్నది. నెయ్యి వేసుకుని పెద్ద పెద్ద ముద్దలు చేసుకుని పొట్టపగిలేలా తిన్నానమ్మా, నిజం, రోజూకన్నా ఎక్కువ తిన్నానమ్మా – ఎందుకని ? ఆవరించే ప్రశాంతత. యుద్ధం తప్పదు. వాళ్ళు బాణాలు సంధించే లోపలనే నేను నా ధనుస్సును ఎక్కుపెట్టాలి. నేనే ముందుగా రణరంగంలోకి దూకాలి. యుద్ధ సన్నద్ధుడయిన నన్ను ఒక్కసారి చూడమ్మా ! నీ చల్లని చేతితో నన్ను ఒక్కసారి తాకమ్మా.

నీ చిరంజీవి

రహి





ఔరంగాబాద్ నుండి వచ్చిన తరువాత మార్చి 28వ తేదీ నుండి ఏప్రిల్ 5వ తేదీ వరకు హైమ అమితంగా బాధపడింది. నిర్ణేత అయిన అమ్మకూడా విలవిలలాడి పోయింది. అయిష్టంగా నయినా సరే, అమ్మ అంగీకరించిన తదుపరి, నాన్నగారు, సోదరులు సుబ్బారావు, రవి, నేను-హైమను చికిత్స నిమిత్తం గుంటూరు ప్రభుత్వపు ఆసుపత్రికి తీసుకుని వెళ్ళాం .

అక్కడికి చేరేసరికి సాయంకాలం గం. 4.39 అయింది. అమ్మ గుంటూరు ఆసుపత్రిలో కారులో నుండి దిగనైనా లేదు. వెళ్ళిన కొద్ది నిమిషాలకే, చికిత్స ప్రారంభమయినా కాకముందే హైమ ప్రాణం అనంత వాయువుల్లో లీనమైనట్లు ఆసుపత్రి వైద్యులు ప్రకటించారు. అమ్మ వెంటనే వెను దిరిగి జిల్లెళ్ళమూడి వచ్చింది.

మృతదేహాన్ని తీసుకుని అందరం గుండెలు పగిలే దుఃఖంతో వెనుదిరిగి వచ్చాము.

ఆనాడు సప్తమి, వచ్చే ఏకాదశినాడు అమ్మ 46వ జన్మదిన మహోత్సవం. అందుకని వేసిన పందిళ్ళు, వాటికి అమర్చిన విద్యుద్దీపాలు, పూజావేదిక-అవధులు దాటిన దుఃఖంతో బావురుమంటూ వెలవెలబోయాయి.

మర్నాడు అంటే 6వ తేదీన ఉదయం నాన్నగారు దహనం కోసం ఏర్పాట్లు చేయిస్తానంటే అమ్మ " అదెక్కడికి పోయిందీ , దాన్నిక్కడే ప్రతిష్ఠచేస్తా" నన్నది. నాన్నగారు అంగీకరించారు. అమ్మ తన నివాసం ముందు హైమను భూసమాధి చేస్తా - నన్నది.

ఆరడుగుల లోతున ఒక కందకం త్రవ్వాము. మధ్యలో పెద్ద పెద్ద

నాప రాళ్ళు  నాలుగు నాలుగు వైపులా గోడలవలె అమర్చి, గది ఏర్పాటు చేశాము. అందులో యిసుకపోసి దాని పైన జింకచర్మం వేసి హైమ జపం చేసుకునేటప్పుడూ, పూజాసమయంలోనూ ఉపయోగించే వస్తువులు అందులో వేశాము. దాన్ని 'బ్రహ్మ గ్రంధి' అన్నది అమ్మ.

సాయంకాలం ఆరు గంటలకు అమ్మ తాను నిర్ణయించుకున్న విధి నిర్వహణ కోసం బయటకు వచ్చింది. దుఃఖ వివశయై శోకదేవతవలె ఉన్న అమ్మను చూడగానే అందరూ చేష్ట లుడిగిపోయినట్లు అమ్మవంకనే చూడసాగారు. అశ్రుసిక్తాలయిన కళ్ళతో అమ్మ ఒకసారి అందరివంకా చూసి హైమ దగ్గరకు వెళ్ళింది. కాళ్ళకు కట్టిన గుడ్డముక్కను తీసేసింది. తర్వాత బొట్టు పెట్టి కర్పూరపు పొడి వెంట్రుకలకు రాచి చుట్టూ తిరిగి టెంకాయలు కొట్టింది. అప్పుడు టెంకాయ పెంకు అమ్మ కుడిచేతి వ్రేలుకు గుచ్చుకుని రక్తం కారింది. ఆ రక్తంతో హైమకు బొట్టు పెట్టి ఒక టెంకాయ చిప్పలో కర్పూరం వెలిగించి హైమ కళ్లదగ్గరగా చూపించి అర్ధనిమిలితాలైన కళ్ళను విడదీసి సంజ్ఞచేసింది అమ్మ - హైమను తీసుకుని వెళ్లి కూర్చోబెట్ట - మని.

హైమను వరండాలో కూర్చోబెట్టేలోగా వరండా పొడవుగా అమ్మ కొబ్బరికాయలు కొట్టింది.

హైమను అక్కడనే వరండా స్తంభానికి అన్చి తూర్పుకు అభిముఖంగా కూర్చోబెట్టాము. అమ్మ స్వయంగా హైమ శరీరం మీద దుస్తులు అచ్ఛాదనలేని భాగాని కంతటికీ నూనె పెట్టి సున్ని పిండితో నలుగు పెట్టి  సీకాయతో తలంటి పోసింది. తాను ఉపయోగించే సబ్బుతో హైమ పొట్టా ఒళ్ళూరుద్ది చన్నీటితో స్నానం చేయించింది.

ఆ తర్వాత శ్రీసూక్తం పఠిస్తుండగా ఆవుపాలతో అమ్మా, నాన్నగారూ, తర్వాత అందరూ, హైమను అభిషేకించారు. కేవలం క్షీరాభిషేకమే కాక పంచామృతాలతో అభిషేకం జరిగాక గంగాజలంతో, పన్నీరు కలిపిన నీటితో,

సీకాయితో అమ్మ తలరుద్ది నీళ్ళుపోసింది. చివర్లో వేడినీళ్లు పోస్తున్నప్పుడు అమ్మ ఆదుర్దాగా అన్నది. " దానికి ఊపిరాడొద్దా ? వేడిగా వద్దు, చల్లగా తీసుకురండి" అని. హైమపై ఉన్న ప్రేమతో అమ్మ అట్లా అన్నదని అందరూ అనుకున్నారు. కానీ అప్పటికే హైమలో చైతన్యం ఏర్పడిందని ఎవరూ అక్షణాన ఊహించలేకపోయారు.

స్వాభావికంగా హైమ శరీరం మృదువైనదే, అయినా 5వ తేదీ సాయంకాలానికి మాత్రం అట్లాలేదు. చల్లదనంతో కూడిన కఱ్ఱలా బిగుసుకుపోయి బరువుగా ఉన్నది. కాని ఎప్పుడయితే అమ్మ ప్రతిష్ఠ క్రతువు ఆరంభించిందో అప్పుడే హైమలో పూర్వపు మృదుత్వం, నులివెచ్చదనం ఏర్పడ్డాయి. ఆ దేహాన్ని వాలిపోకుండా జారిపోకుండా ఒకరికి నలుగురు పట్టుకోవాల్సి వచ్చింది. అభిషేకం చేస్తున్నప్పుడు మృతదేహానికి చేస్తున్నట్లులేదు. బాగా డస్సిపోయి నీరసంగా ఉన్న పసిపిల్లకు నీళ్ళు పోస్తున్నట్లున్నది.

అభిషేకం ముగిసేసరికి గం॥ 7.00 అయింది. "తొందరగా కానివ్వండి. ఆలస్యం కానివ్వద్దు" అంటూ అమ్మ త్వరపడ సాగింది.

రుక్మిణక్కయ్య, కృష్ణవేణక్కయ్య వాళ్ళు హైమ శరీరంమీద అంతకు క్రితం ఉన్న దుస్తులు తీసేసి పట్టెడు జరీ అంచుతో బంగారు రంగులో ఉన్న పట్టు పరికిణీ కట్టి నల్లని అంచు ఉన్న నీలిరంగు పట్టురవిక తొడిగారు. ఓణీ హైమదే వెయ్యబోతుంటే అమ్మ వారించి తాను గుంటూరు కట్టుకు వచ్చిన బంగారురంగు పట్టు చీర హైమకు ఓణీగా వెయ్యమన్నది. వెయ్యబోతుంటే, అట్లా కాదంటూ ఎఱ్ఱ పట్టుబట్ట శిరస్సునిండా చుట్టి దానిపైన ఆ చీరను ముసుగ్గా వేసి పూల దండలు వేసింది. తర్వాత జడలో పూలుపెట్టి, కళ్ళకు కాటుక, కనుబొమ్మల మధ్య కళ్యాణం బొట్టూ పెట్టింది. హైమకు తన చేతి బంగారు గాజులు వేసింది. మెళ్ళో తన బంగారు గొలుసు వేసింది.

హైమ కాళ్ళను మడవడం ఎట్లాగూ - అని ఆలోచన జరుగుతుండగానే - ఏమంత ప్రయత్నం లేకుండానే హైమ పద్మాసనంలో కూర్చున్నది. చూచినవాళ్లందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

అప్పటికి గం. 7.30 ని॥ల అయింది. తపస్సమాధిలో ఉపవిష్టురాలయిన యోగినిలా ఉన్న హైమను ఐదుగురు సోదరులం తీసుకువచ్చి పూర్వాభిముఖంగా బ్రహ్మ గ్రంథిలో కూర్చోపెట్టాం. ఆ సమయంలో పద్మాసనం సిద్ధాసనంగా మారింది.

అమ్మకూడా అందులోకి దిగి ఆ గ్రంథి చుట్టూ టెంకాయలూ, గుమ్మడికాయలూ కొట్టి పసుపు, కుంకుమ, పూలూ జల్లింది.

ఇక్కడనుండి అమ్మలో చిత్రమయిన పరిణామం కనిపించింది. అమ్మలోనే కాదు, ఆ వాతవరణంలోనూ మార్పు వచ్చింది.

అమ్మ రూపులో, మాటలో, నవ్వులో, చేతలో అన్నిటిలో ప్రత్యేకత కనిపించసాగింది. ఆ మహత్తర కార్యక్రమం అమ్మ నవ్వుతూ నిర్వర్తిస్తుంటే - ఆ నవ్వులో మృదు మధుర మంజులహాసం కనిపించలేదు. బాలారుణ కాంతితో దీపించ సాగింది ఆ నగుమోము.

ఆ సమయంలో అమ్మ చేసిన ప్రకటన గమనిస్తే అమ్మ ఎవరో స్పష్టంగా ఎరుక పడుతుంది. ఇదంతా చూస్తూ వింటున్న ఎవరిలోనూ సంతోషమూ లేదు. విషాదమూ లేదు - ఈ రెండింటికీ అతీతమైన అనిర్వచనీయమైన ఒక వింత అనుభూతిలో ఆ రెండు గంటల కాలమూ ఉండిపోయారు. ఎవరిలోనూ హైమ పోయింది. అన్న దుఃఖపు ఛాయలు కనుపించలేదు.

టెంకాయలు కొట్టగానే ఆ గ్రంథిలోనే నాపరాళ్ళపైన ఓ మూల తూర్పుదెసకు ఎదురుగా కూర్చుని హైమ శిరస్సు మీద తనదక్షిణపాదం పెట్టింది. ఒక యజ్ఞోపవీతం హైమ శిరస్సుకు తన పాదానికి కలిపి వేసింది.

అందరి వంకా చూస్తూ " ఇంకా నాలుగు రోజులు బ్రతకకపోతే మాత్రం ఏం ? ఇంతకంటే ఏం కావాలి ? ఎవరూ బాధపడొద్దు. ఇది నేను కావాలని చేసుకున్నది. అది ఎక్కడికి పోయిందని ! ఎక్కడికీ పోలేదు. ఇక్కడే ఉన్నది" అన్నది. అంతలో గోవిందరాజుల దత్తాత్రేయ శర్మగారు "హైమకు వేడి వస్తున్నదమ్మా" అన్నారు.

" ఆ. ఇందాకటి నుండి చన్నీళ్ళు పోశాం కదూ ! " అని అమ్మ అన్నది. హైమ శిరస్సు పై ఉన్న అమ్మపాదం బాగా వేడెక్కింది. అమ్మకు అది సహజం అనుకున్నా, హైమశిరస్సూ అట్లాగే ఉన్నది.

" నా అగ్ని ప్రవేశించింది" అని ప్రక్కనున్న సావిత్రీ రమణా వాళ్ల నుద్దేశించి శ్రీసూక్తం చదవమన్నది.

హైమను పట్టుకున్న దత్తుగారితో " అదీ, నేనూ ఉంటాము, మీరు వదలండి" అన్నది అమ్మ. వారు వదిలేశారు. అక్కడున్న అందరికీ పసుపు, కుంకుమ, పూలు యిచ్చి లోపల వెయ్యమన్నారు. అంతా వేశాక అప్పుడు ఒక వరుస విభూతీ, మరొక వరుస సైంధవమూ పోస్తూ " నా కాలు మాడుతున్నది వేడికి, నాడికూడా వస్తుందేమో. అయినా యిందులో వింత ఏముంది ?" అన్నది అమ్మ.

అమ్మకు అంతా సహజమే ! విశేషం ఏమున్నది ?

5వ తేదీ సాయంకాలమే భద్రాద్రి రామ శాస్త్రి గారు హైమలో శ్వాసను గమనించారు.

అచ్చుతుని సుబ్బారావుగారు అమ్మను అడిగారు " సజీవ సమాధా అమ్మా? అని. " చూస్తున్నారుగదా, " అని అమ్మ జవాబు !

విభూతీ, లవణమూ సగంవరకూ పొయ్యగానే అమ్మ తనచేతి బంగారు గాజులు తీసి అందులో వేసింది.

హైమకు వాడిన దిండ్లూ, పక్కబట్టలూ తెచ్చి యివ్వగా. ఒకటి హైమకు వీపు వెనుక గానూ, రెండోది ముందువైపూ వేసింది అమ్మ. సుబ్బారావుగారు విసన కఱ్ఱ తీసుకుని విసరబోతుంటే, " యీ నాలుగు రోజూలూ నేనే విసిరాను. ఇప్పుడూ నేనే విసురుతాను " అంటూ అమ్మ విసిరింది.

ఆ విభూతీ లవణం కలిసిన రాశిలో విశిష్ట లావణ్య రాశి హైమ శిరస్సు మునిగిపోయాక అమ్మ తన పాదం తీసి అందులో దిగింది. హైమ శిరస్సు పై కాసేపు కూర్చొని తర్వాత పమిటచెరగు కప్పి శిరస్సు మధ్యభాగంలో కుడిచేతి వ్రేలితో ఏమేమో వ్రాసింది.

అక్కడున్న కొందరివంక చూస్తూ ...

" హైమను గుంటూరు తీసుకుని వెళుతుండగా హైమకు చూపుపోయింది. లోకం శూన్యమైంది. చూట్టూ చీకట్లు కమ్మాయి. " ఏమీ కనిపించడం లేదమ్మా" – అన్నది. కొంచెంసేపుండి " అమ్మా ? నీవు మాత్రమే కనుపిస్తున్నావు అన్నది !

హైమ మనకు దారి అయింది. ఎన్ని శాస్త్రాలూ పురాణాలూ చదివినా, చావు భయం తప్పదు. కాని హైమకు అది లేదు, హాయిగా ' అమ్మా – వస్తున్నాను' అంటూ వచ్చింది. హైమ మనకు దారి అనుకుని యిక ఎడతెరిపి లేకుండా నామం చెయ్యండి. ఇది ఆలయమై సాధకులకు నిలయమవుతుంది.

ఎట్లా వచ్చిందో అట్లా కూర్చుంది. ఎక్కడనుండి వచ్చిందో అక్కడికే వెళ్ళింది. నేను బాధపడుతున్నానా. ఏడుస్తున్నానా అంటే బాధపడుతున్నాను, ఏడుస్తున్నాను. చలిగాలికి కప్పుకున్నట్లు, ఎండకు విసురుకున్నట్లు. ఏడుపు వస్తున్నదీ, ఏడుస్తున్నాను. ఏడుపు ఆపుకోవాలని మాత్రం ప్రయత్నం చెయ్యడం లేదు. ఏది చెయ్యాల్సి వచ్చినప్పుడు అది చేయడమే నా విధి.

నేను నవ్వుతూ చేస్తున్నానంటే దుఃఖం లేదని కాదు, ఏడుపంటే కన్నీళ్ళు కావుగా. శరీరంతో ఉన్నాను కనుక రక్తమాంసాలతో ఉన్నాను కనుక, చలీ వేడీ అనుభవిస్తున్నాను కనుక, మీ మధ్య ఉన్నాను కనుక - ఇవి తప్పవు. ఉందామనుకున్నాను. ఉంటున్నాను. లేకపోతే యివేమీ లేవు. ఇందాక బయటికి వచ్చేముందు బాగా ఏడుపు వచ్చింది. ఏడ్చాను. ఇప్పుడిక రావడం లేదు. ఎప్పుడయితే ఇది నా బాధ్యత అని స్నానం చేసి బయటకు వచ్చానో, యిక ఏడుపు రావడం లేదు. ఇందాక వేడి వచ్చిదనుకుంటిరే - యిప్పుడు యింకొకటి వస్తుంది " అంటూ తన దైవత్వాన్ని మానవత్వాన్ని సమ్మిళితం చేసి, ఒక అపూర్వమైన వ్యక్తిత్వాన్ని మన కళ్ళకు కట్టించింది.

కళ్ళు మూసుకుని కొన్ని నిమిషాలు కూర్చుని కళ్ళు తెరిచి " లేని పోనిది యీట్లా కాసేపు కూర్చుంటే శక్తి యిస్తున్నదంటారేమో" అన్నది అమ్మ చిరునవ్వుతో.

శ్రీ పొట్లూరి సుబ్బారావుగారు అన్నారు నవ్వుతూ "నేను అదే అనబోతున్నాను" అని. తర్వాత అమ్మలేచి టెంకాయకొట్టి ఆ నీళ్ళు హైమ శిరస్సు మీదచల్లి విభూతి పోసి మంచినీటి గ్లాసును బోర్లించింది. అదే సమయంలో హఠాత్తుగా లైట్లు ఆరిపోయాయి. ఐదు నిమిషాల తర్వాత మళ్ళీ లైట్లు వాటంతట అవే వెలిగాయి. ఆ వెలుగులో హైమ శిరస్సున రక్తం కనిపించింది.

ఆ రక్తస్రావం సహస్రార భేదనం వల్లనే. ఈ క్రతువును నిర్వహించిన అమ్మ 'బ్రహ్మగ్రంథి విభేదిని' కదా! జీవి పరిపూర్ణతకు అవసరమైన సోపాన పరంపరను అమ్మ హైమకు ప్రసాదించింది. సాక్షాత్కారాన్నీ, మృత్యుంజయత్వాన్నీ, జ్ఞానాన్నీ, సిద్ధినీ ఆరోహణ క్రమంలో అందించింది. పరిపూర్ణమైన సిద్ధికి చిహ్నమే సహస్రార భేదనం. ఆధ్యాత్మిక శిఖరాగ్ర స్థితీ, యోగానికి పరాకాష్ఠ దశా అయిన బ్రహ్మగ్రంథి విభేదనం ద్వారా మానవి

అయిన హైమను మాధవిగా రూపొందించడానికే ఈ క్రతువు నడిపించింది. అమ్మ.

అమ్మ కొన్ని రోజులుగా కప్పుకుంటున్న తెల్ల పట్టు చీరను బ్రహ్మగ్రంథిపైన కప్పి - "డాక్టర్ జీ ! ప్రస్తుతానికి నా కర్తవ్యం ముగిసింది" అన్నది. ఆ పై నాన్నగారు, అమ్మ కలిసి కర్పూరం వెలిగించారు.

అమ్మ ఆదేశానుసారం అప్పటి నుండి అఖండనామం ఆరంభమైంది.

ఈ కార్యక్రమమంతా నిర్విణ్ణమయిన హృదయంతో తిలకించిన వారికి అమ్మ చేసిన 'శక్తిపాతం' కళ్లకు కట్టినట్లయింది. తన నిర్ణయానుసారమే గుంటూరు ఆసుపత్రిలో మరణించిన హైమకు ప్రాణంపోసి, సజీవ సమాధి చేసింది అమ్మ.

హైమ మానవిగా తన దేహం వదిలింది సప్తమినాడు అయినా, అమ్మ హైమను మాధవిగా మలచింది చైత్రశుద్ధనవమీ, శనివారం, పునర్వసూ నక్షత్ర తురీయచరణంలో. అమ్మ హైమకు మాధవత్వాన్ని ప్రసాదించిన వేళ దశరథాత్మజుడైన శ్రీరామచంద్రమూర్తి అవతరించిన శుభఘడియకూడా కావడం మరో విశేషం.





శ్రీ సాగర్‌గారి కుమార్తె కుమారి ఝాన్సీ. ఆ అమ్మాయికి హఠాత్తుగా పెద్ద ప్రమాదం జరిగింది. తిరిగే మోటారు చక్రంలో ఆ అమ్మాయి జట్టు ఇరుక్కుంది. ఆ చక్రభ్రమణవేగానికి చక్రంలో ఇరుక్కుపోయిన ఆ అమ్మాయి జట్టు - తలపై చర్మాన్నికూడా లాగేసింది. కేవలం దైవలీలే అనుకోవాలి- హఠాత్తుగా ఎక్కడినుండో ఎవరో వచ్చి స్విచ్ ఆఫ్ చేశారు. చక్రం ఆగిపోయింది. కానీ ఆ అమ్మాయి స్పృహలేని స్థితిలో నెత్తురు పిడుగులా పడిపోయింది. వెంటనే నేను కారులో ఝాన్సీని గుంటూరు ఆసుపత్రికి తీసుకు వెళ్ళాను. మా కందరికి చాలా ఆందోళనగా ఉంది. ఆ అమ్మాయి బతుకుతుందా అని సందేహంగా వుంది. కాని విచిత్రమేమంటే స్పృహలేని పరిస్థితిలో కూడా ఝాన్సీ లయ తప్పకుండా నామం చేస్తున్నది. అంటే ఆ అమ్మాయి శరీరంలో ప్రతి అణువూ కూడా నామాంకితమై పోయింది. ఇక - సర్వశక్తి మంతమయిన ఆ నామం ఆ అమ్మాయిని ఎందుకు రక్షించదూ ?

ఆ స్థితిలో ఆ అమ్మాయిని చూస్తున్న మాకు దుఃఖం వచ్చింది. అంటే ఆ అమ్మాయికి జరిగిన ప్రమాదానికి కాదు. ఆ అమ్మాయి గాఢ భక్తికి. అటువంటి ప్రమాద పరిస్థితిలో కూడా స్పృహలేని స్థితిలో కూడా లయ తప్పకుండా రాగం చెడకుండా నామం చేస్తున్నదంటే ఆ శరీరంలో నామం ఎంతగా జీర్ణం చేసుకుని ఉండాలి ? .... ఆ ఆలోచనతో మా కళ్ళు అశ్రు పూరిత మయ్యాయి.



## 19-06-1969

**'అనసూయ వ్రతం'** రూపకల్పన చాలా కాకతాళీయంగా జరిగింది. సజ్జా వారి పాలెం సోదరి శ్రీమతి వల్లభనేని సారసాక్షి అమ్మను ప్రార్థించింది తన సమస్యలు తొలగించమని. అమ్మ సమక్షంలో సత్యనారాయణ స్వామి వ్రతం చేసుకుంటామన్నారు. అప్పుడు అక్కడే ఉన్న సోదరుడు శ్రీ కాసు రాధా కృష్ణ రెడ్డి **అమ్మ పూజారి** అయిన నన్ను ఉద్దేశించి **'అమ్మ వ్రతం'** చేయించు అన్నాడు. అది స్ఫూర్తిగా అమ్మ అనుమతితో "జీవిత మహోదధిలో తరంగాలు"లోని కథలను, లలితా సహస్రనామంను కలగలిపి **"అనసూయా వ్రతం"** రూపకల్పన చేశాను.

అది రాధాకృష్ణ రెడ్డి మాటే అయినా అమ్మ శాసనంగానే స్వీకరించాను. కనుక ఆ మాటే సిద్ధవాక్కై, అమ్మ సంకల్పమై **'అనసూయా వ్రతం'** అందంగా రూపుదిద్దుకున్నది.

నేనే ఆ కుటుంబంచేత మొదటి సారిగా **అనసూయా వ్రతం** చేయించాను.





02-09-1969

ఈ విజయ దశమికి మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు రెండవ భాగం కూడా ప్రచురిస్తున్నామన్న ఆనందం కంటే యీ చరిత్ర రచనలో యింతవరకూ ఎదుర్కొన్న కష్టం తలుచుకుని ముందు యీంకా ఎన్ని అగాధాలూ, ఎన్ని అవరోధాలూ ఎదురవుతాయోనన్న భావమే నన్ను భయపెడుతున్నది.

అమ్మ భౌతికంగా కంటే మానసికంగానే ఎక్కువగా మనలను ప్రభావితులను చేస్తుంది. వీనిని ధృవపరిచే విషయాలు నా ఎఱుకలో అసంఖ్యాకంగా ఉన్నాయి.

కొంత మంది లజ్జతో భయంతో సత్యం చెప్పుకోలేరు. అమ్మ ప్రేమతో కరుణతో నిజం బయటపెట్టదు. మరి జీవితం చరిత్ర బద్ధం ఎట్లా అయ్యేటట్లు?

ఒకసారి ఒక యోగి అమ్మకు వద్దకు వచ్చారు. అమ్మ సన్నిధిలో వారి సంభాషణ గానీ, ప్రవర్తనగానీ సముచితంగా లేవు, అయినా వారిపై అమ్మ వాత్సల్యమే కురిపించింది. ఆ సంఘటన వివరిస్తేనే గాని అమ్మ ఔన్నత్యం వ్యక్తం కాదు. మరి దానితో బాటే వారి అల్పత్వమూ బహిర్గతం కాక తప్పదు. ఇక ఆ సంఘటన చెప్పేదెట్లా ? చీకటిలో కరిగిపోవలసిందేనా ?

నేను ఎఱుగుదును ఎందరో 'గురువు'ల మనుకునేవారు తమ శిష్య బృందంతో అమ్మ వద్దకు వచ్చి శిష్యుల ఎదుట ఘరానాగా కూర్చొని, తరువాత వారు అమ్మవద్ద వినమ్రులు కావటానికి వారికి అభ్యంతరం లేకపోయినప్పటికీ, నలుగురిలో ఆ విషయం ఒప్పుకొనగల గుండె బలం వారికి లేదు. అమ్మ కూడా వారిని మన్నిస్తుందే గానీ బయట పెట్టదు. ఏ తల్లి ఏ బిడ్డను వీధిపాలు చేస్తుంది.?

కాని యీట్లా ఎవరికి ఏమి బాధ కలుగుతుందో అని భయపడితే చరిత్ర రచన ఎట్లా సాగేటట్లు ?

పోనీ - యీ చరిత్ర రచన ఎందుకు చేయాలీ, మానివేద్దామా - అంటే జనబాహుళ్యానికి ప్రయోజన కరమయిన, లోకానికి ప్రభోధాత్మకమయిన, మానవాళికి మార్గదర్శక మయిన అంశాలు అనంతంగా గల చరిత్రను అక్షరనిబద్ధం చేయక నిర్లిప్తంగా వదిలితే ఎట్లా ? నవరస ప్రపూర్ణమయిన, నవతా రసప్లావితమయిన, పరిపూర్ణ మానవతా వికసితమయిన, పరిపుల్ల మాధవత్వ పరీమళభరితమయిన, మానవతా మాధవత్వ సమ్మిళిత రమణీయమయిన యీ జీవితం కలకాలం నిలిచేటట్లు గ్రంథస్థం చేయకపోతే ఎట్లా ?

అయితే- ఊరుపేరులు మినహాయించి వ్రాద్దామా అంటే అది కల్పన, కట్టుకథ కావచ్చునేమోకానీ చరిత్ర గౌరవం దానికి ఎట్లా లభ్యపడుతుంది.

మరి - ఏమి చేయాలి ?

దీనికి అమ్మే సమాధానమూ, పరిష్కారమూ అనుగ్రహించాలి. ఇన్ని మనస్సులపై యిట్లా అప్రతిహతంగా ప్రభావం చూపగల అమ్మ - వారికి సత్య ప్రకటానాసక్తినీ, శక్తినీ కూడా ప్రసాదించాలి.





అనారోగ్యంగా ఉండి చీరాలలో చికిత్స పొందుతున్న నాన్నగారిని చూచి వచ్చిన సోదరి ఉష బాపట్లలో పత్రికా ముద్రణ కార్యక్రమంలో ఉన్న నా వద్దకు వచ్చి ఆ వివరాలు అందించి, టాక్సీలో జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మకు కూడా నివేదించి వస్తానన్నది. నేను అంతకుముందే అమ్మతో ఫోనులో మాట్లాడి ఉన్నాను. అమ్మ నన్ను బాపట్లలోనే ఉండి నా పని నన్ను చూచుకొనమని ఆదేశించింది. తాను ప్రస్తుతంలో చీరాల వెళ్ళే అభిప్రాయమూ వ్యక్తం చేయలేదు. కాని నేను హఠాత్తుగా సోదరి ఉషతో టాక్సీలో బయలు దేరి అప్పటికి అక్కడకు వెళ్ళి అమ్మను చూచి వద్దామని మాత్రమే. పెట్రోలు బంకు దగ్గరకు వెళ్ళిన తరువాత అమ్మను చీరాల తీసుకు వెళ్ళి నాన్నగారిని చూచివస్తే బాగుండుననే అభిప్రాయం కలిగి అందుకు అవసరమయిన పెట్రోలును కూడా నింపుకుని జిల్లెళ్ళమూడి వెళ్ళాము. అక్కడ నుంచి అమ్మను తీసుకుని చీరాల వెళ్ళాము. మేము వెళ్ళేసరికి అక్కడ డాక్టరు గారూ నాన్నగారూ, తదితరులూ అందరూ అమ్మ కోసం నిరీక్షిస్తున్నట్లుగానే చెప్పారు. నాకు అశ్చర్యం కలిగింది.

కాని, అమ్మను నేను ప్రయాణం చేయించటానికి ప్రేరణ నాదేనని అనుకోవటానికి అవకాశముంది. కాని అది నూటికి నూరుపాళ్ళూ అమ్మదే అనటానికీ అధారము ఉంది. మనకు నిదర్శనానికని ఏమో - మా టాక్సీ రెండు మైళ్ళు దూరంలో ఉండగానే అమ్మ - వాడు నన్ను చీరాల తీసుకు వెళ్లటానికి టాక్సీ తీసుకువస్తున్నాడు - అని సోదరి వసుంధరతో చెప్పింది.

మొదట్లోనే వసుంధర ఆ మాట చెబితే ఆశ్యర్యపోయాను. చీరాల వెళ్ళి అక్కడ అమ్మకోసం నిరీక్షిస్తున్న అందరినీ చూచి మరీ విస్మయం పొందాను.



ఒకసారి అమ్మ మాతృత్వాన్ని నిర్వచిస్తూ ఎక్కడ మన బాధ్యత నిర్నిబంధంగా స్వీకరించబడుతుందో అదే మాతృత్వం అన్నది. సాధారణంగా అనేక పర్యాయాలు " ఈ సృష్టి నాది " అనీ, " మీరంతా నా సంతానమే ", నని " మిమ్మల్ని శుభ్రపరచవలసిన బాధ్యత నాదే " ననీ "మీకు ఏది వచ్చినా సుఖం కానీ దుఃఖం కానీ అది నేనిచ్చినదే" ననీ సాముహికంగా హామీలు ప్రసాదించినప్పటికీ " నేను నీ వెన్నంటే ఉంటాను" "నీకేమీ భయంవద్దు" " నీ బాధ్యత నాది" "ఈ విషయం నేను చూచుకుంటాను " మొదలయిన వ్యక్తిగత వాగ్దానాలను అమ్మ వెలువరించటం అరుదుగా నయినా ఉదాహరణకు ఉన్నాయి. ఈ సంఘటన అలాంటిదే

యీ నెల 10వ తేదీన సోదరుడు శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి అమ్మ పదసన్నిధికి అరుదెంచాడు. అతడు కంఠదఘ్నంగా దుఃఖవారాశిలో ఉన్నాడు. కారణం - అతని ప్రియపుత్రుడు కనుపించటంలేదు. ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఒక లేఖ వ్రాసి యింటిలో ఉంచి అదృశ్య మయ్యాడు. కుఱ్ఱవాడు ఇంకా సజీవంగా ఉన్నదీ లేనిదీ ఊహించలేని సందిగ్ధావస్థలో అతడు ఊపిరి ఆడక సతమత మవుతున్నాడు. పుత్రుని ఉజ్వల భవిష్యత్తుపై ఎన్నో ఆశలు పెంచుకున్న ఏ తండ్రి హృదయం ఆ తరుణంలో తల్లడిల్లకుండా ఉండగలదు. దుర్భర దుఃఖ పరితప్త హృదయంతో కర్తవ్యతా విమూఢ మానసంతో, అశ్రుపూర్ణ సయనాలతో ఖిన్నుడై, ఆపన్నుడై, అతడు అమ్మను దర్శించి అంజలి ఘటించి అర్థించాడు పుత్రభిక్ష కోసం.

నిత్యమూ ఎందరు రావటంలేదూ - మోయలేని ఎన్నో కోరికల కొండలతో భరించలేని ఎన్నో బాధలజ్వాలలతో వారిని అమ్మ ఉద్ధరించ వచ్చునూ, వారి కామితార్థాలను, సిద్ధింపచేయవచ్చునూ కానీ, ఎవరికి అమ్మ క్రియారూసేణా, ప్రేరణ ద్వారా కాకుండా వాచ్యంగా సమాధానమిస్తున్నది ? కానీ ఆ వేళ అతని వెన్నుతట్టి "ఇక నుండి నీ బాధను నాకు వదిలెయ్యి. నేను చూచుకుంటాను. నీవు నిశ్చితంగా యింటికి వెళ్ళు " అని అమ్మ ఆదేశించింది. అక్కడ ఉన్న మాకూ ఆశ్చర్యమే కలిగించింది.

## 29-09-1972

ఈ రోజు అంటేసెప్టెంబరు 29వ తేదీన రాత్రి సోదరి శ్రీమతి సక్కుబాయి అమ్మను తమ కారులో ప్రయాణం చేయమని అర్థించింది. అమ్మ అంగీకరించింది. లాల, పార్థులను కూడా అమ్మ తన వెంట రమ్మన్నది.

ప్రయాణం ఎక్కడకో ఎందుకో మా కెవరికీ తెలియదు. బాపట్ల చేరిన తర్వాత రవిని కూడ రమ్మన్నది.

కారు అక్కడ నుండి ఎటు వెళ్ళాలని ప్రశ్న వచ్చింది. అమ్మ తటస్థంగానే కూర్చున్నది. కారు రేపల్లెదారికి మళ్ళింది. గగనతలం మేఘావృతమై చల్లని గాలి వీస్తూ ప్రయాణం సమ్మోదకరంగా ఉన్నది. అమ్మ కబుర్లు చెబుతుంటే మాలో ఎవరికీ కాలమూ దూరమూ గమనంలో లేవు.

భట్టిప్రోలు వచ్చింది. ఇక లాల, పార్థుల సంతోషానికి హద్దులు లేవు. నిత్యమూ, ఎందరో సంపన్నులూ, లబ్ధప్రతిష్ఠులు, ఉన్నతోద్యోగులూ వచ్చి వారి పట్టణాలను అమ్మపాద రజస్సుతో పావనం చేయమనీ, వారి గృహాలను అమ్మ ఆగమనంతో జ్యోతిర్మయం చేయమనీ ప్రాధేయపడుతుంటే - ఎక్కడకూ కాలు కదపటానికి యిష్టపడని అమ్మ ఆనాడు అనాహూతంగా, తమ గ్రామం వచ్చింది. అది ఎవరిని ఆనందంలో పులక లెత్తించదూ ? ఎవరిని పారవశ్యంలో ముంచెత్తదూ? అయినా వారు అమ్మను " మా యింటికి రా అమ్మా ! " అని ఆహ్వానించలేకపోయారు.

కాని అర్థించకుండానే వారింటికి కారును పోనివ్వ మన్నది అమ్మ. క్షణాల్లో కారు వారింటి ముందు కొబ్బరి చెట్ల నీడల చీకట్లో ఆగింది. వారిద్దరు ఒక్కగంతులో యింటిలోకి దూకారు. నిద్రిస్తున్న అక్కయ్యను బావను నిద్రలేపారు.

ఆ రాత్రి పడుకున్నాను. కానీ క్రితం సాయంకాలం అమ్మ యిచ్చిన అన్ని సలహాలు మనస్సులో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. వ్యర్థంకాని అమ్మ వాక్కులు మనస్సులో పునరావృతమవుతూనే ఉన్నాయి. ఎన్ని అనుభవాలు కలుగుతున్నా చెరగని అజ్ఞానానికి మనసు సిగ్గుతో కుంచించుకుపోతూనే ఉన్నది. ఎంత ఉతికినా తెల్లబడని ఎలుకతోలు వంటిది మనస్సు అనిపించింది. కుక్కతోక వంటిది అనిపించింది.

అసలు మొట్టమొదట అమ్మ ఇట్లా ఇచ్చిన ఒక అనుభవానికే మనస్సు ఆకర్షితమయింది.

ఆది 1969, శరన్నవరాత్రులు మొదలయినాయి. అప్పుడు సుబ్బారావు 5 సంవత్సరాలు. నేను జిల్లెళ్ళమూడి వస్తుంటే వాడూ అప్పికట్ల నుండి నాతో జిల్లెళ్ళమూడి వచ్చాడు. దసరా ప్రారంభమయింది. వాడు వాళ్ళ అమ్మ కోసం, బామ్మకోసం దిగులుపడి ఏడవడం సాగించాడు. వాడిని సముదాయించడం వాడితో నేను అక్కడ ఉండడం అసాధ్యం అనుకుని వాడిని అప్పికట్లలో దించి రాదలుచుకున్నాను.

అదే అమ్మకు విన్నవించాను. అమ్మ 'సరే' నంటూ దసరా వెళ్లగానే వస్తావా? అని అడిగింది. అదేమిటమ్మా ? దసరా వెళ్ళడం అంటే యింకా తొమ్మిది రోజులున్నది. నేను ఈ రాత్రికి వెళ్ళి వీడిని అక్కడదించి, రేపు ఉదయమే తిరిగి ఇక్కడకు వస్తానమ్మా అన్నాను.

రేపే వస్తావా ? అని అమ్మ అడిగింది.

నాకు ప్రస్తుతం అక్కడ పనేమీ లేదమ్మా రేపే వస్తాను. తెల్లవారేసరికి వస్తాను అన్నాను.

నాలుగు మైళ్ళు వెళ్ళడం ఎంతలోకి ? తిరిగిరావడం ఎంతలోకి ? అని నా అభిప్రాయం. సరే వెళ్ళిరా ... అని అమ్మ పంపింది.

ఆ రాత్రి అప్పికట్ల నిర్విఘ్నంగా చేరాను.

ఆ రాత్రి ఆకస్మాత్తుగా కుంభవృష్టి కురిసింది కాలువలు పొంగాయి. వాగులు పొంగాయి. చేలూ చెరువులూ ఏకమైనాయి. అప్పికట్లకూ జిల్లెళ్ళమూడికీ మధ్య నాలుగుమైళ్ళ కాదు; నాలుగు సముద్రాలైనాయి. ఎవరిని విచారించినా, జిల్లెళ్ళమూడి వెళ్ళడం అసాధ్యం అన్నారు. అమ్మకు ఇచ్చిన మాట ప్రకారం జిల్లెళ్ళమూడి చేరాలని శతవిధాల ప్రయత్నించాను. ఆహా, నావల్ల కాలేదు.

ఆ రోజుల్లో అమ్మ మాటలోని సత్యానికీ, బలానికీ ఆనందించే కంటే అమ్మకు ఇచ్చిన మాటను నిలుపుకోలేక పోయానే అని అమితంగా విచారించాను. ఎవరికైనా ఏమైనా మాటను ఇస్తే తప్పటం అలవాటు లేనందున, ఆరోజంతా మనస్సు చాలా కలతజెందింది. అన్నం సహించలేదు. అందులో అమ్మకు ఇచ్చిన మాటను మొదటి సారిగా నెరవేర్చలేక పోయినందున మనస్సు కుళ్ళికుళ్ళి ఏడ్చింది. ఆ రాత్రి అసలు నిద్రపట్టలేదు. చివరకు తెల్లవారుజామున అది నిద్రో, మెలుకువో స్వప్నమో... నిర్ణయించలేను. అమ్మ కనుపించింది. నన్ను చూసి నవ్వింది. అందులో పరిహాసమే ఉందో, జాలే ఉందో, ప్రేమే ఉందో ఇప్పటికీ నాకు తెలీదు.

అనుకున్నది జరగదు; మనకున్నది తప్పదు అని అర్థమయింది. మనం చేద్దామనుకున్నా ఏమీ చేయలేమని బోధపడింది. మన క్రియలకు కర్తలం మనం కాదని ఋజువయింది. మన క్రియలన్నిటికీ కర్త మరొకరు అనీ, అది అమ్మ అనీ ఒక నమ్మకం ఏర్పడింది.

అమ్మ నా కన్నీళ్ళు తుడుస్తూ, నా వీపు నిమురుతూ, నా జుట్టు సవరిస్తూ, నా చెక్కిళ్ళు పుణకుతూ, నా గడ్డం పట్టుకుని నా ముఖం పైకెత్తి, నా కళ్ళలోకి చూస్తూ ... " అనుకున్నది జరగదు ; మనకున్నది తప్పదు, నాన్నా, మన క్రియలకు కర్తలం మనం కాదు అని తెలుసుకుంటే జీవితంలో

ఒడిదుకులు ఉండవు. సుఖ దుఃఖాలుండవు. అంతా ఆనందమే అంతా తృప్తే."..
అన్నది.

ఈ 18 సంవత్సరాల్లో అమ్మ ఏదో అనడమూ, ఇది ఇట్లా ఎందుకు జరుగుతుందిలే అనుకోవడమూ చివరకూ అమ్మ అన్నట్లుగానే జరగడమూ నేను ఆశ్చర్య పడిపోవడమూ అలవాటయిపోతుంది.

మళ్ళీ మళ్ళీ ఇదే చక్రభ్రమణం ! దీనికి అంతం ఎప్పుడో !

ఒక్కసారి కాదు వందలసార్లు అడిగాను అమ్మా నువ్వు అన్నట్లుగా జరుగుతుందా ? జరిగేదాన్ని నువ్వు అంటావా ? అని.

వాటిలో భేదం నాకు తెలియడం లేదు అని తమాషాగా నవ్వుతుంది అమ్మ ఆ నవ్వే కోటి అమృత వర్షాలై నన్ను నిలువెల్లా తడిపేస్తుంది ప్రతిసారీ.

అమ్మ నోరు తోలునోరు కాదు కదా.... తాలుమాట రావడానికి, అమ్మ. నోరు రతనాలగని. అమ్మ నోరు తెరిస్తే చాలు రతనాలు జలజలా రాలుతాయి. ఆ కాంతులకు పుడమియే పులకించి పోతుంది.

అమ్మ ఒక్క మాట అంటే చాలు, అది అయితీరుతుంది. పంచ భూతాలూ అందుకు సహాయ పడతాయి.





ఈ వాతావరణాన్ని ప్రేమానురాగ పరీవృతం చేస్తున్న అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు అరవై సంవత్సరాలు.

లోకాన్ని దివ్యకాంతుల కుంభవృష్టిలో స్నానం చేయించి పునీతం చేస్తున్న అమ్మ నయన ద్వయానికి అరవై సంవత్సరాలు.

అమ్మకు వజ్రోత్సవం

అసంఖ్యాకుల నుదుట తిలకం దిద్దీ, నోళ్ళకూ గోరుముద్దలు అందించీ ఆశీర్వచనాన్ని ప్రసారంచేసే అమ్మ కరయుగళికి అరవై సంవత్సరాలు.

ఇది కన్నపొట్టేగాని, తిన్నపొట్ట గాదని ప్రవచించిన అమ్మ, చిరుబొజ్జకు అరవై సంవత్సరాలు.

అపూర్వమయిన నిర్వచనాలతో, ప్రవచనాలతో భాషకే ఒక సౌందర్యాన్నీ పరిపుష్టినీ ప్రసాదించిన అమ్మ వాక్కుకు అరవై సంవత్సరాలు.

ఈ కారుణ్యాన్ని వాత్సల్యాన్ని అమ్మ మనపై, ఈ లోకంపై అనంతంగా అవిచ్ఛిన్నంగా ప్రసారం చేయాలని అమ్మను మనం ఈ శుభసమయాన ప్రార్థిద్దాము.

ఈ మన ప్రార్థనలకు నేడు వజ్రోత్సవం !





## 28-11-1983

ఈ రోజు ఆర్థిక మంత్రి శ్రీ నాదెండ్ల భాస్కర రావు గారు, ఎమ్ఎల్ఎ శ్రీమతి నన్నపనేని రాజకుమారిగారు అమ్మని దర్శించటానికి జిల్లెళ్ళమూడి వచ్చారు. ఇక్కడి కార్యక్రమాలు వాళ్ళను ఎంతగానో ఆకర్షించినాయి. అన్నీ ప్రజాహిత కార్యక్రమాలు అని ప్రశంసించారు.

టిటిడి తరపున జిల్లెళ్ళమూడిలో ఒక కళ్యాణమండపం కట్టిస్తే బాగుంటుందని నేను రాజకుమారికి సూచించాను. ఆమె టిటిడి బోర్డు సభ్యులు కదా ! చూడాలి అమ్మ సంకల్పం ఎలా ఉందో ?

## 4-1-1984

గుంటూరు

డి.ఇ.ఒ. ఆఫీస్‌కు వెళ్ళాను.

సముద్రాల రామకృష్ణమాచార్యులతో కలసి

జయచంద్రగారిని కలిసాను రికాగ్నైజింగ్ స్కూల్ విషయంలో.

సూపరింటెండెంట్ బుచ్చయ్య చౌదరిగారిని

అప్రూవల్ ఆఫ్ అపాయింట్‌మెంట్ విషయంలో కలిసాను.



## 6-1-1984

బాపట్ల.

గ్రామాధికారులను రద్దు చేస్తూ ఆర్డినెన్స్ వచ్చినట్లు సాయంకాలం ప్రాంతీయ వార్తల్లో వచ్చింది. ఏ ఉద్దేశ్యంతో చేసినా ఇది ప్రజోప-యోగకరమైనదా? లేదా? అన్నది కాలమే నిర్ణయించాలి. గ్రామపరిపాలన కుంటుపడదూ!

## 9-1-1984

బాపట్ల నుండి బస్సులో బయలుదేరి విజయవాడకు 2 గం॥లకు చేరాను. శ్యాము కూడా వచ్చాడు.

రామకోటేశ్వర రావు గారింటికి వెళ్ళి అమ్మాజీ పెండ్లి విషయం మాట్లాడాను. రామకోటేశ్వర రావు గారు హైదరబాద్‌లోనే ఉన్నారు, అక్కయ్యతో మాట్లాడాను.

## 12-1-1984

పరబ్రహ్మమూర్తిగారింట్లో భోజనం. మధ్యాహ్నం ఆంధ్రాబ్యాంక్ వై.నారాయణరావుగారిని కలిసాను. వల్లూరి జగన్నాథరావు గారి అల్లుడు శ్రీగిరి రాజు. రామచంద్ర మూర్తిని డోర్నకల్ నుంచి గుంటూరు ట్రాన్స్‌ఫర్ చెయ్యమని అడిగాను. రాత్రి లింక్ ఎక్స్‌ప్రెస్‌లో బయలు దేరాను. రిజర్వేషన్ దొరకలేదు. ప్రయాణం చాలా కష్టమయింది. తెల్లవారితే భోగిపండగ కనుక ఎట్లాగయినా జిల్లెళ్ళమూడి చేరకతప్పదు.





మధ్యాహ్నం 1గం॥కు జిల్లెళ్ళమూడి చేరాను. చంద్రమోహన్ వచ్చి ఉన్నాడు. అలంకారాలన్నీ పూర్తి చేశాడు. పూజ మేడ మీదనే. నెల్లూరి నుంచి డాక్టర్‌గారు రావటం లేదని ఉత్తరం వ్రాశారు. అందువల్ల బ్రహ్మాండం సుబ్బారావు, శేషు, హైమ, స్వీటీ, పింకి, చైతన్య, చిన్నాల చేత పూజచేయించాను.

బాపట్ల నుండి వస్తూ స్టేట్ బ్యాంక్ లో రూ.250/- లకు చిల్లర నాణెలు (ఎన్‌పి 5 & ఎన్‌పి 10) తెచ్చాను అవి పూజలో తెల్లగా వెండి నాణాలు వలె మెరిసి పోయాయి. బ్రహ్మాండం సుబ్బారావు కోసమని కాశీరావు కొన్న అంబాసిడర్ కారులో అమ్మ హైమాలయానికి వచ్చింది. నాన్నగారికి దండవేసి భోగి పళ్ళు పోసి పీఠానికి నమస్కరించింది. ఏమిటో అమ్మ నమస్కారం చేస్తుంటే వింతగా ఉన్నది. షెడ్డులో అందరికి భోగిపళ్ళు పోసింది. షెడ్డునిండారు. కాలేజి స్టూడెంట్స్ తట్టలతో పళ్ళు అందించారు. అందరి తలలపై నాణాలు గలగల మ్రోగాయి. ఎన్ని ఎక్కువ నాణెలు - తలపై పడితే వాళ్ళకి అంతగా ఆ సంవత్సరం ధన లాభం ఉంటుందని నమ్మిక. కుర్చీలో అమ్మను పైకి తీసికొని వచ్చాము. చంద్ర మోహన్, భట్టిప్రోలుపార్థు,బూదరాజుశ్యాము పట్టారు.

అంతకుముందు ఎట్లా ఉన్నా, భోగిపళ్ళు పోసేటప్పుడు అమ్మ చాలా ఉత్సాహంగా ఉన్నది. రాత్రి 11 గం॥లకు వాల్తేరు నుంచి కృష్ణ శాస్త్రిగారు, భార్య కుమార్తె వచ్చారు. వాళ్ళు 14వ తేదీన భోగి అనుకున్నారట.



## 14-1-1984

సంక్రాంతి పండగతో పాటు ముక్కోటి. చంద్ర మోహన్, కాలేజి విద్యార్థుల సహాయంతో అమ్మ దర్శనం కోసం అద్భుతంగా ఏర్పాటు చేశాడు. ఉత్తర ద్వార దర్శనం. అమ్మ నిలుచో లేనందువలన కూర్చీలో కూర్చొన్నది. కిరీటం, చక్రం, శంఖువు, గజమాల, చిన్న దండ, ఆ రెండింటి మధ్య తలసిమాల. కుర్చీ పై పట్టుచీర వేయడం మరిచిపోయారు. ప్రక్కనే ఉన్న బెంచీలకు అడుగున కర్టెన్ లేక బోసిగా కనిపించింది.

శిఖాకొల్లి వెంకటేశ్వర్లు వచ్చాడు. అతను, దుర్గ పిన్ని కుటుంబం క్షీరాభిషేకం చేసుకుని పూజచేసుకున్నారు. మధ్యాహ్నం నుంచి రేపు జరగాల్సిన పత్రికాభివృద్ధి గురించిన సభ గురించి చర్చ మొదలయింది. శ్రీ ఎల్.ఎస్.ఆర్.కె. గారి అధ్యక్షతన. ఏలూరు నుంచి శ్రీరామబ్రహ్మం , అప్పారావు, డా॥ శంకర శ్రీరామరావు, సౌభాగ్యరావు, చాగంటి వెంకట్రావు వగైరాలు వస్తూ మర్రిపూడిలో శ్రీ నూతలపాటి వీరయ్య గారిని కారులో ఎక్కించుకు వచ్చారు.

వాళ్ళు కూడా సభలో పాల్గొన్నారు. శంకర శ్రీరామరావుగారు 'మోహర్ వాణి' చాలాకాలం నడిపారట. ఆ అనుభవాలు ఎన్నో చెప్పారు. ఉత్సహపరిచారు. 'మాతృదర్శనం' గురించి ప్రస్తుతించారు. సాయంకాలానికి కేశవశర్మ వచ్చాడు.

## 16-1-1984

బాపట్ల విజయవాడ వెళదామని వచ్చాను. రాచర్ల లక్ష్మీనారాయణ, కేశవ శర్మతో కలిసి లక్ష్మీనారాయణ కారులో వచ్చాను. వాళ్ళు చీరాల వెళ్ళారు. బస్సులు లేక నేను విజయవాడ వెళ్ళలేదు. రాత్రికి తిరిగి జిల్లెళ్ళమూడి చేరాను అమ్మకు పూజ చేసుకున్నాను. 1963 జనవరి 16 నుండి ప్రతి సంవత్సరం ఆ తేదిన పూజ చేసుకుంటున్నారు.



20-1-1984

చీరాల శేషు నుండి శ్యాము ద్వారా రూ 8,000/- తెప్పించాను.

26-1-1984

విజయవాడ నేను కేశవవశర్మ ఇద్దరం కలిసి తూములూరి లక్ష్మీ నారాయణగారిని కలుసుకున్నాము. పత్రిక గురించి రెలిజియస్ జర్నలిజం గురించి చాలా విషయాలు మాట్లాడుకున్నాము.

30-1-1984

బాపట్ల వచ్చాను. ప్రెస్‌లో మాక్షిన్‌వర్క్ కొరకు. పాలకొల్లు నుంచి వెంకట్రావుగారు, భీమవరంనుండి నారాయణరావు గారు గుంటూరు నుండి వల్లూరి జగన్నాధరావుగారు వచ్చారు. కారులో వారితో పాటు జిల్లెళ్ళమూడి. జగన్నాధరావు గారి అబ్బాయి పెండ్లికి శుభలేఖలు అమ్మకు సమర్పణ.

తిరిగి వారితో పాటే బాపట్ల. ప్రెస్‌లో శ్రీనివాసరావు, మధు, రాముడు వారి రాజీనామాలకు గల కారణాల గురించి మాట్లాడారు. చివరకు రాజీనామాలు ఉపసంహరించుకున్నారు. నేను వారికి కొన్ని హామీలు ఇచ్చాను.

రాముణ్ణి ఫోర్‌మెన్ చేయాలి. అకౌంట్స్ భాను చేత వ్రాయించాలి. రాత్రికి గాయత్రీ ఉపాసన గురించి సంపాదకీయ వ్రాయాలను కున్నాను. కానీ వ్రాయలేక పోయాను. బాగా నిద్ర వచ్చింది. పడుకొని తెల్లవారు జామున వ్రాద్దామనుకున్నాను. మెలకువరాలేదు.



## 31-1-1984

సంపాదకీయం ముగించాను. ఏమి వ్రాయాలను కున్నానో ! ఏమి వ్రాశానో! వ్రాయడం మన చేతిలో లేదు. జర్నల్ ప్రింటింగ్ పూర్తి అయింది. మధు, సుబ్బారావుతో కలిసి చెడుగుడు పోటీలు చూసాను.

## 30-10-1984

22-10-1984 ప్రారంభమైన రామనామ సప్తాహ దీక్ష 29-10-1984తో ముగిసింది.

ఇది నిర్వహించిన శ్రీరామ్ గారు శ్రీ అవధూతేంద్ర ప్రియశిష్యుడు. శ్రీ అవధూతేంద్ర రామానామాన్ని గ్రామ గ్రామానా, పట్టణ పట్టణాన విరివిగా ప్రచారం చేసిన నాదోపాసకుడు. నామయోగి. అంతేనా ! అమ్మ అద్వైత తత్వాన్ని అవగాహన చేసికొన్న పరమజ్ఞాని. అమ్మకు ప్రియపుత్రుడు.





అవధూతేంద్ర సరస్వతి స్వామి, అమ్మతో రామకృష్ణఅన్నయ్య



## 10-11-1984

అవతార మూర్తి అమ్మను దర్శించేందుకు అనునిత్యమూ దేశ విదేశాలనుండి యాత్రికులు అనేకులు వస్తుంటారు. వాళ్ళు అమ్మ నివసించే మేడ పై భాగానికి చేరుతుండగానే - అక్కడ నుండి ఈశాన్య దిక్కులో వాళ్ళేమీ ప్రయత్నం చేయకుండానే రంగు రంగుల రమణీయమయిన ఒక ఆలయం కను విందు చేస్తుంది.

సాధారణంగా అందరూ నివసించే మేడలో ఒక గదిలో అమ్మ ఉండడ మేమిటో, ఆ ఆలయం ఏమిటో వాళ్ళకు అర్థంకాదు, విచిత్రమనిపిస్తుంది. ఏమిటో తెలుసుకుందామని ఆసక్తి రగులుతుంది.

అప్పుడు వారికి నేను కనబడతాను. అమ్మ నిలయంలో నేను పూజరిని కనుక, ఎల్లప్పుడూ నేను అక్కడనే ఉంటే పరమభాగ్యం ప్రసాదింపబడింది కనుక, నేను వారికి కనిపిస్తాను. వాళ్ళు నన్ను ప్రశ్నిస్తారు.

"అది హైమాలయం" అంటాను.

రామాలయం, శివాలయం, వెంకటేశ్వర స్వామి దేవాలయం, నరసింహస్వామి దేవాలయం, ఆంజనేయస్వామి దేవాలయం, భావనారాయణస్వామి దేవాలయం.... యిట్లా అనేకమయిన దేవాలయాల పేర్లు విని ఉంటారు కానీ అంతకు ముందెప్పుడూ యీ పేరు విని ఉండరు. ఎందువల్ల నంటే యీ పేరుతో యీ దేవాలయంతప్ప ప్రపంచంలో మరెక్కడడా మరో దేవాలయం లేదు.

వారి కుతూహలం మరింత జ్వలిస్తుంది. వివరాలు అడుగుతారు. చెప్పిన కొద్దీ అనేక ప్రశ్నలు వస్తాయి. ఎంతో ఓపికతో వివరిస్తే కానీ వారి మనస్సులు తృప్తిపడవు.

అటువంటి సందర్భాల్లో .... "హైమాలయం" ఎప్పుడు ఏర్పడిందీ ? ఎందుకు ఏర్పడిందీ? ఎట్లా ఏర్పడిందీ? యీ దేవాలయం ప్రత్యేకత ఏమిటీ? ప్రయోజనం ఏమిటీ... యీ వివరాలతో కూడిన ఒక చిన్న పుస్తకం ప్రచురిస్తే బహుజన ప్రయోజనకారి అవుతుంది-గదా అనిపించింది.

అయితే.... అమ్మ జీవితం గురించి మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు వ్రాసేటప్పుడు అవహించిన భీతే మళ్ళీ పట్టుకుంది. దివ్య ప్రణాళికాబద్ధమై, దేవకార్యసముద్యతయై ఆవిర్భవించిన ఆధ్యాత్మిక హిమాలయమై మహా మహిమాలయమైన హైమాలయం గురించి వివరించ గలనా ? అని. కాని అంతః ప్రేరణ రూపంలో అమ్మ ధైర్యాన్ని ప్రసాదించింది. ఎట్లాగంటే.... నేనూ, హైమా 1962 నుండి 1968 ఏప్రియల్ 5వ తేదీ వరకు అమ్మ సన్నిధిలో కలిసే జీవించాం. మానవి అయిన హైమ జీవితంలోనూ, చరమాంకంలోనూ పడిన వర్ణనాతీతమయిన బాధ నాకు తెలుసును. సిద్ధిపొందినప్పటి నుండి అమ్మ నిర్వహించిన క్రతువుకు నేను ప్రత్యక్ష సాక్షిని. హైమాలయ నిర్మాణం బాధ్యత వహించిన వాణ్ణి. హైమాలయానికి అమ్మ అమృత హస్తంతో ప్రారంభోత్సవం జరిపిన సుముహూర్తంలో, హైమాలయంలో అమ్మ హైమవిగ్రహ ప్రతిష్ఠాపన చేసిన దివ్యసన్నివేశంలో పాల్గొన్న వాణ్ణి. అమ్మ ఎప్పుడు హైమాలయానికి వెళ్ళి హైమను ఆశీర్వదించినా నీడలా అమ్మను అనుసరించిన వాణ్ణి.

కేవలం వెంట ఉండడమే కాదు, అక్కడ అమ్మ ఏ క్రియ జరిపినా, అమ్మకు ఉపకరణంగా, అమ్మ అవయవాల్లో ఒక అవయవంగా, అమ్మ బిడ్డగా, అమ్మ సేవకుడుగా అమ్మతో ఉండి, అమ్మవెంట ఉండి అన్ని క్రియల్లో పాల్గొన్న వాణ్ణి. ఆ భాగ్యాన్నీ, అపూర్వమయిన, అనన్యమయిన ఆ అదృష్టాన్నీ, అనితర లభ్యమయిన మహావరాన్నీ అమ్మ నాకు అనుగ్రహించింది.

ఆ విధంగా హైమను గురించీ, హైమాలయం గురించీ నా

మనస్సులో పదిలపరుచుకున్న అమూల్యమయిన విషయాలను నేను గ్రంథస్థం చేయకపోతే ఎట్లా ? అని పించింది.

ఈ విధంగా నా వీపు తట్టినది అభయ ప్రదాయిని అయిన అమ్మ అమృత హస్తమే కనుక యీ ధైర్యమూ, యీ సాహసమూ, యీ ఉత్సాహమూ, యీ ఉత్తేజమూ, యీ ప్రయత్నమూ, యీ ప్రచురణమూ.......

ఇక పోతే రచనకు ప్రచురణకు హైమజయంతికి మూడురోజుల కన్నా సమయంలేదు, సమయం సరిపోతుందా ? అదీ 'అమ్మ' కే బాధ్యత అప్పచెప్పి సోదరుడు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి సహాయం అర్థించాను. ఒకే రాత్రిలో నేను ఆశువుగా చెబుతూ పోతుంటే శ్రీమన్నారాయణ మూర్తి దాన్ని అక్షర బద్ధం చేశాడు. అద్భుతం. నేను వ్యాసుడంతటి వాణ్ణి కాదుకాని శ్రీమన్నారాయణ మూర్తి మాత్రం మహాభారతం గ్రంథస్థం చేసిన ఆ 'గణపతి' కి ఏమాత్రం తీసిపోడు. గ్రంథస్థం చేయడమే కాక అచ్చుకు ఇచ్చి ప్రూఫ్‌రీడింగ్ చేసి ఒక రోజులో గ్రంథప్రచురణ పూర్తి చేయగలిగాడు. అంతా అమ్మ కరుణ!





## 16-1-1985

అప్పికట్ల వెళ్ళి రాముడు బాబాయి తో మాట్లాడి వచ్చాను. మోహన రావు పెండ్లి ఫిబ్రవరి 24 లేక 27. రాత్రి 8 గం॥ లకు జిల్లెళ్ళమూడి చేరాను. అమ్మ పూజకు ముందే భోజనం. కంది పచ్చడి, కాకరకాయ కారపకాయ, అమ్మ కలిపి పెట్టింది. భోజనం తరువాత తాంబూలం (మొదటి సారి విశేషం) తర్వాత మామూలుగా అమ్మ బొట్టు పెట్టి నూనె పెట్టి కొత్త బట్టలు ( 2ధోవతులు + 2 షర్టులు+2 బనీయన్లు) యిచ్చింది. పూజచేసుకున్నాను. బ్రెడ్ తిన్నాను. పడుకున్నాను.

## 1-16-1985

పరబ్రహ్మ మూర్తితో కలిసి నీలంరాజు వెంకట శేషయ్య గారిని కలిశాము. వారు అమ్మను గురించి అడిగి తెలుసుకున్నారు. పరబ్రహ్మ మూర్తి పత్రిక 'వ్యవస్థ' ను జనవరి 31వ తేది ఉదయం ఆవిష్కరించటానికి అంగీకరించారు. ధర్మసూరి, మోహన్ కృష్ణలతో కలిసి అంధ్రా బ్యాంక్ చీఫ్ మేనేజర్ ఎమ్.క్రిష్ణరావును కలిశాము ఆయన వాళ్ళ ప్రాంతంలో (ఆనందనగర్ 146) దేవాలయం కడుతున్నందు వలన మనకు ఏమి చేయలేనని చెప్పాడు. తర్వాత అమీర్ పేటలో మోహన్ కృష్ణ గారిల్లు కామరాజుగారిల్లు చూశాను. మోహన్ కృష్ణ వాళ్ళబ్బాయి 'రవి' తప్పిపోయిన ఉదంతం చెప్పి అమ్మకు చెప్పమన్నాడు. రాత్రి ఎల్.కె. మోహన్ యింటికి వెళ్ళాను. దారిలో రామ్మూర్తి గారిని కలిశాను.

సెక్రటేరియట్‌లో సుందరరావు, స్టెనో ఆఫ్ టి.ఎల్.శంకరన్, ను కలిశాను. బ్రహ్మాండం సుబ్బారావు బొగ్గు విషయం మాట్లాడాను.

మోహన్‌తో కలిసి మౌలాలి (146, ఎల్.ఐ.జి.హెచ్) వెళ్ళాను. అక్కయ్య బావ కులసా.



21-1-1985

గంటి వెంకట్రావు గారు బాపట్లకు రైలు టికెట్ తెప్పించారు. హైదరాబాద్, మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం. బ్రహ్మాండం రవికి ఇవ్వమని వెంకట్రావు గారు వాల్ క్లాక్ పంపారు. 'ఇందిరాగాంధీ' పుస్తకం రైల్లో తోడు. రాత్రి 1 గం॥కు బాపట్ల. స్టేషన్‌కు జీప్ వచ్చింది. గం. 1.30 ని.లకు జిల్లెళ్ళమూడి చేరుకున్నాను.

22-1-1985

ఉదయం 11 గం॥లకు గ్రామంలో వీకర్ సెక్షన్ యిళ్లకు అమ్మ చేత శంఖుస్థాపన. తర్వాత బ్రహ్మాండం 'రవి' యింటికి. పూర్ణ కుంభంతో మంగళ వాయిద్యాలతో స్వాగతం. ప్రసన్నాంజనేయశర్మ, కుమార శర్మ, నరసింహం, సత్యనారాయణ మూర్తి, రవి అమ్మకు పూజ. "అమృతానంద", వారి అబ్బాయి హనుమంతరావులు వచ్చారు. అమ్మను కేసానిపల్లి ఆహ్వానించారు.





## 17-3-1985

జిల్లెళ్ళమూడిలో శ్రీరామ్‌గారు రామలీలలు అద్భుతంగా ప్రదర్శిస్తున్నారు. ఆవరణలోని చిన్నపిల్లలు కూడా ఆకర్షితులై ఆ ప్రదర్శనలో పాలుపంచుకుంటున్నారు. నాకు పాలుపంచుకోవాలని మహా ఆశగా ఉన్నది. నాకు సరిపోయిన రచయిత పాత్ర పోషించాలని మహా కోరికగా ఉన్నది. మరి నేను "అమ్మ"ను గురించి తప్ప వ్రాయను కదా.

కాని చిత్రంగా అమ్మ నా కోరిక తీర్చింది. సోదరుడు అప్పారావు శ్రీ రామ్‌ను 'అమ్మ లీల' ప్రదర్శించరాదా ! అని ఆయన అనుమతి తీసికొనడం జరిగింది. ఇంకేం నాకలం కదిలింది.

ఒక రోజులో వాత్సల్యాయం కూర్చొని 'అనసూయ కళ్యాణం' రచన చేశాను. అంతా అమ్మ దయ. ఇది అమ్మ జీవిత చరిత్రకు సంబంధించిన నాటకం. అమ్మ బాల్యంలో జరిగిన అత్యద్భుత సంఘటనలు తెలియచేసే కొన్ని సన్ని వేశాలతో నాటకం అద్భుతంగా వచ్చింది.



శ్రీ శ్రీరామ్ గారు తన మధుర కంఠంతో ప్రదర్శన రక్తి కట్టించారు. అమ్మ సమక్షంలో అమ్మ లీలలు ప్రదర్శింపబడుతుంటే. త్రేతాయుగంలో శ్రీరామ చంద్ర ప్రభువు కుమారులు లవకుశలు. రామయణాన్ని గానం చేసి రామచంద్రునికి వినిపించిన ఘట్టం తలపిస్తున్నది. మరే అవతారంలో ఇలా జరగలేదు. మరల అమ్మ అవతారంలోనే ఇలాజరిగింది. ఆ మహాకవి వాల్మీకికి లభించిన అదృష్టం నన్ను వరించటం అమ్మ కృప.



**23-3-1985**

తంగిరాల కేశవ శర్మ శ్రీమల్లాప్రగడ శ్రీ రంగారావు గారు వ్రాసిన త్రయీ విద్యకు పీఠిక వ్రాయమని మరీ మరీ అడుగుతున్నాడు. ఇక తప్పదు. అదివ్రాయాలంటే వైజాగ్ వెళ్ళాలి. మరి అమ్మ ఆరోగ్యం అంత అంత మాత్రము గానే ఉన్నది. పైగా జిల్లెళ్ళమూడిలో లక్ష్మణరావు గారింటికి వెళ్ళాలని కూడ నిర్ణయం తీసికున్నాము. 27 వ తారీఖు వరకు అక్కడనే ఉండవచ్చు. సరే ఇదే అవకాశంగా తీసుకుంటాను. అమ్మను జాగ్రత్తగా చూసుకొనే బాధ్యత వారికే అప్పచెప్పి వైజాగ్ బయలుదేరాను.

**11-6-1985**

అమ్మకు ఆరోగ్యము క్షీణించింది. ఇవాళ అమ్మ భలేసంకటం పెట్టింది. అప్పికట్లలో నా చిన్ననాటి మిత్రుడు కుర్ర అంకినీడు ఆస్పత్రిలో మరణశయ్య మీద ఉన్నాడు. అతని పిల్లలు నాకు కబుర్ల మీద కబుర్లు చేస్తున్నారు. వాడు నన్ను చివరిసారిగా చూడలని కోరుకుంటున్నాడు అని.

బయలుదేరాలని ఎన్ని సార్లు ప్రయత్నించినా, అఖరుకు వ్యాన్ దాకా వెళ్ళినా అమ్మ వెనక్కి పిలిపించింది. ఎక్కడకి వెళ్ళకుండా జిల్లెళ్ళమూడిలోనే ఉన్నాను.



20-6-1985

దివ్యశక్తి ఎప్పుడు ఏరూపంలో అవనీస్థలిపై అవతరించినప్పటికీ ఆ కాలంలో లోకమే ఒక అలౌకిక అనుపమ కాంతితో వెలిగిపోతుంది. లోకంలో ఈ కాంతి ప్రసారం బహు అరుదుగా మాత్రమే జరుగుతుంది. ఆ దివ్యకాంతివల్ల మానవాళి మహోపకారం పొందుతుంది.

తనను గురించి మాత్రమే ఆలోచించుకుంటే మానవుడు.

అందరిని గురించీ ఆలోచిస్తే దైవం !

అని అపూర్వంగా నిర్వచించింది అమ్మ

ఇంతవరకు భూమి మీదకు ఎందరో అవతారమూర్తులు అరుదెంచారు కానీ అందరూ "శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ" అని విభజన రేఖలు గీచుకున్న వారే. అందరి యోగక్షేమాల గురించి ఆలోచించిన వ్యక్తులు చరిత్రలో మనకు ఇంతవరకు కనుపించలేదు.

అమ్మ మాత్రమే అందరి యోగక్షేమాలనూ విచారించింది. 'సర్వేజనా సుఖినో భవంతు' అనీ 'లోకాస్సమస్తా సుఖినో భవంతు' అనీ అమ్మ మాత్రమే త్రికరణ శుద్ధిగా ఆకాంక్షించింది.

ఎవరిని చూసినా నాకు నా బిడ్డే అనిపిస్తుంది... అన్న ప్రకటన ద్వారా జగజ్జననిగా...

ఇదంతా అదే ... అన్న ప్రబోధం ద్వారా జగద్గురువుగా....

ఇదంతా నేనే, మీదంతా నేనే, మీరంతా నేనే, ఈ సృష్టి నాది...అన్న ప్రవచనాల ద్వారా జగదీశ్వరిగా....

ఎంత వెదికినా అది కానిది కనిపించడం లేదు అన్న స్థితి వలన పరమజ్ఞానిగా..

భిన్నమస్తక స్థితి వలన యోగీశ్వరేశ్వరిగా....

అమ్మ బహుముఖాల లోకానికి అభివ్యక్తమై, వివిధ దేవతా మూర్తుల్లో సాధకులకు దర్శనం ఆర్తులకు వరప్రదాయినిగా, వాంచితార్థ ప్రదాయినిగా ఆపద్బాంధవియై. విశిష్ట అవతార మూర్తిగా విశ్వవందిత అయింది.

1923, మార్చి 28వ తేదీన జననమంది 62 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా, అనుపమానంగా లోకం పై వాత్సల్యాన్నీ, ప్రేమనూ, ఆదరణనూ, కారుణ్యాన్నీ, జ్ఞానాన్నీ కుంభవృష్టిగా కురిపించింది. దైవత్వంతో పాటు మాతృత్వాన్నీ మేళవించి ఒక అపరూపమయిన వ్యక్తిత్వానికి రూపకల్పన చేసి లోకానికి ఇంతకు ముందు ఎరుగని క్రొత్త అనుభవాన్ని ప్రసాదించి లాలనతో పాలనతో పరవశింపజేసింది.

కాలాన్ని శాసించిన అమ్మ, కాలస్వరూపిణి అయిన అమ్మ కూడా కాలనియమానికి బద్ధురాలు కాక తప్పలేదు. పరిమితులకు లోబడిన, పరిణామశీలి అయిన పార్థివ శరీరానికి ఆద్యంతాలు అత్యంత సహజం. రూపం పరిమితం, శక్తి అనంతం అని చాటిని అమ్మ పరిమితులనూ, పరిధులను అధిగమించి అనంత శక్తి స్వరూపిణి అయింది.

ఈ పరిణామం 1985 జూన్ 12వ తేదీన జరిగింది.

1938-85 మధ్యకాలం జగతికి స్వర్ణయుగం. ప్రేమ రక్త మాంసాదులు ధరించి మానవాళిని మురిపించిన కాలం. కారుణ్యానికి కరచరణాదులు కలిగి లోకాన్ని కనికరించిన తరుణం. జ్ఞానం వాగ్రూపం ధరించి లోకాన్ని ప్రతిధ్వనింపజేసిన సమయం.

మే నెల ఆరంభం నుంచే అమ్మకు అనారోగ్యం మొదలయింవది. మూత్రకోశం కొద్దిగా దెబ్బతిన్నది. గుండె జబ్బు, మధుమేహం, రక్తపోటు తీవ్రంగా బాధించ సాగాయి. రక్తమంతా ఈశ్వరత్వమే అని ప్రవచించిన ఈశ్వరిలో రక్తక్షీణత కలిగింది. సర్వ నాడీమండలం క్రమంగా బలహీనం కావడం ఎక్కువయింది. ఫలితంగా శరీరంలో నీరు చేరడం మొదలై శరీరం నీటికుండ అయింది.

డాక్టర్ విద్యాసాగర్, డా॥ ఇనజకుమారి చికిత్స చేశారు. చాలా బలమైన ఔషధాలను వాడారు. సర్వ వ్యాధులూ కూడా ప్రబలం గానే ఎదురు తిరిగాయి. అమ్మ అజేయమైన శక్తి ముందు అందరూ ఓడి పోవలసిందే అని మనం తరుచుగా అనే మాటను ఆధారం చేసుకుని 'మెడికల్ సైన్సు కూడా ఓడిపోతున్నది. అని డాక్టర్లును పరిహసించినంది. ఈ ఘర్షణలో అమ్మ శరీరం అమితమైన బాధకు గురి అయింది. సహన స్వరూపిణి అమ్మ"బాధ భరించలేను. శరీరం తట్టుకోలేక పోతున్నది" అని వివరిస్తూ "శిథిలమయ్యే ఈ శరీరానికి ఎన్నాళ్ళని పోటీలు పెట్టమంటారు' అని ప్రశ్నిస్తూ, "సహనం చచ్చిన పిదప బ్రతక్కూడదు" అని చమత్కరిస్తూ, "నేను వచ్చిన పని అయిపోయింది. ఇక నన్ను పోనీండి. నవ్వుతూ నన్ను పంపించండి" అని తరుచుగా అడిగింది.

వైద్యుల శ్రమ ఫలించింది. మే నెల చివరకు అమ్మకు నీరు బాగా తగ్గింది. కాని, ఏం లాభం ? పర్యవసానంగా శరీరంలోని లవణాలు, నీరు.... ఒకటేమిటి? సర్వ ప్రాణావసర పదార్థాలు లోపించాయి. రక్త పోటు బాగా పడిపోయింది జూన్ 2వ తేదీన ప్రాణాపాయ పరిస్థితి ఏర్పడింది. డాక్టర్లు మళ్ళీ తీవ్రస్థాయిలో చికిత్స చేశారు. నరాల ద్వారా లవణాలు, నీరు ఇచ్చారు. ఆ స్థితిలోనే అమ్మ ఆవరణలోని అనేకులకు అంతిమ సందేశం ఇచ్చింది. ఒక్కొక్కరిని పిలిపించి మాట్లాడింది. నాకు కూడా అమృత సందేశం ఇచ్చింది.

చూడ వచ్చిన వారందరికీ అమ్మ నమస్కరించింది. ఆ నమస్కారాలకు ఒక్కొక్కరు గతుక్కు మంటుంటే "మీరందరూ మహానుభావులు, దైవస్వరూపులు. అందుకే అందరికీ వందనాలు" అన్నది.

అమ్మకు సెలైన్ ఇవ్వడానికి ప్రయత్నాలు జరుగుతంటే వాళ్ళను వారిస్తూ అమ్మ అన్నది "ప్రయాణానికి సిద్ధంగా ఉన్న నాకెందుకూ ఈ సెలైన్ ? అన్నపూర్ణాలయానికి ఇవ్వండి. " అని అన్నపూర్ణాలయం గంట వినిపించ లేదని తహతహలాడింది. తాను ఉన్నా, లేకపోయినా అన్నపూర్ణాలయం గంట నిత్యం వినిపించాలన్నది. అన్నపూర్ణాలయం గంట ఆగిపోతే తన గుండె ఆగిపోతుంది అన్నది. ఆ ఘంటానాదంలోనే సర్వ వేదసారం ఉన్నది అన్నది.

"అందరినీ ఒకసారి చూడాలి, పిలిపించరా" అని అడిగింది.

ఆవరణలోని అనేకులు వచ్చి అమ్మ పరిస్థితి చూసీ, అమ్మ మాటలు వినీ భోరు భోరున దుఃఖించారు. అమ్మ కూడా కన్నీరు కార్చింది. కలగబోయే వియోగ బాధకు బిడ్డలు ఎట్లా తట్టుకుంటారూ అన్న ఆలోచనే అమ్మ కన్నీటికి కారణం కావచ్చును.

కానీ ఆ ప్రమాదం తప్పింది. రాజమండ్రి నుంచి డాక్టర్ జస్వంత్, నెల్లూరు నుంచి డా॥ యస్వీ సుబ్బారావు గారు వచ్చారు. అమ్మను పరీక్షించి ప్రమాదం తప్పినట్లు ప్రకటించారు. అందరూ ఎంతగానో ఆనందపడ్డారు.

అంతకు పూర్వమే వైద్యుల సలహా ననుసరించి అమ్మదర్శన కాలాన్ని తగ్గించడం జరిగింది. కానీ జూన్ 3వ తేదీ ఉదయం అమ్మ స్నానం చేసి, చీర కట్టుకుని, నుదుట ఇంత బొట్టు పెట్టుకుని మంచం పై కూర్చుని దర్శనం ప్రసాదించింది. ఆనాటి అమ్మ ముఖంలోని వర్చస్సును చూసి మాతోపాటు డాక్టర్లూ దిగ్భ్రాంతి చెందారు.

రోజులు గడిచాయి.

11వ తేదీ రాత్రి అమ్మ నన్ను పిలిపించి అనేక విషయాలు మాట్లాడింది. తాను వచ్చిన పని అయిపోయిందన్నది. ఇంక బ్రతకడం అనవసరం అన్నది. నాకు దుఃఖం ఆగింది కాదు. సంస్థను యథాతథంగా కొనసాగించమని ఆదేశించింది. ఎప్పటికివలెనే తాను అన్నీ చూసుకుంటా నని వాగ్దానం చేసింది.

12వ తేదీ ఉదయానికి అన్ని వ్యాధులూ నయమయ్యాయి. అమ్మ చికిత్సలో పాల్గొనడానికి బృందావనం నుంచి వచ్చిన డా॥ జానకీదేవి అమ్మకు పూర్ణమయిన ఆరోగ్యం కలిగినట్లు ప్రకటించింది. ఇక నుండి అమ్మ త్వరగా కోలుకొనగలదని ఆశాభావాన్ని వ్యక్తం చేసింది.

ఆ మధ్యాహ్నం అమ్మ కొందరికి దర్శనం అనుగ్రహించింది స్వయంగా తన చేతి మీదుగా ప్రసాదాలు ఇచ్చింది.

సాయంకాలం స్నానం చేసింది. కుర్చీలో కూర్చొని నామ సంకీర్తన విన్నది. ఆ రాత్రికి 8 గం॥లకు తర్వాత తాడేపల్లిగూడెం నుంచి వచ్చిన

యాత్రిక దంపతులకు దర్శనం ఇచ్చి ఆశీర్వదించింది. నాకు పని అంటూ వుంటే మీకు కనబడడమే అని ప్రకటించిన అమ్మ తుది శ్వాస వరకు తన బిడ్డలకు ప్రేమగా దర్శనం ప్రసాదించింది. నన్ను చూడడమే పుణ్యం అన్న అమ్మ ఎంత మందిని పుణ్యాత్ములను చేసిందో !

హఠాత్తుగా అమ్మ శ్వాసలో మార్పు వచ్చింది. ప్రాణ వాయువు చాలక బాధపడింది. బాపట్లలో ఉన్న డాక్టర్ల కోసం, పరికరాల కోసం కబుర్లు వెళ్ళాయి.

డా॥ ఇనజ కుమారి వచ్చింది. ప్రాణవాయువు, పరికరాలు వచ్చాయి. అవసరమయిన ఏర్పాట్లు జరిగాయి. అమ్మ తల నా చేతుల్లోనే ఉన్నది. డాక్టర్లు కొడుకులు కోడళ్ళు, వసుంధర... అంతా అక్కడనే ఉన్నారు, చూస్తూనే ఉన్నారు. అమ్మ అనాయాసంగా, అతి ప్రశాంతంగా నా చేతిలో ప్రాణాలు వదిలింది. మీ ఇష్టప్రకారం నడుస్తున్నట్లు కనిపిస్తాను కానీ నా ఇష్ట ప్రకారమే మిమ్మల్ని నడుపుకుంటాను. అని ప్రవచించిన అమ్మ తన నిర్ణయాన్ని అమలుపరిచింది. నేనేం చేసినా, మీ కోసమే. నేను స్నానం చేసినా, చీరె కట్టుకున్నా మీ కోసమే అని వివరించిన అమ్మ అసువులు విడనాడడం కూడా మన మేలుకోసమే నేమో ! మరి, అమ్మ అవతరించింది. మన కోసం జీవించింది మన కోసమే అయినప్పుడు, ఈ ఉపసంహారం మాత్రం మన కోసం ఎందుకు కాదు? మీ అవసరాలు మీకు తెలీవు. మీ అవసరాలు నాకు తెలుసు అని అమ్మ ఘంటాపథంగా చెప్పింది కదా?

రాత్రి 10.35కు అమ్మ చెప్పినట్లు వైద్య విజ్ఞానం అమ్మ పాదాల మ్రోల అవనతమై పోయింది. అమ్మ తుదిశ్వాస వదిలింది. అందుక్కారణం వైద్యులకు అంతుబట్టలేదు. ఇక నుండి తన యావత్ సంతానాన్నీ అధివ్యాధుల నుండి కాపాడ వలసిన శరీరం వ్యాధి గ్రస్తమై ఉండటం సముచితం కాదనేమో సర్వ వ్యాధుల నుండీ తన దేహాన్ని వినిర్ముక్తమూ, వినిర్మలమూ, విరుద్ధమూ చేసింది.

దివ్య ప్రక్రియ అంతరార్థమూ, దివ్య ప్రణాళిక పరమార్థమూ ఏమయినప్పటికీ... దివ్యశక్తిని మనం అర్థం చేసుకునేందుకూ, ప్రేమను మనం

పొందేందుకూ దేనిని అమ్మ ఉపకరణం చేసుకుందో ఆ పార్థివ శరీరమే, ఆ పాంచభౌతిక దేహమే ఇక మనకు కనుపించదనేసరికి అందరూ నిర్వీర్యులూ, నిస్తేజులూ అయినారు. కాలవనిండుగా నీరున్నా, దాహం తీర్చుకోవడానికి రేవు కావాలి కదా ? దైవశక్తి సర్వవ్యాప్తమై ఉన్నా, మన కళ్ళకు కనిపించింది ఆ మృణ్మయ శరీరమే కదా! మనం పూజించుకుంది ఆ శరీరాన్నే కదా ! మనకు ఏ ఆపద వచ్చినా, ఏ అవసరం కలిగినా మనం పరుగు లెత్తింది ఆ పాదాల వద్దకే గదా ! ఆ మూర్తే మనకు జ్ఞానజ్యోతి ! ఆర్తే మనకు ప్రేమరీతి!

ఆవరణంలోని అందరూ, గ్రామస్థులందరూ అమ్మ నివాసానికి వచ్చారు. వాతావరణమంతా ఉత్తుంగ తరంగిక దుఃఖసాగరమైంది.

కొందరు ముఖ్యులకూ, పత్రికల వాళ్ళకూ రేడియోవారికి వార్తలు వెళ్ళాయి అంతకు ముందు ఆరు నెలలుగా పనిచేయని ఫోను ఆ క్షణాల్లో విచిత్రముగా పనిచేసి అమ్మకు విధేయతను ప్రకటించింది.

ఆ శరీరాన్ని ఏం చేయల్సిందీ కూడా అమ్మ ముందుగానే చెప్పింది. ఆ ఆదేశానుసారమే అనసూయేశ్వరాలయంలో లోగడ నాన్నగారిని ప్రతిష్ఠించినట్లుగానే ఆ గర్భాలయంలో అమ్మకోసం నిర్ణీతమయిన స్థలంలో అమ్మను ప్రతిష్ఠించడానికి నిర్ణయమయింది.

అమ్మ గం10.35 ని॥కు ప్రాణం వదిలితే, ఆ క్షణం నుంచీ క్షణ క్షణం ముఖంలో దీప్తి అధికమవుతూ గం. 11.30 ని. అయ్యేసరికి అమ్మ ముఖం పున్నమినాటి చంద్రబింబంలాగా ప్రకాశించింది. ఆ వెలుగు చివరి వరకూ చూచేవాళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూనే ఉన్నది.

13వ తేదీ తెల్లవారే సరికి ఈ విషాదవార్త దేశమంతా తెలిసింది అన్ని పత్రికలూ మొదటి పేజీలో ప్రచురించాయి. రేడియో ప్రాంతీయ వార్తల్లోనూ, జాతీయ వార్తల్లోనూ ప్రకటించింది. అందువల్ల భక్తులు వేల సంఖ్యలో చివరి దర్శనం చేసుకోగలిగారు.

ఆ రోజంతా అమ్మ సన్నిధిలో లలితాసహస్రనామ పారాయణ జరిగింది. అమ్మ నామ సంకీర్తన జరిగింది. సుప్రభాత సంధ్యా వందనాలు మామూలుగానే జరిగాయి. అన్నపూర్ణాలయం గంట అమ్మకు వీనుల విందు చేసింది.

14వ తేదీ ఉదయం మహా యాత్ర ప్రారంభమైంది. ఆ గదిలోనే అమ్మకు స్నానం చేయించి, బిన్నీ సిల్కు చీరె, సర్వాభరణాలు అలంకరించారు. గది బయటకు తీసుకు వచ్చి మంచంపై పడుకోబెడితే ప్రాణం లేనట్లు ఏమాత్రం లేదు. అతి ప్రశాంతంగానూ, అధిక తేజోవంతంగానూ ఉంది ముఖం. సుమారు గం.7.00లకు అమ్మను మంచంపై బయటకు తీసుకువచ్చి అలంకరించబడ్డ బండిపై ఉంచారు. గ్రామస్థుల కోరికపై గ్రామంలో హాహాకారాలతో, జయ జయ ధ్వానాలతో, మంగళ వాద్యాలతో ఊరేగింపు జరిగింది.

హైమాలయంలో ప్రత్యేకంగా నిర్మించిన ఉన్నతమైన వేదికపై అమ్మ మామూలుగా పూజావేళల్లో కూర్చునే సింహాసనంలో అమ్మను ఆసీనను చేశారు. వెయ్యి లీటర్ల పాలతో అమ్మకు అభిషేకమూ, పుట్టిపూలతో పూజా జరిగాయి. ఈ అభిషేక అర్చనల్లో అందరూ పాల్గొన్నారు. ఆ పూజలో పాల్గొన్న వారెవరూ అది ఒక విగతజీవికి చేసే పూజగా భావించలేదు. ఏ జన్మదినోత్సవంలోనో, కళ్యాణ దినోత్సవంలోనో అమ్మకు చేసే పూజగానే ఉత్సాహంగా జరిగిపోయింది.

మధ్యాహ్నం గం1.30ని॥లకు అమ్మ అనసూయేశ్వరాలయ ప్రవేశం చేసింది. గం.1.58 ని॥లకు గర్భాలయంలో ప్రతిష్ఠ జరిగింది, భూగృహంలో సర్వాభరణ భూషిత అయిన అమ్మతోపాటు, అమ్మ స్వయంగా వాడుకునే వస్తువులూ, అమ్మ జీవిత చరిత్ర (మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు), లలితా సహస్రనామానికి భారతీవ్యాఖ్య, త్రయీవిద్య గ్రంథాలూ నిక్షిప్తం చేయబడ్డాయి. ఆ భూగృహాన్ని, ఆ చింతామణి గృహాన్ని లవణం, విబూతి, కుంకుమలతో నింపేసరికి సాయంకాలం గం.3.00గం॥లయింది. ఆసనం వేయించడంలో, ప్రతిష్ఠించడంలో శరీరం రబ్బరు బొమ్మవలె సహకరించింది.

ఆ మర్నాటి నుండి 11 రోజులు అనసూయేశ్వరాలయంలో అభిషేకాలూ, పారాయణలూ, లక్షనామార్చనలూ అధికంగా జరిగాయి. పూర్ణాహుతినాడు సాయంకాలం అమ్మ నివాసాన్ని 'వాత్సల్యాలయం'గా నామకరణం చేసి అమ్మ ఫోటోలు, వస్తువులు అందరూ దర్శించేందుకు వీలుగా మార్చబడగా, శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులవారు దానిని ప్రారంభించారు.

ఆ సభలో అమ్మ ఆదేశానుసారం, అమ్మ అభీష్టానుసారం అమ్మ ప్రారంభించిన అమ్మ సంస్థలు యథాతథంగా కొనసాగుతాయని శ్రీ విశ్వజననీ పరిషత్ ప్రకటించింది. తాను ఇకముందు కనపడనని ఎవరూ బాధపడవద్దని అభయమిస్తూ, ఎప్పటిలాగే బిడ్డల నందరినీ తాను కనిపెట్టి ఉంటానని అమ్మ ఇచ్చిన హామీ కూడా సభా ముఖంగా అందరికీ అందించబడింది. దానితో అప్పటి దాకా నీటిలో మునిగిన వారు ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అయినట్లు గుండె బరువెక్కి ఉన్నజనం నీటి నుండి తలలు బయటకు వచ్చినట్లు కొద్దిగా గాలి పీల్చుకున్నారు. గుండెబరువు దిగినట్లయింది. కారుచీకటిలో ఆశాజ్యోతి వెలిగింది.

అమ్మ-అమ్మంటే ఏమిటో ఎంతో వివరంగా చెప్పింది. అమ్మ అంటే అంతులేనిదీ, అడ్డులేనిదీ, అన్నిటికీ ఆధారమైనదట. అమ్మ అంటే ఈ నాలుగు గోడల మధ్య మంచంపై కూర్చున్న ఈ నాలుగడుగుల పది అంగుళాల వ్యక్తి కాదు. ఈ సర్వానికీ ఆదీ అంత్యమూ ఏదో, దేనికి ఆదీ అంతమూ లేదో అదే అమ్మ అని కూడా ప్రవచించింది. రూపం పరిమితం, శక్తి అనంతం అన్నది. నేను నేనైన నేను అన్నది. అన్ని నేనులూ నేనే అన్నది. ఇదంతా నేనే అన్నది. మీరంతా నేనే అన్నది.

ఇంత వివరంగా చెప్పిన అమ్మకు ఇక అంతం ఏమిటి ? రూపానికి పరిమితి ఉన్నది. కనుక కళ్ళు తెరచిన మాత్రాననే ఎవరికైన కనిపించే ఆ మహాలావణ్య శేవధి, ఆ నిరుపమ సౌందర్య జలధి, ఆ కనువిందైన కమనీయ రూపం కనుమరుగు కావచ్చునూ, అమ్మ ఆశరీరి, అన్నాయువూ కావచ్చునూ కానీ మహిమాన్విత మయిన ఆ దివ్యత్వం, మధురాతి మధురమయిన ఆ మాతృత్వం,, అఘటనా ఘటన సమర్థమూ, అనంతమూ అయినా శక్తి ఎక్కడకు

పోతుంది ? ఎక్కడకూ పోదు. అంతటా ఉంటుంది. ఎల్లప్పుడూ ఉంటుంది. పరిమిత శరీరం విడిచే సరికి ఇప్పుడు అమ్మ సహస్ర పాదాలతో, సహస్ర కరాలతో, సహస్ర శీర్షాలతో విరాడ్రూప. విశ్వసాక్షి. విశ్వరూపిణి. విశృంఖల, మహెూజ్జ్వల చతుష్షష్టి కళారూప. సర్వాత్మ స్వరూపిణి. అమ్మ పంచభూతాలూ ఉన్నంత కాలం ఉంటుంది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ఉన్నంతకాలం ఉంటుంది. భూమిపై మనిషి ఉన్నంత కాలం ఉంటుంది. మనిషి మనిషిలో ప్రాణ రూపిణియై, ప్రేమ స్వరూపిణియై అలరారుతుంది. అమ్మ అవినాశ. అమ్మ అనంత, అమ్మ అక్షర అమ్మ అజరామర.

మనం లోపలికి అవలోకిస్తే అమ్మ, బయటకు ఆలోకిస్తే అమ్మ మరి, అన్ని నేనులూ నేనే నన్నది కదా ! ఇకనుండి మనలో ఉండే మనను నడిపిస్తుంది. మనను కనికరిస్తుంది, మనను కాపాడుతుంది అమ్మ.

అయినా–నాన్నగారి పక్కనే నాస్థానం. ఎప్పటికైనా నా నివాసం అనసూయేశ్వరాలయమే–నని స్పష్టంగా ఎన్ని పర్యాయాలో అమ్మ చెప్పింది.

కనుకనే ఈ అనంత శక్తి సాగరానికి రేవు, మానవాళికి శాశ్వత తీర్థయాత్రాస్థలం జిల్లెళ్ళమూడి అయింది. సర్వ ప్రజానీకానికీ అభయప్రదాయినియై, ఆశాజ్యోతియై అనంద దీప్తితో వెలుగొందుతున్నది అనసూయేశ్వరాలయం.

అమ్మా – మహాపూజ్యా, మహేశ్వరీ, మహారతీ !
అందుకో అందుకో ఆదరంతో మా హారతీ !!



## 10-8-1986

నిన్న రాచకొండ వరలక్ష్మి పెండ్లి

ఈ రోజు పులఖండం రాధాకృష్ణ రావు (పి.ఆర్. రావు)గారి అమ్మాయి పెండ్లి. 9వ తేదీ రాత్రి పెండ్లి అయిన తర్వాత వర్షం. 10వ తేదీ రోజంతా వర్షం కురుస్తూనే ఉంది. అయినా పెండ్లిండ్లు బాగానే అయినాయి.

ఈ పెండ్లిండ్లలో హనుమ బాబు, ప్రకాశరావు బాగా పనిచేశారు. రెండు పెండ్లిండ్లను అద్యంతము స్వయంగా పర్యవేక్షించాను. జ్ఞాపక శక్తిగానీ, నిర్వహణ సామర్థ్యంగానీ పస తగ్గలేదనిపించింది.

## 13-8-1986

నల్లమడ డ్రైన్‌కు గండిపడ్డది. ఎమ్.ఆర్.ఒ. కూ అసిస్టెంట్ ఇంజనీరింగ్ (డ్రైనేజ్) కు రిపోర్ట్ ఇచ్చాను.

వాళ్ళు మధ్యాహ్నం 12 గం॥ల కల్లా వచ్చారు. నేను కూడా అక్కడకు వెళ్ళాను. గండి క్షణం క్షణం పెరుగుతు వచ్చింది. రాత్రి 10.00 గం॥లకు కాలేజీ విద్యార్థులు, అధ్యాపకులు, గ్రామస్తులు అందరు గండి పూడ్చగలిగారు. నేను అక్కడనే ఉండిపోయాను పనిపూర్తయ్యేంత వరకు.

## 15-8-1986

జెండా ఎగరవేశాను. స్వాతంత్రదినం గురించి ప్రసంగం చేశాను. ఉత్సవం బాగా జరిగింది. పారాయణ (మండల) కార్యక్రమం మొదలయింది. లలితాసహస్రనామం + కనక ధారస్తవం + అనపూర్ణాష్టకం పఠించారు. అన్నపూర్ణాలయం సిబ్బంది చేతపూజ చేయించాను. అమ్మకు నివేదన చేయించాను. రామకృష్ణ, సాయి లక్ష్మి , చిదంబరం, సాయి, లక్ష్మి పుల్లయ్యలకు క్రొత్త గుడ్డలు పెట్టాను.



## 26-8-1986

ఖమ్మం నుండి ఉత్తరం. చి.సుబ్బారావుకు మగపిల్లవాడు తల్లీ పిల్లవాడు కులాసా. ఆదివారం ఉదయం గం॥ 10.04 ని॥లకు అక్షయ నామ సంవత్సరం శ్రావణ బహుళ పంచమి అశ్వనీ నక్షత్రం. కొండముది వంశవృక్షం మారాకు తొడిగింది. ఈ రోజు పద్మావతి ఆనందానికి అవధులు లేవు. ఆవరణం అంతా తిరిగి అందరికి పంచదార పంచింది.

## 27-8-1986

డాక్టర్ సత్యంతో కలిసి కొమ్మూరు వెళ్ళాను. డాక్టర్ అనంత సీతాచలం గారు 12-8-86 న మరణించారు. ఆయనకు 78 సంవత్సరాలు.

భార్య-వరలక్ష్మి నలుగురు కొడుకులు ప్రసాద్, సత్యం, కళ్యాణ రావు, పద్మ, విజయ లక్ష్మి కుమార్తెలు నవీనచంద్, లవకేశ రావు అల్లుళ్ళు. కొడుకులు, కోడళ్ళు కూతుళ్ళు,అల్లుళ్ళు మనుమరాళ్ళు... తామరతంపరగా పెరిగిన కుటుంబం. పూర్ణజీవితం. అనసూయేశ్వరాలయానికి సహాయం. 1956 - 60 బాగా. తర్వాత అరుదుగా. కొమ్మూరు నుండి బాపట్ల వచ్చాము. గుంటూరు శేషయ్య గారు దుర్మరణం. మనస్థిమితం లేక బయటికని రైలు కట్టకు వెళ్ళి రైలు క్రిందపడి చనిపోయాడు. ఆయన శవం కూడా ఎవరూ గుర్తు పట్టనందున రైల్వే పోలీసు వారే పంచాయితీ జరిపి ఖననం చేశారు. తర్వాత కుటుంబానికి తెలిసింది. ఆయన సంచీ, లార్చీ, కళ్ళజోడు, చెంబును బట్టి శవం ఆయన దేనని నిర్ధారించుకున్నారు. శేషయ్యగారు అన్నపూర్ణాలయ ప్రధాన సారధిగా 1967 అక్టోబరునుండి 1980 వరకు అమ్మకు విశేషమైన సేవలు అందించారు. ఇది ఆయనకు రావలసిన దుర్గతి కాదు. చేసిన ఖర్మల బట్టే మరణం అన్నది అన్ని వేళల నిజంకాదు.

శేషయ్య గారి ఉదంతంతో అమ్మ సంస్థ బాధ్యతలు కొత్త పుంతలు తొక్కవలసిన అవసరం కనిపిస్తున్నది. దీర్ఘకాలం సంస్థకు సేవ చేసిన వారిని అవసాన కాలంలో ఆదుకోవాల్సిన బాధ్యత సంస్థకు లేదా ?



17-8-1986

బాపట్లలో నందిగామ రమణ రావుగారి మనుమరాలు బారసాల. వెళ్ళాను. అమ్మాయికి పేరు నేనే పెట్టాలని అడిగారు. 'అనంత హైమ' అని పెట్టాను. భోజనంచేసి తిరిగి వచ్చాను.

సత్తెనపల్లి నుండి కట్టమూరి హనుమంతరావుగారు అబ్బాయి పెండ్లి చేసుకుని పెండ్లి కూతురితో కలిసి వచ్చారు. వాళ్ళచేత అనసూయే-శ్వరాలయంలో పూజ చేయించాను. వాళ్ళకు అమ్మ ప్రసాదంగా గుడ్డలు పెట్టాను.

21-8-1986

బాపట్లలో డా॥ పాప, చేత అక్కయ్య గడ్డ పరీక్ష చేయించాను. సుగర్ నిల్. గడ్డ బాగాతేలింది. శనివారం నాడు ఉదయం ఆపరేషన్ చేస్తానన్నది.

23-8-1986

ఉదయం గం.9.45- 10 గం॥లకు అక్కయ్య కురుపును డా॥ పాప, ఆపరేషన్ చేసింది. జనరల్ ఎనస్తీషియా యిచ్చింది. రాత్రి జిల్లెళ్ళమూడి తిరిగి వచ్చాము. బావ, శ్యాము, వాణి, నేను వెళ్ళాము, మధు, అమ్మాయి కూడా వచ్చారు.

బాపట్ల ప్రెస్

28-8-1986

హైదరబాద్ రావూరి సత్యనారాయణగారి అమ్మాయి పెండ్లికి గ్రీంటింగ్స్ పంపాను. గన్నవరం నుండి బూదరాజు శర్మ వచ్చాడు వాళ్లమ్మకు ఎట్లా ఉందో తెలుసుకుందామని.

30-8-86

భట్టిప్రోలు నుండి చిన్నక్కయ్య వచ్చింది. పెద్దక్కయ్యను చూద్దామని నా కుటుంబ పరిస్థితికి విచారపడ్డది. బావకు పెన్షన్ వస్తున్నదట. కొంత డబ్బు నన్ను తీసుకోమన్నది. వద్దన్నాను.



## 3-10-1986

తెల్లవారు ఝామున 4 గం॥లకు లేచి కాలకృత్యాలు పూర్తి చేసికొని నడచి 7వ మైలు వద్దకు వెళ్ళాను.

నందిపాడు వెళ్ళి బస్సు ఎక్కి టికెట్టుకొన్నాను. పేపర్ కొందామని బస్సు దిగి వెళ్ళాను. చూస్తుండగానే బస్సు వెళ్ళిపోయింది. చేసేదేమి లేక సంచీ మనదైతే అమ్మే తిరిగి ఆసంచి దక్కిస్తుంది అనుకున్నాను.

గుంటూరు బస్టాండ్ లో డ్రైవరు సంచీ తీసికొని ఇంటికి వెళుతూ సరిగ్గా నేను బస్ దిగిన చోటుకే వచ్చాడు. నా సంచీ నేను తీసుకొని అమ్మకు, అతనికి  నమస్కరించుకున్నాను.

గుంటూరులో కట్టమూరి వెంకటేశ్వర రావును కలుసుకొని వాళ్ళ యింట్లో టిఫిన్ చేశాను. వాళ్ళందరూ చాలా ఆప్యాయంగా చూశారు. టాక్సీలో క్రోసురు వెళ్ళాము. అక్కడ ప్రసాద్‌ను కలిశాము. దారిలో సత్తెనపల్లిలో వెంటేశ్వర రావు వాళ్ళ నాన్న కట్టమూరి హనుమంతరావు గారింటికి వెళ్ళాము. వాళ్ళు కాఫీ ఇచ్చారు. చాలా ప్రేమగా చూశారు. అమ్మ వచ్చినట్లున్నది అనుకున్నారు.

రిజిష్టరు ఆఫీస్‌లో దస్త గిరికి అమ్మిన భూమి రిజిష్టరు అయినది. రిజిష్టార్ ఆఫీసులో అందరూ కూడా చాలా గౌరవించారు. అమ్మను గురించీ సంస్థను గురించీ వివరాలు అడిగి తెలుసుకున్నారు.



## 11-10-1986

సాయంకాలం

చండీయాగం పూర్తి అయిన తర్వాత ఆశీర్వచన సదస్సుకాగానే ఒక సోదరుడు చాలా అసభ్యంగా ప్రవర్తించాడు. దుర్భాషలాడాడు. గుడ్లు పెద్దవి చేసి మీదకు వచ్చాడు.

ఏమిటి ? ఎందుకు? అని రెండు సార్లు అడిగినా చెప్పలేదు.

అంతకుముందు యాగం జరిగేటప్పుడు 'అమ్మ' బొమ్మను అందరి దగ్గరకు తెస్తూ - నా దగ్గరకు తెచ్చాడు. ఏమిటీ కార్యక్రమం ? అన్నాను. సమాధానం చెప్పకుండా 'దణ్ణంపెట్టుకో' అన్నాడు. పెట్టాను. కానీ అందరితో నేను అమ్మకు దణ్ణం పెట్టకుండా అమ్మను అవజ్ఞ చేశానని ప్రచారం చేస్తున్నాడు. ఆవరణంలో అందరు చాలా బాధపడ్డారు. కాని ఎందుకో నాకు బాధకలగలేదు. ఆ సోదరుడుతో నాకు గల స్నేహంవల్లో, ఇది కూడా అమ్మ ప్రేరణ వల్లనే అన్న తాత్విక చింతనతోనో. ఈ మధ్య యిటువంటి సంఘటనలు తరుచు జరుగుతున్నాయి.

నన్ను మానసికంగా క్రుంగతీసి బయటకు పంపించాలని కొందరి ఉద్దేశం అది అవసరమా ? నా కోసం అయితే నేనుగా బయటకు వెళ్ళదల్చుకోలేదు. నేను బయటకు వెళ్ళడం సంస్థ శ్రేయస్సుకు ఉపకరిస్తుందంటే మాత్రం అవశ్యం వెళ్ళిపోతాను. నిరంతరం తెగని ఆలోచన. కాలమే నిర్ణయించాలి.

## 14-10-1986

జిల్లెళ్ళమూడి వచ్చాను. రాధాకృష్ణగారు కలిసి విజయవాడ వెళ్ళవలసి ఉన్నది కానీ బి.ఆర్.కె వాళ్ళ అమ్మకు సీరియస్‌గా ఉంది.

రాజుకు కూడ సీరియస్‌గా ఉంది. అందువల్ల ప్రయాణం వాయిదా వేసుకున్నాము. రాత్రి 10 గం॥లకు రాజును వాళ్ళ అబ్బాయి రమణ వచ్చి గుంటూరు తీసుకువెళ్ళారు. రాత్రి గం॥11.30ని॥లకు బి.ఆర్.కె. అమ్మ చనిపోయింది.



## 15-10-1986

బి.ఆర్.కె. వాళ్ళ అమ్మ దహన సంస్కారాలు అయ్యేసరికి సాయంకాలం 4 గం॥లయింది. భోజనాలు 5.00 గం॥లకు. అందువల్ల ప్రయాణం మరునాటికి వాయిదా వేసుకున్నాను.

## 20-10-1986

భట్టిప్రోలులో భోజనం. బరువుగా ఇల్లు అమ్మకం విషయం వచ్చింది.

అమ్మి బాపట్లలో కట్టుకోవడం మంచిదని సలహా యిచ్చాను. బావకు పి.ఎఫ్. మనీ వచ్చింది. దాదాపు రూ.35,000/-లు అందులో రూ.10,000/-లు నాకు యివ్వాలని వాళ్ళకు ఉంది. నేను అప్పుగా యివ్వమన్నాను. వాళ్ళు అందుకు ఒప్పుకోకపోయినా, నేను ఆ షరతు పైనే తీసికోదలుచుకున్నాను.

అక్కయ్య - బావ ఆదర్శమైన జంట. బావెంతో నిజాయితీ గల టీచర్. అక్కయ్య సహనంతో చాకచక్యంగా సంసారం యీదుకు వచ్చింది. రాత్రికి విజయవాడ చేరాను.

## 23-10-1986

కోణార్క్‌లో ఖమ్మం గం॥10.30ని॥లకు చేరాను. దీప్తి, అనసూయ చాలా సంతోష పడ్డారు. రామచంద్ర రావు ఇంటిల్లిపాదీ ఆనందించారు. రామచంద్ర రావు అమ్మను పూర్తిగా నమ్ముకున్న వ్యక్తి. పిల్లవాడు, సుబ్బారావు కొడుకు, బాగున్నాడు. ఆరోగ్యం తక్కువగా ఉంది. దండి విమలను చుశాను. అందరూ ఆమెను అమ్మా అనీ వాళ్ళయనను నాన్నగారు అని పిలుస్తున్నారు. వాళ్ళింట్లోనే రాజరాజేశ్వరి ని ప్రతిష్టించింది. ఖమ్మంలో అమ్మ సినిమా వేయించమని అడిగింది. షిర్డిసాయి బాబా గుడి చూశాను. విగ్రహం బాగుంది. రాత్రికి విజయవాడ చేరాను.



బాపట్ల,

**4-11-1986**

వసుంధర గదంతా ఏర్పాటు చేసిన అమ్మ ఫోటోలు చూశాను. చాలా బాగున్నాయి. వసుంధరని చూస్తే ఆనాటి 'రాధ' ఇలాగే ఉండేదా ? అనిపిస్తుంది. వసుంధర గదిచూస్తే అమ్మ దూరమైంది అన్న బాధకూడ దూరమవుతున్నది.



**08-11-1986**

అనసూయేశ్వరాలయంలో నామకరణం. మనవడికి ":హైమాకర్ శ్రీనివాస్" అని పేరుపెట్టాను. ఇప్పటికే సుబ్బారావు పెద్దకూతురికి నాన్నగారి పేరు (నాగేంద్ర దీప్తి), చిన్న కూతురికి అమ్మ పేరు (అనసూయ) పెట్టాను కాదా. అందుకే వీడికి హైమ పేరు. బంధువులు చాలా మంది వచ్చారు.

**11-11-1986**

డా॥ విజయరామ కుమార్ చేత 'కళ్ళు' పరీక్షచేయించు కున్నాను. పవర్ 1.00 నుండి 3.50 పెరిగింది.

డయాబిటిక్ రెటినోపతి ఏర్పడిందట. రైట్ రెటీనాకు హేయరేజస్. లెఫ్ట్ రెటీనాపై మచ్చలు. జిల్లెళ్ళమూడికి వచ్చాను. రాత్రి 9.00 గం॥లకు విఠాల రామచంద్రమూర్తి గారికి ఫిట్ వచ్చింది. ఇదే మొదటిసారట-కంటి నల్లగ్రుడ్లు పైకి పోయాయి. నోటి వెంట నురుగు వచ్చింది. కాళ్లు చేతులు మెలిక తిరిగినాయి. అందరం భయం పడ్డాం.

## 12-11-1986

బాపట్ల. డా॥ విజయ రామకుమార్ నేను మద్రాసు వెళ్ళి వెంటనే లేజర్ రేస్ థెరపీ చేయించుకోవాలన్నారు. శంకర నేత్రాలయం వారికి లెటర్ ఇచ్చాడు. అంతలో ఝూన్నీ వచ్చింది. మష్టార్ గారికి మళీ ఫిట్ వచ్చిందట. వెంటనే జిల్లెళ్ళమూడి వచ్చాను.

## 13-11-1986

పన్నాల రాధాకృష్ణ శర్మగారు హైదరాబాద్ నుండి వచ్చారు. మద్రాసు నుండి అచ్యుత్ కుటుంబం వచ్చారు. నన్ను వెంటనే వాళ్ళ వెంబడి మద్రాసు రమ్మనమని బ్రతిమాలాడారు. నేను సరే అన్నాను. రాధాకృష్ణ శర్మగారు పరామర్శించలేదని పద్మావతి బాగా అల్లరి చేసింది.

## 14-11-1986

శ్యామలను  ఖమ్మం పంపించాను. శ్యాము వెంట వెళ్ళాడు. ప్రేమ్ యూనివర్సిటీకి వెళ్ళాడు. రాత్రి మాష్టారు గారికి 2 సార్లు ఫిట్స్ వచ్చినాయి. శేషు బాగా భయపడింది.

పద్మావతి బాగా అల్లరి చేసింది ఎవరు ఏమి చెప్పినా వినలేదు. లెక్చరర్స్ క్వార్టర్స్ దగ్గరకు వెళ్ళి కూర్చొని ఏడుపులు అరుపులు. అందరినీ తిట్టటం. గోలకు కారణం తెలియదు.

## 15-11-1986

పద్మావతి ప్రొద్దున్నే బాపట్ల వెళ్ళింది. వెంట అమ్మాయి, బూబు వెళ్ళారు. రామచంద్రమూర్తిగారు, శేషు, ఆదినారాయణ, నేను రాజమండ్రి బయలు దేరాము. ఆవరణలో  అనేకులు వ్యాన్ దాకా వచ్చారు. డాక్టర్ నన్ను ప్రయణాలు చేయవద్దన్నారు. అయినా మాష్టర్ గారితో బయలు దేరాను. సాయంకాలం గం॥5.30ని॥లకు రాజమండ్రికి చేరాము. రాత్రే డా॥ జస్వంత్ కు మాష్టారు గారిని చూపించాము. మర్నాడు రమ్మన్నాడు. రాత్రి 10.00 గం॥లకు మాష్టారు గారికి మరల ఫిట్స్ వచ్చింది. 4 ని॥లు ఉంది.



**16-11-1986**

ఎక్స్‌రే, బ్లడ్, షుగర్, కొలెస్ట్రాల్ పరీక్షలు చేయించమన్నారు. చేయించాము. సాయంకాలం రేడియాలజిస్టుకు చూపించాము. స్కల్‌లో కొద్దిగా లోపాలు కనిపిస్తున్నాయి అని అన్నాడు. హైద్రాబాద్‌లో న్యూరో సర్జెన్‌కు చూపించడం అవసరం అని సలహాయిచ్చారు. రామచంద్ర మూర్తిగారి అన్న రామకృష్ణ మూర్తిగారు ఏలూరు నుంచి వచ్చారు.

**17-11-1986**

డాక్టర్ అడుసుమల్లి అబ్బులు చౌదరి (ఐ స్పెషలీస్ట్)కు నా కళ్ళు చూపించాను. వెంటనే మద్రాసు కాని ఢిల్లీగాని వెళ్ళడం అవసరం అన్నాడు. రెండు రెటీనాలు దెబ్బతిన్నాయట. **ఇప్పటికే చికిత్సకు చాలా ఆలస్యమయిందట.** ఇదే విషయం బాపట్లలో డాక్టర్ గారు కూడా చెప్పారు. **ఏమయినా మాష్టర్ గారిని హైద్రాబాద్‌లో పరీక్ష చేయించి తర్వాతనే మద్రాసు వెళ్ళడం అని నిశ్చయించుకున్నాను.**

**18-11-1986**

రాజమండ్రి టు హైదరాబాద్ బై ఈస్ట్ కోస్ట్ ఎక్స్‌ప్రెస్. ప్రయాణం చాలా సులువుగా ఉంది. రాత్రి 07.30 ని॥లకు చేరాము. సనత్ నగర్ సి-14 పోస్ట్ ఆఫీస్ ఎదురు, పోలీస్ స్టేషన్ దగ్గర శేషు యల్డర్ బ్రదర్ పి.ఎల్.నరసింహారావు గారింటికి వెళ్ళాము. ఆ రాత్రివాళ్ళు బయటకు వెళ్ళారు. బయట వేచి చూస్తు ఉండిపోయాము. అమ్మ దయవలన 'తాళం చెవులు' వచ్చినాయి. టిఫెన్ చేసి పడుకున్నాము.

**19-11-1986**

నిజాం ఇన్సీట్యూషన్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌కు వచ్చి డా॥ ఐ.దినకర్ గారిని కలిశాము. ఆయన సి.టి. స్కానింగ్, యూరిన్, రక్త పరీక్షలు, చేయించమని వ్రాసి ఇచ్చారు. వైన్, ఐ, మెడినోవాలో. స్కానింగ్ బ్లడ్ టెస్ట్ చేయించాము. అరుణ కాబ్ర (ఆర్థోపెడిక్ హాస్పటల్ ఎదురు) దగ్గర ఐ టెస్ట్ చేయించాము. సి.టి. స్కానింగ్ మరియు ఐ నార్మల్‌గా ఉన్నాయి.



## 20-11-1986

డా. దినకర్ గారిని కలిశాము. సర్జికల్ కేస్ కాదన్నారు. డా॥ మోహన్ దాస్ (న్యూరాలాజిస్ట్)కు రిఫర్ చేశారు. ఆయన ఇ.ఇ.జి చేయించమన్నాడు. అందుకు తలస్నానం చేయాలి. కె.రామచంద్ర రెడ్డి గారింటికి వెళ్ళి తలస్నానం చేయించాము. ఇ.ఇ.జి. తీయించి యింటికి వెళ్ళి భోజనం చేసేసరికి సాయంకాలం గం॥3.30ని॥లయింది.

## 21-11-1986

ఉదయం తురుమెళ్ళ కృష్ణుడి గారింట్లో టిఫెన్ చేశాను. వాళ్ళ నాగేశ్వరావుకు చీరాల మునిపల్లె కోదండ రామయ్యగారి అమ్మాయిని ప్రతిపాదించాను. బందరు ఉత్తరం వ్రాయమన్నది శ్రీలక్ష్మి. గాయత్రిని, భర్తను, వాళ్ళమ్మాయి లావణ్యను చూశాను. అక్కడి నుండి మౌలాలి వెళ్ళాను. భోజనం నిద్ర. సాయంకాలం మాసబ్ ట్యాంక్ లోని పొత్తూరి వెంకటేశ్వర రావు గారింటికి వెళ్ళాను. అక్కడ నిద్రకు ముందు జిల్లెళ్ళమూడి సంస్థ గురించి అమ్మ గురించి చాలా సేపు మాట్లాడుకున్నాము. యింతకాలం మనస్సులో దాచుకున్న కొన్ని విషయాలు బయటకు అన్నానేమో అనిపించింది.

పడుకోబోయే ముందు 'సుధాయి' గురించి, వెంకటేశ్వర రావు గారికి చెప్పాను. ఆయన గుర్తుంచుకుంటాను అన్నారు. ఏ విషయంలో నయినా అమ్మ సహాయం చేయవలసిందే కాని మనుషులు కాదేమో. ఒక వేళ మనిషి సహాయం చేసినట్లు కనిపించినా అదీ అమ్మ ప్రేరణ వల్లనే అనిపిస్తున్నది.

## 22-11-1986

సనత్ నగర్ వెళ్ళి అక్కడ నుండి అందరం కలసి హాస్పిటల్‌కు వచ్చాము. అన్ని పరీక్షలు పూర్తి అయినవి. రిసల్ట్స్ తెలిసినవి. దోషమేమి కనిపించలేదు. టాబ్లెట్స్ వేసుకుంటు ఉండమని సలహా చెప్పారు. వాళ్ళు మల్కాజ్‌గిరి వెళ్ళారు. నేను బస్సులో రాత్రి గం॥9.30ని॥లకు విజయవాడ చేరాను. హనుమంతు వాళ్ళింట్లో భోజనం నిద్ర.

బయలు దేరేముందు హనుమంతును డబ్బు అప్పు అడిగాను. కంటి వైద్యం కోసమూ, రవిపెండ్లి కోసమూ. ఎంత కావాలన్నాడు. రూ. 10,000/లు అన్నాను. ఇస్తానన్నాడు.

ఈ సంభాషణ జరిగేటప్పుడు హృదయం చలించింది. కళ్ళు చెమరించాయి. ఎందుకో అర్థం కాలేదు. కంటిని గురించా ? చూపుపోతుందనా? కాదు. చూపు పోతుందన్న విషయంలో ఒక నిర్ణయానికి వచ్చేశాను. లోకాన్ని చూసే అవసరం ఇక లేదేమోనని దైవ నిర్ణయమే అనుకుంటున్నాను.

డబ్బుకోసమా ? డబ్బు లేదన్న బాధకూడ ఎప్పుడూ లేదు. డబ్బు గురించి తమ్ముణ్ణయినా అడగడం చిన్నతనం అనిపించిందా, కావచ్చు.

సంస్థకోసం, యితరుల కోసం ఎవరినయినా ఏమయినా నిస్సంకోచంగా, నిర్వికారంగా అడగ్గలను కానీ-సొంతానికి ఎంత దగ్గరి వాళ్ళనయినా, ఎంత చిన్న విషయమైనా అడగాలంటే ప్రాణంపోతుంది. నవనాడులు క్రుంగిపోతాయి. ఇవాళ చూపు ఇంకొంచెం తగ్గినట్లు అనిపించింది.





## 27-11-86

రమణారావు శారద వచ్చారు. పెండ్లి ఖాయం అనుకున్నాము

## 29-11-86

రెండు వందల శుభలేఖలు పోస్ట్ చేశాను. భజన పద్మావతి పెద్దమ్మాయి విశాలాక్షికి సంబంధం కుదిరింది. పెండ్లి ఖర్చులు ఎట్లాగూ అనుకుంటుంటే పెండ్లి ఖర్చులు అంటే, కాఫీ, టిఫెన్, భోజనాలు. పురోహితుడు మేళాలు వగైరా ఖర్చులు నేను భరిస్తాను అన్నాను. ఇక వాళ్ళు పెండ్లి కొడుకుకు రూ.500/- యివ్వలసి ఉంటుంది.

రెండవ అమ్మాయిని భానుమూర్తి చేసుకుంటాను అన్నాడు. ఆ పెండ్లి వీలయితే యిప్పుడు చేయవచ్చును గానీ, 3 పెళ్ళిళ్ళు ఒకే సారి చేయడం మంచిది కాదన్నారు.

## 31-12-1986

డయాబిటిక్ రెటినోపతి ట్రీట్‌మెంట్ కోసం డిసెంబర్ 11వ తేదీ రాత్రి సర్కారులో బయలుదేరి 12వ తేదీ ఉదయం మద్రాసు వచ్చాను. అచ్యుత్ వాళ్ళింట్లో మకాం. డాక్టర్ జగదీశన్ డా॥ రవి వద్ద దయాబిటీస్‌కు, కంటికి చికిత్స.

లేజర్ ట్రీట్‌మెంటు-డిసెంబర్ 25,26,27, తేదీల్లో విజయ హాస్పిటల్‌లో, డాక్టర్ బాబు రాజేంద్రన్, 25వ తేదీన. అచ్యుత్ కుటుంబం గుజరాత్, మహారాష్ట్ర రాజస్థాన్ వెళ్ళినందున రమాదేవి గారింట్లో భోజనం. నాతో సుధా, శ్యామల ఉన్నారు.



**1-2-1987**

శ్రీ కె. పద్మ నాభన్ మనవరాలు (కృప)కు అన్నప్రాశనం చేయడం కోసం వాళ్ళ ఇంటికి ఆహ్వానించారు. అన్నప్రాశన నా చేత చేయించారు.

శ్యామల అన్నదాత ! సుఖీభవ ! పాటపాడింది. దత్తువాళ్ళింట్లో రాధ పెండ్లి చూపులు. పెండ్లి కొడుకు-పోతురాజు రామకృష్ణ శర్మ. సంబంధం కుదరవచ్చు అనిపించింది.

**9-1-1987**

ఉదయం రమాదేవి గారింట్లో భోజనం అయిన తర్వాత క్రొత్త ధోవతులు పెట్టారు రమాదేవి దంపతులు. రమాదేవి యీ 16 రోజులు ఎంత ప్రేమగా భోజనం పెట్టిందో. ప్రసాద్ కూడా బాగా కబుర్లు చెప్పాడు. అతనికి తెలియని విషయం లేదనిపించింది. ఏ విషయం అయినా అనర్గళంగా చేప్పేవాడు. మధ్యాహ్నానికి అచ్యుత్ కుటుంబం తిరిగి వచ్చింది.

**10-1-1987**

ముక్కోటిపండగ, సుధకు అమ్మ ఫోటో యిచ్చి రోజూ పూజ, ధ్యానం, నమస్కారం చేసుకొనమని చెప్పాను. ఈకార్యక్రమం యీ రోజున ప్రారంభం చేయించాను. నేను శ్యామల ఉదయం హౌరాలో బయలుదేరి సాయంకాలం బాపట్ల చేరి ఆ రాత్రి బాపట్లలో ఉన్నాము.

భోగిపండగ **14-1-1987**

సాయంకాలం అనసూయశ్వేరాలయంలో నేను పద్మావతి అమ్మకు పూజ చేసుకొని అమ్మ పాదాలపై భోగిపళ్ళు పోశాము.



## 16-1-1987

రహిఉత్సవం. రాత్రి పూజ చేసుకున్నాను వాత్సల్యాలయంలో. కోనసత్యం కొత్త ధోవతి, కొత్తషర్టు తెప్పించాడు. వసుంధర ఏర్పాటు. 1964 సం॥ నుంచి యిది అమ్మ ఏర్పాటు, అమ్మే కొత్త గుడ్డలు తెప్పించేది. తలంటిపోసేది లేక పోయించేది. మరి రహి పూజకదా. ఆనాడు రొట్టె, టియే అమ్మకు నివేదన.

## 1-2-1987

జిల్లెళ్ళమూడి నుండి వచ్చిన వాళ్ళమూ, సుందర రామన్, వెంకటేశ్వర్లు కలిసి మహాబలిపురం వెళ్ళాము. అమ్మ విగ్రహం చూశాము. నాకు తృప్తి కలగలేదు. బయలుదేరే ముందు ఏమీ మాట్లాడ కూడదు అనుకున్నాను. అయినా ఆ విగ్రహం చూసిన తరువాత చెప్పక పోవటం దోషం అనిపించింది. తోచిన సూచనలు చేశాను. వారు వ్రాసుకున్నారు.

చివరకు బయలుదేరేముందు లక్ష్మీనారాయణ అన్నాడు " ఇవన్నీ ఎవరు చూస్తారు? అమ్మ ఎట్లా కావాలనుకుంటే అట్లాగే తయారవుతుంది" అని. మరి ఇవన్నీ ఎందుకో ?

## 2-2-1987

డా॥ రవి దగ్గరకు వెళ్ళాను. విజయా హాస్పిటల్‌కు వెళ్ళి డా॥ బాబు రాజేంద్రన్‌ను సంప్రదించమని సలహా ఇచ్చాడు. పెయిడ్ రూ. 75/- మధ్యాహ్నం రాండం బ్లడ్ షుగర్ పరీక్ష చేశారు. పెయిడ్ 15/-బ్లడ్ సుగర్ రిజల్ట్ 137 ఎమ్.జి

## 4-2-1987

ఉదయం విజయా హాస్పిటల్‌కు వెళ్ళాను. డాక్టర్ గారు లెఫ్ట్ ఐ లో బ్లడ్ క్లాట్ అయింది అన్నాడు. అది న్యాచురల్ గానే 2 నెలల్లో డిస్సాల్వ్ అవుతుందట లేకపోతే 6 నెలలలో అయినా అవుతుందట. అప్పటికీ కాకపోతే ఆపరేషన్ చేస్తామన్నారు. ఇక లేజర్ ట్రీట్‌మెంట్ మాత్రం అవసరం లేదట.



14-2-1987

గుంటూరు నుండి అంజన్, మురళి మాట్లాడారు. పాండిచేరి నుండి రాధా కృష్ణ శర్మ గారు, ప్రసన్నాంజనేయ శర్మగారు వచ్చారు. వారిద్దరు పాండిచేరి లో రిసెర్చ్ సెంటర్‌లో చేరారు. జిల్లెళ్ళమూడి కాలేజీకి పెద్ద దెబ్బ.

19-2-1987

జేమ్స్ మహాబలిపురం వెళ్ళి వచ్చాడు. ముందు చూడగానే విగ్రహం బాగాలేదట. తర్వాత కెమేరాలో చూస్తుంటే పోలికలు కనిపించాయట.

22-2-1987

గోపాల్ జిల్లెళ్ళమూడి నుండి వచ్చాడు. మహాబలిపురం వెళ్ళి రాత్రికి ఇంటికి చేరాడు. అమ్మ విగ్రహం తనకు తృప్తిగా లేదని చెప్పాడు. శర్మ, జ్యోతి, అచ్యుత్ అందరూ ఆ విగ్రహం వదిలేసి ఇంకో విగ్రహం చేయించడం మంచిదని సలహా యిచ్చారు.

24-2-1987

ఐ. రామకృష్ణా రావు, పద్మనాభన్ వచ్చారు., రామకృష్ణారావు ఆఫీసు పని మీద మద్రాసు వచ్చాడట. విగ్రహం తృప్తిగా లేకపోతే ప్రతిష్ఠాపన మంచిది. కాదన్నాడు.

1-5-1987

ఇవాళనే జిల్లెళ్ళమూడి ప్రయాణం. లక్ష్మీనారాయణ, కేశవశర్మ, పి.ఎస్.ఆర్. రవి, మధు, శ్రీరామయ్యూర్తి, ప్రసాద్ వచ్చారు. మహాబలిపురం వెళుతున్నారట. విగ్రహం విషయంలో తుది నిర్ణయం తీసుకుంటారట. నన్ను కూడా రమ్మన్నారు. నేను రాలేనన్నాను. వెంటనే అంగీకరించారు.



25-6-1987

ఆకలితో అలమటిస్తున్న వారికి పట్టెడు అన్నం పెట్టడం మానవ ధర్మం. ప్రజలు ఆకలి బాధకు గురికాకుండా చూడడం ప్రజా ప్రభుత్వ ప్రధమ కర్తవ్యం. నిరుపేదలకు నిత్యాన్నదానమే మా విధానం

ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు

ఈ ప్రకటన నాకెంతో నచ్చింది. అమ్మ
అందరిలో జ్యోతులు వెలిగిస్తున్నదా ?
అన్ని జ్యోతులు వెలిగితే ఇక లోకంలో
ఆకలి చీకటికి తావెక్కడ ?

5-7-1987

ఎస్.వి.జె.పి జనరల్ బాడీ మీటింగ్. దాదాపు 70 మంది పాల్గొన్నారు. కొందరు సోదరులు కాలేజి స్టూడెంట్స్-హస్టల్ వేరే ఏర్పాటు చేసుకొనవలసిందే అని పట్టుబట్టారు. మరి కొందరు దానిని సమర్థించారు.

అనేకులు అక్ష్మి ప్రసాద్, శేషయ్య లింగం గారు, రావి నూతల రామచంద్ర రావు, బూదరాజు శేషు, ఏకా రాజేశ్వర రావు, పద్మనాభన్, పి. వెంకటేశ్వర్లు గారు ప్రభృతులు కలిసి ఉంటేనే బాగుంటుందని వాదించారు. వాదోపవాదాలతో చాలా సేపు ఏమీ నిర్ణయం కాలేదు. చివరకు వాళ్ళు చెప్పినట్లే నేను సరే అన్నాను. అంటూ స్టూడెంట్స్‌తో పాటు యాత్రీకులకు కూడా పెడతాం అన్నాను. అది మహాదోషం అయింది. అట్లా వీల్లేదని వ్యతిరేకించారు. తగాదా ఎందుకులే అని నేను ఆ ప్రతిపాదన ఉపసంహరించుకున్నాను.

చివరలో నేను యిలా ఏర్పాటు తాత్కాలికమేనని, మళ్ళీ సర్వసభ్య సమావేశం (రెండు సం॥లు) అయ్యేనాటికి అందరం కలసి హాయిగా ఉందామని అన్నాను. ఎవరో వెనక నుండి " ఎందుకూ కలవడం. వీల్లేదు" అని గొణిగారు. ఎంత ద్వేషం! ఇది నా మీద పగా ? పిల్లలపై కక్ష్యా ? పాపం వాళ్ళేం చేశారు.

సభలో రామచంద్ర రావు, శేషు, రాజేశ్వర రావు చాలా బాగా మాట్లాడారు. లాల, మోహన్, రమణ మూర్తి వచ్చారు. ఎల్.వి.జి., లక్ష్మణరావు, డి. వెంకటేశ్వర రావు, చెన్నయ్య, తంగిరాల శాస్త్రి, రాధ, జొన్నాభట్ల, వెంకయ్య, మురళి, నందమూరి సత్యం, దుర్గపిన్ని, చిట్టి పిన్ని కుటుంబాలు, శరచంద్ర, పొట్లూరి సుబ్బారావు, బుద్ధి మంతుడు, హనుమయ్య, కట్టమూరి వెంకటేశ్వర రావు మొ॥ వచ్చారు. బందరు, ఏలూరూ, విశాఖపట్టణం, నెల్లూరు, కాకినాడల నుండి ఎవరు రాలేదు. ఎందరో రిచ్ పీపుల్ బడా బడా వాళ్ళు కలిసి అన్నపూర్ణాలయం నిర్వహించ లేమంటే ఆబృహత్తర బాధ్యతను నేను స్వీకరించాను. ఇక అమ్మ దయ. అమ్మదే భారం. ఆరోగ్యం బాగుంటే ఇంత ఆలోచన లేదు.

### 6-7-1987

సాయం కాలం వసుంధర నివాసంలో కాలేజీ స్టాఫ్ మీటింగ్. కోగంటి సత్య ప్రసాద్, కోనా బుజ్జీ గూడా ఉన్నారు. కాలేజి హాస్టల్ కమిటీని ఏర్పరిచాము. వితాల రామచంద్రమూర్తి – ఛైర్మన్. ఈమని సత్యనారాయణ మూర్తి, వావిలాల మధు సూదన శర్మ, ఉప్పల వరలక్ష్మి. వీళందరు మెంబర్స్. ఎడ్వైజర్స్. ఎస్.ఎల్.ఎన్., నేను, ప్రసాద్, ఇ.ఎస్.ఎన్ & వి.ఎమ్.ఎస్ బ్యాంక్ అకౌంట్ ఆపరేటర్స్. ప్రస్తుతం అవసరాలకు అందరూ 2 నెలల జీతం కంట్రిబ్యూషన్ అడ్వాన్స్ చెయ్యమని చెప్పాను. అందరూ సరే నన్నారు.



## 8-7-1987

అందరికి పనికి వచ్చేటట్లు ఒక విజ్ఞప్తి డ్రాఫ్ట్ చేశాను. మాతృశ్రీ విద్యాపరిషత్ పేర. అందులో 5వ తేదీ సంఘటన వివరించి అందరి నుంచీ సహకారాన్ని అర్థించాను.

విడిపోయిన యీ అన్నపూర్ణాలయ భాగానికి 'అనసూయాలయం' అని నామకరణం చేస్తే బాగుంటుందని అందులో సూచించాను. దానిపై సోదరుల రియాక్షన్ ఎట్లా ఉంటుందో చూడాలి. లోగడ అమ్మ వైద్యం నిమిత్తం రాజ గోపాలా చారిగారి ఇంటికి వెళ్ళినపుడు అక్కడి వంట ఇంటికి "చిన్నపూర్ణాలయం" అని పేరు పెడ్తే కేశవ శర్మ ప్రభృతులు చాలా బాగుందని అన్నారు. రామచంద్ర మూర్తిగారికి విజ్ఞప్తి చదివి వినిపించాను. ఆయన సరే అన్నారు. మధ్యాహ్నం శ్రీమన్నారాయణ మూర్తి చేత ఫెయిర్ చేయించాను. ప్రెస్సుకు పంపాను. డెమ్మిలో 4 పేజీలు రావచ్చు.

## 11-7-1987

ఉదయం 10.00 లకు టి.టి.డి. చీఫ్ ఇంజనీర్ శ్రీ రంగరాజన్ వాళ్ళు ఇ.ఇ, డి.ఇ.ఇ., నిర్మాణంలో ఉన్న కళ్యాణ మండపము చూసేందుకు వచ్చారు. వాళ్ళతో మాట్లాడాను. వాళ్ళకు భోజనం పెట్టించాను. డి.ఇ. గారికి అమ్మ సంభాషణల క్యాసెట్ యిచ్చాను. సాయం కాలం విజయవాడ బయలు దేరాను. పొన్నూరు దాకా కాంట్రాక్టర్స్ కారు. అక్కడ నుండి బస్సు. రాత్రి గం. 8.30ని॥లకు విజయవాడ చేరాను. జిల్లెళ్ళమూడిలో వల్లూరు పాండరంగా రావుతో మాట్లాడాను. ఎస్.వి.జె.పి. ఎమ్.వి.పి. వైరి సంస్థలు కాదు సిస్టర్ కన్‌సెరన్స్. యీ విషయం మన సోదరులు ఏక్షణం లోనూ మరువరాదని చెప్పాను. పరస్పర సహకారంతో సంస్థ అభివృద్ధికి కృషి చేయాలని కూడా చెప్పాను.



## 12-7-1987

డా॥ కృష్ణ స్వామి గారిని కలిశాను. మందు ఇచ్చారు. జన్మదినం కానుకగా అనసూయ కళ్యాణం యిచ్చాను. డా.కె.ఎన్.మూర్తి హనుమాన్ పేట (శంకర్ ఐ హాస్పిటల్) కలిశాను. ఆయన పరీక్ష చేసి (రూ.35/- ఫీస్) ఎడమ కన్ను రెటీనా డిటాచ్ **అయిందనీ కుడివైపు కన్ను రెటినా కూడా ఏ క్షణంలోనైన డిటాచ్ కావచ్చుననీ కనుక వెంటనే మద్రాసు వెళ్ళి ఆపరేషన్ చేయించుకోమని సలహా ఇచ్చారు.** రామలింగేశ్వర రావును కలిసి జిల్లెళ్ళమూడి వ్యవహారాలు స్థూలంగా వివరించాను. ఎమ్.వి.పి.కు కో-ఆపరేషన్ కావాలని అడిగాను.

రాత్రి దుర్గ పిన్నిగారింట్లో పూజకు వెళ్ళాను. జిల్లెళ్లమూడి నుండి గోపాల్ వచ్చి ఉన్నాడు. దుర్గ పిన్నికి మధ్యాహ్నం ఎమ్.వి.పి.కి సహాయం చేయమని చెప్పాను.

గోపాల్ కనీసం డాక్టర్ ఏమన్నాడు అని కూడా అడగలేదు. వాడితో నా అనుబంధం ఎలాంటిది ? ఏ నాటిది ? నాప్రాణ రక్షణ యజ్ఞంలోవాడి పాత్ర నేను మరువగలనా. ఔరా ఇదేనా అమ్మ ఇచ్ఛ! పూజ తర్వాత చంద్ర శేఖర రావు స్కూటర్ మీద వాళ్ళయింటికి తీసుకువెళ్ళాడు.

చంద్రశేఖర రావుకు పరిస్థితులు తేలిగ్గా వివరించాను. పూర్తివివరాలు తెలియచేస్తే వాళ్ళ మనస్సు జిల్లెళ్ళమూడికీ విముఖం కావచ్చు. వాళ్ళ యింట్లో ఫోనులో టి.టి. అప్పారావు తోను, వి.రాఘవేంద్ర రావు గారితో వి కృష్ణాజి రావుతోను మాట్లాడాను. అందరూ అవసరమైన సహయం అందిస్తామని వాగ్దానం చేశారు. గుత్తా సుబ్బారావుతో మాట్లాడ లేక పోయాను. ఇంట్లో లేడు. వాళ్ళ అమ్మాయికి చెప్పాను. **అందరూ ముందు నా ఆరోగ్యం విషయం ఆలోచించుకో మని సలహా యిచ్చారు.** అంటే వెంటనే మద్రాసు వెళ్ళాలి. వెళితే యిక్కడి విరాళాల కార్యక్రమం? విరాళాలు వసూలు చెయ్యక పోతే

పిల్లల భోజనాలు ఎట్లా? పెద్ద సమస్య అయిపోయింది. భావ ఘర్షణ. ఈ ఉద్యమంలో ఓడిపోయినా, చచ్చిపోయినా పర్వాలేదు అనుకుని దిగాను. కానీ చూపు పూర్తిగా పోతే ఏంచేయాలి.

అట్లా అని మద్రాస్ వెళితే ఎప్పుడు రాగలనో ? యీలోగా ఎట్లా ? ఎవరు ఆదుకుంటారు ఖర్చు ? దాదాపు 60,70 వేలు ఉంటేగానీ నవంబరు రాదు. నవంబరులోగాని స్కాలర్‌షిప్ మనీరాదు. **అమ్మ పెద్ద పరీక్ష పెట్టింది. ఎట్లానడిపిస్తుందో చూడాలి. కాలమే కర్తవ్య బోధచేయాలి.**

రమణమూర్తి 2 సార్లు నా కోసం వచ్చాడు కానీ నేను కలవలేక పోయాను. జిల్లేపల్లి భాస్కర రావు గారికి పూజా సమయంలో పరిస్థితులు, ఘర్షణలు వివరించాను.

సంస్థలో విద్యాలయాలు తప్పక అవసరం అన్నారు. సహకరిస్తానన్నారు. రామలింగేశ్వర రావు నా వైద్యం నిమిత్తం రూ. 500/-లు ఆఫర్ చేశాడు. తీసుకోలేదు నీవు చేయగలిగింది ఎమ్.వి.పి.కి చేయమన్నాను. తర్వాత చేస్తానన్నాడు. అతను చూపించిన ప్రేమకు కృతజ్ఞత చెప్పాను.

13-7-1987

ఉదయం పూరి ఎక్స్‌ప్రెస్‌లో తెనాలి వచ్చాను. సామాను ఎమ్.ఎస్.ఆర్ గారింట్లో పెట్టి చలపతిగారింటికి వెళ్ళాను. దుర్గమ్మ కూతురి (2వ) బారసాల. నామకరణం నన్ను చెయ్యమన్నారు.

అనేక మంది విమర్శిస్తున్న విషయం మనస్సులో ఉంచుకోని వాళ్ళనే చెయ్యమన్నాను. వాళ్ళు ఒప్పుకోలేదు. "అనసూయ" అని చేశాను. అందరూ సంతోషించారు.

ఈ విషయం తెలిస్తే కొంతమంది ఎలా ప్రవర్తిస్తారో ? మరి ఏం చేయను? వాళ్ళు ప్రేమతో అడిగినప్పుడు నామకరణం అన్నప్రాశన లంటే క్రియలు చేస్తే తప్పేమిటో ? నాకు బోధపడటం లేదు.

ఇందులో నేనేమైనా అహంకరిస్తే అది తప్పు. అమ్మకు మనం అవయవాలం, ఉపకరణాలం అన్న భావనతో చేస్తే తప్పుకాదేమో, మనమే చేస్తున్నామనే అహంభావం ప్రకోపించనంత వరకు ప్రమాదంలేదు.

చలపతి అల్లుడు సూరిబాబు, దుర్గమ్మ కలిసి బట్టలు పెట్టారు. అక్కడనే భోజనం చేశాను. ఎమ్.ఎస్.ఆర్ గారింటికి వచ్చి నిద్రపోయాను.



## 14-7-1987

తెనాలి సాయంకాలం ఎమ్.ఎస్.ఆర్ గారింట్లో మేడపైన సమవేశం ఎల్.వి.జి., ఎమ్.ఎస్.ఆర్, ఎన్.సుబ్బారావు, మూర్తి, శ్రీరామ మూర్తి, చలపతి, మురహరి, చంద్రమౌళి సీతారామయ్యగారు, ఏకా రాజేశ్వర రావు వచ్చారు. శీను కూడ వచ్చాడు. జిల్లెళ్ళమూడి పరిస్థితులు వివరించి 5-7-87 సభా విశేషాలు వివరించి, సహకారం అర్థించాను. అందరూ అంగీకరించారు.

నేరెళ్ళ సుబ్బారావు వెంటనే రూ. 2000/-లు వాగ్దానం చేశాడు. ఎమ్.ఎస్.ఆర్ అందరికీ టిఫెన్, కాఫీలు యిచ్చాడు. కుటుంబరావు, విజయ పాటలు పాడారు. రాజేశ్వర రావు బస్టాండ్‌కు వెళ్ళి బస్సులు లేక తిరిగి వచ్చాడు.



తెనాలి,

## 15-7-1987

తెనాలి, తెల్లవారు ఝూము నుంచే లూజ్ మోషన్స్ మొదలైయినాయి. చలపతికి చెబుతే ఏవో టాబ్లెట్స్ తెచ్చియిచ్చాడు. కొద్దిగా సర్దుకున్నాయి. వసూళ్ళ కార్యక్రమం మొదలయింది.

ఎల్.వి.జి. మూర్తి, శ్రీరామ మూర్తి, చలపతి, మురహరి నేను ముందుగా నేరెళ్ళ సుబ్బారావు వద్దకు వెళ్ళాము. కాసేపు ఆవేశంగా జి' మూడి లోని పరిస్థితులను గురించి బాధపడ్డాడు. రూ.2000/- ఇచ్చాడు.

ఇట్లాంటి బాధను ఎంతమందో వ్యక్తం చేస్తున్నారు. వాళ్ళందరినీ మళ్ళీ ఒక్క త్రాటి మీదకు తీసుకురావలసిన అవసరం ఎంతయినా ఉంది. నా ఆరోగ్యమేమో ఏమీ బాగుండకపోయే. ఏంచేయను ? తలుచుకుంటే చాలా బాధగా ఉంటుంది. తలచుకోకుండా ఉండలేను.

## 15-7-1987

అక్కడ నుండి లింగరాజుగారిని కలిశాము. ఆయన్ను కూడా మాతో పాటు రమ్మని అడిగాను. అంగీకరించాడు కానీ మధ్యాహ్నం నుంచి వెళదామన్నాడు. తెనాలి సోదరులందరు నన్ను వెంటనే మద్రాసు వెళ్ళమని, రాగానే వసూళ్ళు పునఃప్రారంభం చేద్దామని చెప్పారు. సరే అన్నాను.

## 16-7-1987

ప్రొద్దునే అందరం కలిసి (శివాజీని కూడా కలుపుకున్నాము) నూకల రామకోటేశ్వర రావును కలిశాము. ఆయన అమ్మగారికి ఒకసారి యిచ్చాను కదా ఎన్నిసార్లు యివ్వనూ? అన్నాడు. వజ్రోత్సవాల్లోనో ఏమో రాచర్ల లక్ష్మీనారాయణకు భారీగా యిచ్చాడట. జిల్లెళ్ళమూడిలో నిత్యము జరిగేది అన్నయాగం కనుక ఎన్నిసార్లు అయినా యివ్వవచ్చునని నచ్చచెప్పటానికి ప్రయత్నించాము. ఆయన గుంటూరులో కలుసుకోమన్నాడు. తీరిగ్గా మాట్లాడు కోవచ్చునని. మేము సరేనన్నాము. మురహరి గట్టిగా చెప్పలేక పోయాడు. ఎందుచేతనో.

మూర్తిగారు వాళ్ళ వియ్యంకుడి గారి కారును రెండురోజులు తీసుకు వచ్చాడు. ఆ కారులోనే రైల్వేస్టేషన్‌కు వచ్చాను. వెంట మూర్తిగారు, శ్రీరామమూర్తి గారు వచ్చారు. బాపట్లలో అమ్మాయిగారింట్లో భోజనం చేసి పడుకుని సాయంకాలం జిల్లెళ్ళమూడి చేరాను. పైకం రూ.2274/-లు రామచంద్ర మూర్తిగారికి అందచేశాను. కాలేజీ, పాఠశాల కాగితాలపై సంతకాలు చేశాను.

జిల్లెళ్ళమూడి 17-7-1987

మళ్ళీ విరోచనాలు మొదలయినాయి. ప్రయాణం మానేద్దామా అన్నంత ఆలోచన కలిగింది. **మద్రాసు ప్రయాణం అని రామచంద్రమూర్తిగారితో చెప్పగానే ఆయనలో నిస్పృహ కనిపించింది.** నాకు కూడా బాధగా ఉన్నది. కాలేజీ బాధ్యత నాది అన్న తర్వాత వాళ్ళు కొంచెం ధైర్యంగా ఉన్నారు. మరి నా యీ ప్రయాణం ఎన్నాళ్ళు పడుతుందో? ఈలోగా ఏంచేయాలి ? అన్నది గడ్డు సమస్యకదా ?అట్లాగని ఆగుదామా.అంటే వీలులేదు. **హే అమ్మా ! ఎంత పరీక్ష పెట్టావమ్మా!**

బియ్యం ఏర్పాటు చేసిపోతే, బాగుంటుంది ? అనిపించింది. ఊళ్ళో విచారిస్తే చిమట రామయ్య వద్ద ఉన్నాయని తెలిసింది. రామయ్యను పిలిపించి అడిగాను. 50 బస్తాలు ఉన్నయ్యన్నాడు. యివ్వటానికి ఒప్పుకున్నాడు. బస్తా రూ. 145/-. అడ్వాన్స్ రూ. 2,000/- లు కావలన్నాడు. రామచంద్రమూర్తి గారిని యివ్వమన్నాను ఒకసమస్య కొంత వరకయినా పరిష్కారం అయింది. గుండె బరువు కొంత తగ్గింది. **అమ్మే రామయ్య రూపంలో ఈ సహాయం చేసిందన్నది నా ప్రగాఢ విశ్వాసం.**

70 అడ్రస్‌లకు క్రొత్త ఆప్పీల్స్ పంపాము నేను శ్రీమన్నారాయణ మూర్తి కలిసి. అతనితోపాటు నేనూ కంటిన్యూస్‌గా 5గం॥లు పనిచేయ గలిగాను. అమ్మ దయ.

ఈ దయ వల్లనే యీ కార్యక్రమం ఎంత క్లిష్టమయినదయినా నిర్వహించ గలననే విశ్వాసం సడలడంలేదు. మరి అమ్మ నిర్ణయం ఎట్లా ఉన్నాదో.

ఎస్.వి.జె.పి. ప్రెసిడెంట్‌ను అడ్రసు చేసి ఒక లెటర్ వ్రాశాను. ఆగష్టు 15 దాకా ఇచ్చిన గడువు మాట ఏమిటనీ, ఎస్.వి.జె.పికి అన్నపూర్ణాలయం పేర వచ్చిన విరాళాలలో ఎమ్.వి.పి.కి కూడా సగ భాగం యివ్వవలెననీ అడిగాను. 5 గం॥లకు వ్యాన్‌లో బాపట్ల వచ్చాను. డాక్టర్ సత్యం కలిశాడు. రాత్రి స్టేషన్‌కు కూడా వచ్చాడు.

పద్మావతి మద్రాసు వస్తానన్నది. జిల్లెళ్ళమూడిలోనే అమ్మకూ, హైమకూ ప్రదక్షిణలు చేయమని సలహా యిచ్చాను. సరేనన్నది. రాత్రి సర్కార్ గంట లేటు. గం॥ 11.40ని॥కి వచ్చింది. బండి ఎక్కగానే నిద్రపోయాను.



మద్రాసు **18-7-1987**

గం॥6.15 ని॥లకి మద్రాసు చేరాను. ఆటోలో ఆళ్వారుపేట వచ్చాను. (రూ. 11/-) అచ్యుత్ చాలాసేపు మాట్లాడాడు. మద్రాసులో నీళ్ళకరువు. జ్యోతి నన్ను చూస్తూనే 'వర్షం' తెప్పించు అన్నది. నేను వచ్చిన '5' ని॥లోనే వాటర్ ట్యాంక్ వచ్చి వాళ్ళ వాటర్ ట్యాంక్ నింపింది. వర్షం తెప్పించ లేకపోయినా నీరు తెప్పించావని జ్యోతి సంతోషించింది.

24-6-1988

ప్రియమైన సుబ్బారావు.

ఆ రోజున అమ్మ దయవల్ల కులాసాగా చేరారనుకుంటాను ఆరోజున నేను నీతో తీరిగ్గా మాట్లాడ లేకపోయాను. నీతో చెప్పవలసిన విషయం ఒక్కటి ఉంది.

మన పొలంలో కొంత భాగం 5 ఎకరాలు అమ్మి వేశాను. ఎకర రూ. 33000/- చొప్పున. ఇవ్వాళనే రిజిష్ట్రేషన్. నీవు రాలేవు. నీవు రాకుండానే రిజిష్ట్రేషన్ ఏర్పాటు చేశాను. మీ బాబాయి వస్తాడు. సుధ, ప్రేమ, రవి యిక్కడనే ఉన్నారు. వాళ్ళందరూ సంతకాలు చేస్తారు.

అంతా ఖర్చే. నెలకి రూ. 3,000/- నుంచి 5,000/-లు అవుతున్నాయి. రవి, ప్రేమ చదువులు పరీక్షలకు గానీ, వాళ్ళ ప్రయాణాలకు గానీ, శామల (చిన్న) తిరుపతి చదువుకు, సుధ మద్రాసు నివాసానికీ మీ అమ్మకు నాకు మందులకు, ఇవ్వన్నీగాక, బారసాలలు, సీమంతాలు. ఎన్నో ఏప్పటికప్పుడు ఏదీ తప్పించుకోలేని ఖర్చు. ఇక చివరగా మద్రాసులో నా ఆపరేషన్. రవి పెండ్లి అన్నీ కలిసి దాదాపు రూ. 1,50,000/-లు దాకా అప్పులు ఉన్నాయి. అన్నీ తీర్చేసి హాయిగా బాకీల్లేవు అనిపించుకుందామని. అయితే ఇక మనకు మిగిలింది 4 ఎకరాలు మాత్రమే. అందుకు 2 ఎకరాల పంట తిండిగింజలకు సరిపోతుంది. పోతే మిగిలిన రెండు ఎకరాలు పంట యిప్పటి ఖర్చుల ప్రకారమయితేఒక నెల గ్రాసానికి సరిపోదు.

కనీసం సుధ, ప్రేమ సెటిల్ అయితే పరిస్థితులు అన్నీ సర్దు-కుంటాయి........

ఇవన్నీ మనస్సులో ఉంచుకునే మొన్న నీవు వచ్చినప్పుడు నీకు చెప్పాను. నీ జీతంలో ఎట్లాగయినా కొంత మిగుల్చుకొని ఎఫ్.డి. చేసుకో.

పిల్లల భవిష్యత్తు కోసం. నేను నీకు ఏమీ యివ్వలేక పోవచ్చు గదా. ఎవరికీ ఏమీ యివ్వలేక పోవచ్చు. నాకూ చాలా బాధకరంగానే ఉంది. వేదాంత సిద్ధాంతంలో అంతా అమ్మలీల అనుకుంటూ ఊరట పొందుతున్నాను.

నీవు యిక్కడ కుటుంబం గురించి దిగులుపడవలసిన అవసరం ఏమీ లేదు. అంతా సవ్యంగానే జరిగిపోతుంది. నేను ఎవరికోసం కుటుంబం గురించి ఆలోచించకుండా అహోరాత్రులు శ్రమించానో, ఆ అమ్మే అన్నీ చూసుకుంటుంది. అది అమ్మ వాగ్దానం. ఆ నమ్మికే నాకు బలం. మీరు కూడా ఆ నమ్మకంతోనే ఉండండి. ఈ సారి కలిసినపుడు వివరంగా మాట్లాడుకుందాము.

ప్రేమతో రామకృష్ణ.





జిల్లెళ్ళమూడి 18.01.1991

ప్రియతమ సోదరులు శ్రీరామ చంద్రమూర్తికి....నమస్తే

రాత్రి జరిగిన దురదృష్టకరమైన ఒక సంఘటనను మీ దృష్టికి తీసుకురావలసి వస్తున్నందుకు విచారిస్తున్నాను.

రాత్రి 10 గంటలకు గాలిని వెతుక్కుంటూ షెడ్డులో తిరుగుతున్నాను. శ్రీ ప్రకాశరావు (Excook S.V.J.P.) ఒక విద్యార్థి తాను పడుకున్నమంచాన్ని కాలితో తన్నినట్లు నాకు ఫిర్యాదు చేశాడు.

"ఎవరు" అని అడిగాను

అవంక చూపించాడు.

నేను అక్కడకి వెళ్ళి అతణ్ణి అడిగాను మంచాన్ని ఎందుకు తన్నా-వని ?

తన్నలేదన్నాడు.

మరి ఏంచేశావన్నాను ?

చేత్తో తట్టానన్నాడు.

ఎందుకు ?

ఆయన షెడ్డు మధ్యలో ఫాను క్రిందపడుకున్నాడు.

అయితే ?

సరిగ్గా సమాధానం చెప్పక సణుగుతున్నాడు.

అందుకు బాధ్యులెవరు ?

విద్యార్థుల మనస్తత్వంలో లోపమా ?

మనశిక్షణలో లోపమా ?

ఈ ఆవరణంలో ఆదరణాలయాన్ని పెట్టి విద్యార్థులకు వృద్ధులకు ఒక సేతువు నిర్మాణం చేయాలనీ, విద్యార్థులలో సేవాభావాన్ని ప్రోత్సాహించాలనీ ఎన్నెన్నో కలలుగన్నాను.

ఒక ఆధ్యాత్మిక కేంద్రంలో విద్యాభ్యాసం చేసే విద్యార్థులు అన్ని విధాలా

ఆదర్శంగా రూపొందుతారని ఆశించాను.

వాళ్ళ గురించి ఎంతో గర్వంగా చెప్పకుంటూ ఊరూర చాటుతూ. వాళ్ళకోసం ఎంతగానో కష్టిస్తున్నాము.

కాని పరిస్థితులు దీనికి విరుద్ధంగా వెళ్తున్నాయా ?

ఆలోచించండి. తగు కార్యాచరణ చేపట్టండి.

ప్రేమతో
అమ్మసేవలో ....
కొండముది రామకృష్ణ





## 10-1-1992

1962 నవంబరు 11వ తేదీ. కార్తిక పూర్ణిమ. నా జీవితాన్ని మలుపు తిప్పిన శుభ దినం. నన్ను అమ్మ ఒళ్ళోకి చేర్చిన సుముహూర్తం.

అంతకు పూర్వం 1956 లోనే అమ్మను దర్శించాను కానీ నాపై అమ్మ ప్రభావం అంత బలంగా లేదు.

ఆనాటి రాత్రి...

అమ్మ పున్నమి చంద్రుడై నా హృదయాకాశంలో ఉదయించింది. నాడు అలౌకికమైన అనుభూతిని ప్రసాదించింది. అమ్మ అవతారామూర్తి అన్న అవగాహనను నాకు కలిగించింది. ఆ క్షణంలోనే నన్ను నేను అమ్మకు సమర్పించుకున్నాను.

అనుభవం వల్ల విశ్వాసమా ?
విశ్వాసంవల్ల అనుభవం కలుగుతుందా ?

అన్నది వివాదాస్పద విషయమే అయినప్పటికీ నా జీవితంలో అనుభవం ద్వారానే విశ్వాసం ఏర్పడ్డది.

మానవుడి సాధనకు ఫలితం దైవ కరుణా :
దైవ కరుణకు ఫలితం - మానవుడి సాధనా :

అన్న విషయం కూడా సామాన్యంగా సందేహాస్పదమే అయినా.... నా జీవితంలో....

"దైవానుగ్రహం ఉంటేనే ఏ సాధన అయినా" అన్న అమ్మ వాక్యం రుజువయింది.

ఆనాటి నుండి - నన్ను కన్నవాళ్ళ కంటే
నేను కన్న వాళ్ళ కంటే - కట్టుకున్న భార్య కంటే
బంధువుల కంటే - స్నేహితుల కంటే
పంచప్రాణాల కంటే -సంపదల కంటే
భోగాల కంటే - సర్వస్వం కంటే

అమ్మ నాకు ప్రేమ పాత్రమైంది.

నిత్య సంసేవ్య అయింది. - నిత్యారాధ్య అయింది.

నా జీవిత మంతా అణువణువునా అక్రమించుకుంది.

క్రమంగా అమ్మకి లౌకిక బాధ్యతల్లో నాకు భాగస్వామ్యాన్ని ప్రసాదించింది. అమ్మ నీడలో ఏర్పడుతున్న బహుముఖ సంస్థలు నిర్మాణంలో, నిర్వహణంలో నన్ను బంధించింది.

జిల్లెళ్ళమూడిలో 1970లో ప్రధానమైన సంస్థలు రెండు ఏర్పడ్డాయి. ఒకటి శ్రీ విశ్వజననీ పరిషత్, రెండవది మాతృశ్రీ విద్యా పరిషత్. శ్రీ విశ్వ జననీ పరిషత్‌కు బహుకాలం అమ్మే అధ్యక్షురాలు. అప్పుడు నేను కొంత కాలం కోశాధికారినీ, చాలా కాలం కార్యదర్శినీ. అమ్మ అధ్యక్ష పదవిని వదిలేసిన తర్వాత, అవతార పరిసమాప్తి చేసే వరకు నన్ను అధ్యక్షుడిని చేసి కార్యక్రమాలు జరిపించింది.

మాతృశ్రీ విద్యాపరిషత్‌కు కొంతకాలం అధ్యక్షుడినీ, ఆ తర్వాత యిప్పటి వరకు కార్యదర్శినీ. సంస్థల నిర్మాణంలో నిర్వహణలో ప్రధాన బాధ్యతలు అప్పగించి "అవసరమైతే గడ్డిపోచద్వారా నా పనులు చేసుకుంటాను" అన్న అమ్మ తనప్రతిజ్ఞా వాక్యాన్ని రుజువు చేసుకుంది. కాకపోతే 1973 ఏప్రిల్ 12న జరిగిన అమ్మ స్వర్ణోత్సవ సందర్భంగా లక్షమందికి ఒకే పంక్తిన భోజనాలు పెట్టిన చారిత్రాత్మక అపూర్వ సంఘటనలో నేను 'విజయుణ్ణి' కావటం ఏమిటి ? అసామాన్యమూ, అసాధ్యమూ అయిన ఒక కార్యక్రమాన్ని ఒక సామాన్య వ్యక్తి ద్వారా సులభ సాధ్యం చేసి తన సర్వసామర్థ్య పతాకాన్ని గగనతలంలో ఎగరేసి పతాకకు నన్ను జెండా కఱ్ఱగా చేసిన అమ్మ అంతర్యం అగ్రాహ్యమే.

"నా జీవితం అబద్ధం చరిత్ర బద్ధం" అని ప్రకటించిన అమ్మ చరిత్రను అమ్మను గురించి లోకానికి వెల్లడి చేసే పవిత్ర ధ్యేయంతో "మాతృశ్రీ" తన

జీవితం గ్రంథస్థం చేసే అవకాశాన్ని నాకు అనుగ్రహించింది. మాస పత్రికను స్థాపించగా సంపాదకత్వ బాధ్యతను అమ్మ నాకు అప్పగించడంతో అమ్మకు మరింత చేరువయ్యాను.

నిత్యం అమ్మకు జరిగే అర్చనాదుల్లో నన్ను పూజారిగా అమ్మ ఎంచుకున్నందున అహర్నిశం అమ్మ సమక్ష భాగ్యం నాకు సంప్రాప్తమైంది.

ఒక సందర్భంలో అమ్మ అన్నది నవ్వుతూ

"వీడు (రామకృష్ణ) అర్చక స్థానంలో ఉంటే ఇది శివపూజ లేకపోతే శవపూజ" అని. ఆ మాటలు విని నొచ్చుకున్న వాళ్ళకు వివరించింది " వాడు అర్చకుడుగా ఆస్థానంలో ఉంటే నేను నిశ్చింతగా యీ కుర్చీలో కూర్చుంటాను. ఆ స్థానంలో మరెవరైనా ఉంటే యీ కుర్చీలో ఉండేది నా శరీరం మాత్రమే. నేను వెళ్ళి అర్చకుడిలో కూర్చుంటాను. రామక్రిష్ణ కైతే అన్నీ తెలుసు ఎప్పుడు ఏమి చేయాలో, ఏది ఎట్లాచేయాలో. వాడైతే నాకు హాయిగా ఉంటుంది. అని నిర్ద్వంద్వంగా నిర్వచించిన అమ్మ హృదయంలో నుండి వెలువడ్డ ఆ పలుకులు నాకు అమృతాశీస్సులు.

అమ్మ నా చేతుల్లో శరీర పరిత్యాగం చేసిన సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడెల్లా నాకు మరణంగండం ఉందని తెలుసుకున్న నా కన్నతల్లి 1964 జనవరి 10వ తేదీన జిల్లెళ్ళమూడి వచ్చి అందరమ్మ చేతుల్లో నా చెయ్యి ఉంచి "ఇక నుండి వాడు నా కొడుకు కాదు నీ బిడ్డేనమ్మ. బ్రతికించుకున్నా, చంపుకున్నా నీ యిష్టమే" అని నన్ను అమ్మకు దత్తత యిచ్చిన అద్భుతమైన సంఘటన స్మృతిలో మెదిలి. అమ్మ నన్ను ఎంత చమత్కారంగా తన ఒళ్ళోకి తీసుకుందీ. అని ఆనందాతిశయం కలుగుతుంది.

" నేను అమ్మను మీరు బిడ్డలు " అన్న అమ్మ " మీరు బిడ్డలే కాదు నా అవయవాలు కూడా " అని ప్రకటించింది.

ఆ మధురోక్తి అందరి విషయంలో ఏమో కానీ నాకు మాత్రం ఆ అదృష్టాన్ని ప్రత్యక్షికరించింది.

అమ్మ - నన్ను కన్నుగా, చెవిగా, కాలుగా, చెయ్యిగా వాక్కుగా ఉపయోగించుకుంది.

అందుకనే అమ్మ అనేక పర్యాయాలు "వాడు అప్పికట్లకు కరణం

నాకు ఉపకరణం " అని ప్రేమతో ప్రవచించింది.

అమ్మ నిరంతర సాన్నిహిత్యం వల్ల పూర్ణమైన అమ్మ ప్రేమనూ, కరుణనూ పొందడమే కాక.

అమ్మ సర్వజ్ఞత్వానికీ -

అమ్మ సర్వశక్తిమత్వానికీ

అమ్మ సన్నిధిలో జరిగే సర్వమహిమలకూ

అమ్మ వేయిరేకులుగా వెల్లివిరిసిన సర్వ త్రానురాగానికి

అమ్మ సమదృష్టికి

అమ్మ అద్వైత సిద్ధికీ

అమ్మ సందేశాలకూ

ప్రత్యక్ష సాక్షినీ నిత్య శ్రోతనూ కాగల మహావకాశం నాకు కలిగింది.

సర్వ దేవతలనూ

సర్వ తీర్థాలనూ

సర్వ లోకాన్నీ-అమ్మలోనే అవలోకించీ పులకించి పోయాను.

1985 జూన్ 12న తేదీ...

ప్రపంచానికే దుర్దినం.

ప్రత్యేకించి నాకు అమావాస్య

మనం ప్రేమించే, సేవించే పూజించే అమ్మ భౌతిక రూపం కనుమరుగయింది.

నా శరీరానికి నిశ్చేష్టత

నా బుద్ధికి నిస్తేజం

నా మనస్సుకు నిస్తబ్దత కలిగాయి.

ఒక గది నుండి మరొక గదికి నేను లేకుండా వెళ్ళడానికి యిష్టపడని అమ్మ - నన్ను వదిలేసి ఒంటరిగా వెళ్ళింది.

నాలో వెలుగు మాయమై చీకటి ఆవరించింది.

కన్నీటి వాగై నేను మిగిలిపోయాను.

అదృశ్యమైన అమ్మ కాలరూపమై నన్ను ఓదార్చి నా కన్నీటిని తుడిచింది. కొత్త బాధ్యతలను అప్పగించింది. మళ్ళీ శరీరంలో మనస్సులో కదలిక మొదలైంది. జీవించడం తప్పనిసరి అయింది. విశ్వాసమూ, అనుభూతులూ ఒక దిక్కునా ప్రత్యక్ష అనుభవానికై మనస్సులో తీవ్ర కాంక్ష మరొక దిక్కునా

ఈ సంఘర్షణలో మనస్సు దందహ్యమానమైంది. ఇంతవరకు.

అమ్మలో సర్వ సృష్టినీ దర్శిస్తూ మురిసిపోయిన నేను ఇప్పుడు-సర్వసృష్టిలో అమ్మను దర్శించేందుకు ప్రయత్నం ప్రారంభించాను.

ఆ భావన నా సాధనగా ఎంచుకున్నాను.

మూర్తామూర్తాల్లో చరాచరాల్లో క్షరాక్షరాల్లో అమ్మ స్ఫూర్తిని పొందడమే కాక అమ్మ దివ్య మంగళ మంజుల మూర్తిని దర్శించడానికి నిరంతరం యత్నం చేస్తున్నాను. అదే నిత్యయజ్ఞంగా సంభావిస్తున్నాను.

సశరీరగా చూసినప్పుడు అమ్మను 'సగుణమూర్తి'గా విదేహ అయినప్పుడు 'నిర్గుణ'గా తలపోస్తూ రెండు కోణాల నుండీ అమ్మను చూడడమే అమ్మను గురించిన అవగాహనకు సమగ్రతగా భావించాను.

"ఎక్కడైనా ఆధ్యాత్మిక గగన తలంలో నెలవంకలనే చూడగలం కానీ, జిల్లెళ్ళమూడిలో మాత్రమే పూర్ణచంద్రుణ్ణి చూడగలం" అన్న డాక్టర్ శ్రీపాద వారి ప్రవచనం ప్రత్యక్షర సత్యం.

"నేను నేనైన నేను'

అని పలికిన అమ్మ యీ సృష్టిలో ఏది ఔను : ఏది కాదు ?

అన్ని భావాలు

అన్ని క్రియలు

అన్ని రూపాలు

అన్ని నామాలు,

అన్ని శబ్దాలు

అన్ని అర్థాలు... సర్వం అమ్మే కదా

ఆ పవిత్ర భావం కలగడానికి, ఆరూఢం కావడానికీ అనుగ్రహమే ఆధారం.

" మీరు చూస్తే నేను కనపడను.

నేను కనబడితే మీరు చూస్తారు" అన్నది అమ్మ

జీవిత గమనంలో నేను వేసే ప్రతి అడుగూ అమ్మ ప్రేరణ ఫలితమే నని నేను నమ్ముతున్నాను.





16-01-1992

1972 లో నాకు సంక్రమించిన మధుమేహ వ్యాధి 1985లో అమ్మ శరీర పరిత్యాగం చేసే వరకు మంత్రసిద్ధుని సమక్షంలో అణిగి మణిగి ఉండే తాచుపాములా తలవాల్చి వుంది. కనుమరుగు కాగానే తాచుపాము తలయెత్తింది. బుస కొట్టింది, కాటు వేసింది.

ఫలితంగా 1987 సెప్టెంబరు 22వ తేదీన నా రెండు కళ్ళు దృష్టిని కోల్పోయాయి. లోకం అంధకార బంధురమయింది. లోపల యేదో వెలుపల అదే నని అమ్మ దర్శనమూ ప్రబోధమూ. మరి నేను ఇంతకాలం చర్మ చక్షువులతో వెలుపలి ప్రపంచాన్ని మాత్రమే చూశాను. ఇక లోపలి లోకాన్ని చూస్తే కదా లోపల వెలుపల ఒకటే నన్న సత్యం నాకు బోధపడేది. అందుకు అమ్మ నాకు బాహ్య ప్రపంచాన్ని శూన్యం చేసిందేమో అనుకున్నాను. ఆంతర జగత్తును అవలోకించటానికి ఇదే అదను, అవకాశం కాబోలు అన్న భావన నన్ను నిశ్చింతుణ్ణి, నిర్లిప్తుణ్ణి చేసింది. ఫలితంగా చికిత్స యెడల ఉపేక్ష వహించాను.

కాని, బంధుమిత్రులు ఊరుకుంటారా ? తమ్ముళ్ళు, కొండముది హనుమంతరావు, టి.టి. అప్పారావు, కస్తూరి వెంకట రమణమూర్తి, డా॥ కోన సత్యనారాయణ మూర్తి ప్రభృతులు నన్ను బలవంతంగా మద్రాసు తీసుకువెళ్లి శంకర నేత్రాలయంలో చికిత్స చేయించారు.

నిన్ను నమ్ముకున్నందుకు మంచి ఫలితం ఇచ్చావమ్మా అని బంధువులు అమ్మను విమర్శించారు.

పూజలకు సేవలకు ప్రతిఫలం యిదా ? అని మిత్రులు ప్రశ్నించారు.

అమ్మ యేమనుకున్నదో నవంబరు 21వ తేదీన ఒక కంటిని నాకు ప్రసాదించింది. అప్పుడు కూడా బంధుమిత్రులు అమ్మ నీ కన్ను పోగొట్టింది కదా! అని అవహేళన చేశారు. ఒక కన్ను ఇచ్చింది కదా అని నేను సంతృప్తిని

ప్రకటించాను. రెండు వాదాలూ యదార్థమే. కాకపోతే దృష్టి భేదమే.

కాని అప్పుడు నేను జ్ఞాపకం చేసుకున్నాను సమధురమూ చరిత్రాత్మకమూ అయిన ఒక సంభాషణనూ సంఘటననూ.

ఒక నాడు ప్రశాంత సుందర సాయంవేళ అమ్మ మేడ పైన నడుస్తున్నది. సూర్యుని అరుణకాంతులు అమ్మ బొట్టులో సంగమిస్తున్నాయి. ప్రకృతిలోని వెలుగులు అమ్మ కళ్ళలోకి పరుగులు పెడుతున్నాయి. అమ్మ వదన మండలం సుప్రసన్నమై ఆహ్లాదకరమై భాసిస్తూ ఉదయించబోయే చంద్రబింబాన్ని తలపిస్తూ ఉంది. ఆ మూహూర్తాలలో నవ్వుతూ అమ్మను అడిగాను... అమ్మా ఏ కాలంలో యేమున్నా లేకపోయినా కన్నూ పెన్నూ మాత్రం నాకు మిగల్చమ్మా అని.

అమ్మ దరహసిత వదనంతో నన్ను చూస్తూ కళ్ళనుండి వెన్నెలలు కురిపిస్తూ 'సరే' నంది. అమ్మ యెంత కరుణామయి : ఒకసారి అమ్మ ఒక వింత ప్రకటన చేసింది.

మనం అమ్మను అడిగితే అడిగిందే యిస్తుందట! అడక్కపోతే మనకు కావలసింది యిస్తుందట ! మరి. అమ్మను అడిగాను కదా ! పెన్నుతోపాటు కన్నును. కళ్ళు అనే బహువచనం ఉండగా నేను కన్ను ను మాత్రమే అడిగాను.

కరుణాంతరంగ అయిన అమ్మ బిడ్డ కోరిక తీర్చింది. ఇందులో తల్లి తప్పేముంది?.

అమ్మ పలికిన "మీ యిష్ట ప్రకారం నడుస్తున్నట్లు కనిపిస్తాను. కాని నా యిష్ట ప్రకరామే మిమ్మల్ని నడిపిస్తానూ" అన్న వాక్యం ఆంతర్యం యేమిటి?

అమ్మ యింకో వాక్యం 'మీరు ఏమనుకున్నా, ఏమన్నా, ఏం చేసినా నేను అనుకుంటేనే' అని. ఈ విచికిత్స ఎలా ఉన్నా నన్ను అనుగ్రహించ దలచే యీ సంభాషణను, ఈ సంఘటనను, అమ్మ విరచించింది అని నా విశ్వాసం.

అమ్మ యేచర్య వెనుక యే ప్రణాళిక ఉన్నదో ఎవరు విశ్లేషించగలరు: కన్ను బదులు పాటల రచన అనే శిల్పం ప్రసాదించింది. పాటలకు శ్రుతి లయ బద్ధం చేయగలవాడు శ్రీ ఏకారాజేశ్వర రావు. విద్యా పరిషత్ నిర్వహణలో అతడితో గల పరిచయం స్నేహమై చిరకాలంలోనే అది సాంద్రమైంది. పాటలను అతడికి చూపించాను. గేయ నియమాలకు అవి నిలబడతాయా అని అడిగాను. వాటిని చదువుతూనే అతడు మురిసిపోయాడు. రాగతాళాలనే రెక్కలు తొడిగి ఆకాశం లోకి ఎగరేసాడు.

ఒక్క సంవత్సరము లోపలే పుంఖానుపుంఖాలుగా పాటలు వెలువడ్డాయి. ఒక్కోరోజున 8,9 పాటలు రాసిన సందర్భాలు కూడా ఉన్నాయి. రాసేది అమ్మ అయి, నా ద్వారా క్రియ జరిగేటప్పుడు అసాధ్యమేమున్నది.

ఇంకో సంఘటనను ఇక్కడ జ్ఞాపకం చేసుకోవడం అవసరం అని భావిస్తాను.

1968లో మాతృ శ్రీ మాస పత్రికకు సంపాదకీయం రాయవలసిన ప్రతి సందర్భంలో 'ఏమి రాయమంటావమ్మా' అని అడిగే వాడిని. 'నీ యిష్టం నాన్నా' అనేది అమ్మ. ఆ సమాధానం నాకు తృప్తి నిచ్చేది కాదు. అయినా ప్రతి నెలా అమ్మను అదే సలహా అడిగేవాడిని. అమ్మకు విసుగేసిందేమో ఒకనాడు అన్నది . 'నాన్నా! ఇక నీవు ప్రతిసారి నన్ను అడిగే అవసరం లేదు. కాగితాలు, కలం తీసుకుని రచన ప్రారంభించు. అదే సాగిపోతుంది. నీ కలాన్ని నేనే నడుపుతాను' అని.

ఎంత తీయని హామీ :

అమ్మది తోలు నోరు కాదు కదా తాలు మాట రాదు. ఆ దివ్య క్షణం నుండి నిరాఘాటంగా కలం సాగిపోతున్నది.

ఇక అమ్మ యిచ్ఛకు జయము : జయము : జయము:



## 4-1-1993

తెల్లవారు ఝామున 5.00 గం॥లకు వాత్సల్యాలయంలో ఉత్తర ద్వార దర్శనం. ఖాళీ స్థలంలో షామియానాలు వేయించాను. నేనే తెర తొలగించాను. శ్రీ ఎస్.ఎల్. కుమర శర్మగారు, సోయజులుగారు, శర్మగారు కలసి పురుష సూక్తం చదివారు. పద్మావతి "పుణ్యమహెూ పుణ్యం" పాడింది. సంకీర్తన చేసింది. విద్యార్థులు విష్ణు సహస్రనామాలు రెండు సార్లు పారాయణం చేశారు. సూరంపల్లి నుండి శ్రీమన్నారాయణ వచ్చాడు. చాలా సంతోషించాడు.

జయంతి చక్రవర్తి అలంకరణ. అమ్మ నిలువెత్తు కటౌట్ తో ఉత్సవం. దండలతో అమ్మ అద్భుతంగా ఉంది. నేనే అర్చకత్వం నిర్వహించాను. 1986 వ సం॥లో తర్వాత ఇది మళ్ళీ ఆ స్థానంలో కూర్చోవడం విచిత్రానుభవాన్ని యిచ్చింది. అక్కడనే సుగుణ రామచంద్ర-అనసూయా వ్రతం. వసుంధర వ్రతం నిర్వహించింది. మంత్రాలు చెప్పింది. పూజచేయించింది. నేను కథలు చదివాను. వాళ్ళ పాపాయికి అన్నప్రాశన చేశాను. కటిక హనుమయ్య దంపతులు టాక్సీలో వచ్చి అమ్మ దర్శనం చేసుకున్నారు.

## 7-1-1993

రాత్రికి ఆరుద్రోత్సవానికి కావల్సిన ఏర్పాట్లు చేశాను. కాలేజి లెక్చరర్స్, కుమార శర్మ, మధుసుధన్ శర్మ, కేదార్ అభిషేకంలో పాల్గొనటానికి అంగీకరించారు. హైమాలయ అనసూయేశ్వరాలయ అర్చకులు పాల్గొంటారు. సోమయాజులు గారి తమ్ముడు కేశవ సోమయాజులు గారిని కూడా తెనాలి నుండి పిలిపించాము.

మిగతా నలుగురిని బాపట్ల నుండి సూరావధాని ఏర్పాటు చేశాడు. లక్ష బిల్వాలు హనుమబాబు విద్యార్థుల సహకారంతో సేకరించాడు.

కొబ్బరికాయలు - 125<br>
పంచామృతాలు : ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి, పంచదార, తేనె<br>
పండ్ల రసాలు : కమలాలు, నారింజ, ఆపిల్, నిమ్మ, దానిమ్మ, టమాటో, అరటి, కొబ్బరి అవసరమైన ఏర్పాట్లు అన్ని చేశాము.

శివరామ శర్మ, భానుమూర్తి, పాల్గొన లేదు. తెల్లవారు ఝామున 2 గంటలకు సరిగ్గా అభిషేకం ప్రారంభం అయింది. బూదరాజు శేషగిరిరావు, హేమలత ఆలయంలో అభిషేకం చేసుకున్నారు.

బయట పద్మావతి, వరలక్ష్మి, ఝాన్సీ, శ్రీరామ మూర్తి, సత్యనారాయణ మూర్తి ప్రభృతాలు చేసుకున్నారు. సూరంపల్లి నుండి శ్రీమన్నారాయణ వచ్చి అభిషేకంలో పాల్గొన్నాడు. శ్రీమన్నారాయణ చాలా శ్రద్ధగల కుర్రవాడు. అతనికి అమ్మ మంచి అనుభావాలు ఇస్తున్నది. అతనికి రోజు రోజుకి అమ్మ పై భక్తి పెరుగుతున్నది. విద్యార్థులు 32 మంది శివ సహస్రం, లక్ష్మీ సహస్రం చేశారు. అభిషేకం అద్భుతంగా, ఆనందంగా, ఉత్తేజకరంగా జరిగింది. కుమారశర్మ, సోమయాజులు, మరో యిద్దరు బాపట్ల కుర్రాళ్ళు చాలా బాగా చదివారు.

ఇక నుండి ప్రతి సంవత్సరము యీ ఉత్సవాన్ని శేషు దంపతులు చేసుకుంటామన్నారు. అందుకయ్యే ఖర్చు తామే భరిస్తామన్నారు. ఇకనుండి ఒకొక్క పండగ ఖర్చు, అవకాశాన్ని, ఒకొక్కళ్ళకు ఏర్పాటు చేస్తే బాగుంటుంది.

## 10-1-1993

అప్పికట్లలో పంచాయితీ ఆఫీసు ప్రారంభోత్సవం. దగ్గుబాటి వెంకటేశ్వర రావు (ఎమ్.పి.) గారిచే. సభకు దత్తు అధ్యక్షత. సభలో గోగినేని వెంకటేశ్వర్లు (హెచ్.ఎమ్) కు సన్మానం. డిసెంబరు 31న రిటైరు అయినాడు. నేను కూడా ప్రసంగం చేశాను. జిల్లెళ్ళమూడి నుండి సత్యప్రసాద్, వరలక్ష్మి, ఝాన్సీ వచ్చారు.



రాత్రికి విజయవాడ

## 11-1-1993

6 గం॥లకు లక్ష్మీ నారాయణ ఆర్యవైశ్య కళ్యాణ మండపం వద్దకు వెళ్ళాము వరలక్ష్మీ, ఝాన్సీలతో కలసి- మోపిదేవి కృష్ణస్వామి చాలా బాగా ప్రవచనం చేశారు. "మనసును గమనించడమే సాధన" అన్న అంశంపై స్వామి లేఖల ఆవిష్కరణం-సాయంకాలం ప్రవచనంలో ఇ.కె. గారి గురించి కృష్ణస్వామి మంచి ప్రసంగం చేశారు. 'శ్వాసను గమనించడమే సాధన' అన్న అమ్మ వాక్యానికి వివరణ యిచ్చారు.

హనుమంతు కూడ వచ్చాడు. వాడి కారులో యింటికి తీసుకు వెళ్ళాడు. గ్రంథ ముద్రణ పూర్తి కానందువల్ల నేను ఆవిష్కరించవలసిన గ్రంధావిష్కరణ జరగలేదు. 13వ తేదీ ఉదయానికి పోష్టుపోన్ అయింది. తెనాలి నుండి సత్యనారాయణ మూర్తి, గుంటూరునుండి శ్రీమన్నారాయణ మూర్తి వచ్చారు.

## 13-1-1993

"జాతి పునర్నిర్మాణానికి శంఖారావం" గ్రంథ ఆవిష్కరణ, అధ్యక్షులు ఉండవల్లి సత్యనారాయణ గారు. ఆ గ్రంథంతోపాటు 3 క్యాసెట్లు నేనే ఆవిష్కరించడం జరిగింది. ప్రసంగం చేశాను. అమ్మతో భావసామ్యం ఎక్కువగా మోపిదేవి కృష్ణ స్వామిలో కనిపించినందువల్ల నాకు అతని యెడల ఇష్టం ఏర్పడింది. అని చెప్పాను. శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి గ్రంథ వైశిష్ట్యాన్ని గురించి చక్కని ప్రసంగం చేశాడు. నా గురించి కూడా తన మనసులోని భావాలు వెల్లడించాడు. అందరూ సంతోషించారు.



## 16-1-1993

విజయవాడ నుండి జిల్లెళ్ళమూడి బయలు దేరాను. ఆర్. నాగేశ్వర రావు విజయవాడలో కలిసి జిల్లెళ్ళమూడి దాకా తోడు వచ్చాడు. అతణ్ణి అమ్మే పంపించింది. దారిలో రావినూతల రామచంద్రరావుతో చాలా విషయాలు మాట్లాడాను. సంస్థను నడపడంలో ఉన్న ఆధ్యాత్మిక సాధన గురించి నా భావాలు వివరించాను.

జనవరి 16 వ తేదీ పూజ గురించి చెప్పాను. ఆశ్చర్యంగా, ఆసక్తికరంగా విన్నాడు. ఏదో ఆవేశం పొందినట్లు చెప్పాను. బాపట్లనుండి బ్రెడ్, టీ, కొనుక్కుని వచ్చాను. వసుంధర గదిలో అమ్మకు పూజ చేసుకున్నాను. తెల్లవారు ఝామున 3.00 గంటలయింది. వరుస తప్పకుండా పూజచేసుకోవాలనే ఉద్దేశంతో చాలా ప్రయాసతో ప్రయాణం చేశాను. దీక్షకు అమ్మ సంతోషించి ఉంటుంది. 1964లో మొదలైన పూజ. 30వ పూజ.

## 20-1-1993

అప్పికట్లలో ఉన్నాను. వాటర్ ట్యాంక్ విషయం,

శిస్తు వసూలు విషయం సర్పంచితో చర్చించాను. శిస్తు వసూలు విషయమే అయోమయంగా ఉంది. జిల్లెళ్ళ మూడిలో ఉంటే అప్పికట్లలో వసూలు సాగదు. అప్పికట్లలో ఉంటే జిల్లెళ్ళమూడి విషయాలు పర్యవేక్షించలేను. జిల్లెళ్ళమూడిలో నేను లేకుండా జరగని పరిస్థితి కల్పించింది అమ్మ. అంతా అమ్మ విలాసం. నాకు మాత్రం అగమ్య గోచరంగా ఉంది. కర్తవ్యం కాలమే నిర్ణయించాలి.



## 18.02.1993

ఫిబ్రవరి 17వ తేదీన ధాన్యాభిషేకం అత్యంత వైభవోపేతంగా జరిగింది. పాతవాళ్ళతో పాటు కొత్త వాళ్ళు ఎందరో ఉత్సాహంతో పాల్గొనటం విశేషం. విశేష సంఖ్యలో వచ్చిన జనం సౌకర్యంకోసం అభిషేక కార్యక్రమాన్ని అన్నపూర్ణాలయం షెడ్‌లోని వేదికపై ఏర్పాటు చేయటం జరిగింది. అనసూయేశ్వరాలయం నుండి, అమ్మ, నాన్నగార్లను సభక్తికంగా మంగళవాద్యాలతో వేదికపైకి తీసుకు వచ్చారు. వేదికిచుట్టూ అమర్చిన ధాన్యపు బస్తాల వరుసలు, బియ్యపు బస్తాల వరుసలు వచ్చిన జనాన్ని మిక్కిలి ఉత్తేజపరిచాయి. మరి, అమ్మ ఎంత సంతృప్తి చెందిందో... అమ్మకళ్ళల్లో విరిసిన నూతన కాంతులే చెప్పాయి. సరిగ్గా అభిషేక కార్యక్రమం మొదలవుతూండగానే కృష్ణాజిల్లా సూరంపల్లి గ్రామం నుంచి సోదరుడు శ్రీ చక్కా శ్రీమన్నారాయణ గారి ఆధ్వర్యంలో ఒక బస్సునిండా జనం, ఒక ట్రక్కునిండా ధాన్యం బస్తాలు రావటం చూసిన జనంలో ఉత్సాహం మరింతగా ఉరకలు వేసింది. ఆ ధాన్యాభిషేక వేదిక పై నుంచి మాతృశ్రీ అధ్యయన పరిషత్ విశాఖపట్నం అధ్యక్షులు మాస్టర్ ఎ.వి. ప్రసాదరావుగారు మాట్లాడుతూ, " నా అనుమతిలేకుండా జిల్లెళ్ళమూడిలో గడ్డిపోచయినా కదలదు". అన్న అమ్మ వాక్యాన్ని జ్ఞాపకం చేశారు.

మరో విశేషం ఏమిటంటే - విశాఖ సోదరులు మాస్టర్ ఎ.వి.వి. ప్రసాద రావుగారు, శ్రీ ఎ.ఎస్. చక్రవర్తిగారు, ప్రొఫెసర్ కె. కామేశ్వర రావుగారు, శ్రీ ఎ.వి.ఎల్. నరసింహారావుగారు ప్రభృతులు శ్రీ విశ్వజననీ పరిషత్ అధ్యక్షులు శ్రీ రామచంద్రరావుగారితో 'ధ్యానాలయం' గురించి సంప్రదించారు. అమెరికన్ సోదరుడు వెస్టర్లండ్ ఆర్థిక సహాయంతో ఇప్పటికే ధ్యానాలయం నిర్మాణంలో ఉన్నది. అక్కడ సాధకుల సౌకర్యార్థం మరిన్ని చేర్పులుచేసి, త్వరలో ప్రారంభోత్సవం జరిపించటానికి నిర్ణయం తీసుకున్నారు. ఈ సందర్భంలోనే అమ్మ అనుగ్రహాన్ని పొందిన ఒక సోదరుడు - ధ్యానం ద్వారా అమ్మ దర్శనాన్ని మనశ్శాంతిని, శారీరక రోగశాంతిని పొందే విధానంలో తగిన శిక్షణ ఇవ్వటానికి ముందుకు వచ్చారు.

మధ్యాహ్నం భోజన పంక్తులతో ఆవరణ కళకళలాడగా, షడ్రుచుల పరిమళాలతో పరిసరాలు గుబాళించాయి.

సా॥ సభలో ఇటీవల రీడర్లుగా పదోన్నతిని పొందిన డా॥ శ్రిష్టి లక్ష్మీ కుమార శర్మ, డా॥ ఇ.వి. సత్యనారాయణమూర్తి, డా॥ యు. వరలక్ష్మి, డా॥ పి. ఝాన్సీ లక్ష్మీబాయి గార్లకు ఘన సన్మానం జరిగింది. స్థానిక అధ్యాపకులు శ్రీ కె.వి. శివరామ శర్మగారు వేదపఠనం చేయగా, విద్యార్థి చి॥ గోపి ప్రార్థన చేశాడు. ఉభయ పరిషత్తుల అధ్యక్షులు శ్రీ రావినూతల రామచంద్రరావుగారు సభాధ్యక్షులుగా వ్యవహరించారు. తాడికొండ విద్యాసంస్థల అధ్యక్షులు 'సారస్వత చక్రవర్తి' విద్వాన్ శ్రీ గోగినేని కనకయ్య గారు మాతృశ్రీ విద్యా పరిషత్ పక్షానేగాక, స్వయంగా కూడా ఆ అధ్యాపకులను సత్కరించి, అమితానంద భరితులయ్యారు. సన్మానితుల పక్షాన డా॥ కుమారశర్మగారు, డా॥ వరలక్ష్మిగారు ప్రసంగించారు. కొమ్మూరు రత్తయ్యా సదావర్తి ట్రస్టు - పొన్నూరువారు, స్థానిక సంస్కృత విద్వాంసులు శ్రీమాన్ సముద్రాల శేషాచార్యులుగారు విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు అందజేశారు. వార్షిక పోటీల్లో విజేతలైన విద్యార్థినీ విద్యార్థులకు శ్రీ కొత్త నాగమునీంద్ర రావుగారు బహుమతి ప్రదానం చేశారు. సభా ప్రారంభంలో శ్రీ తురుమెళ్ళ గోపాలకృష్ణమూర్తి గారు జ్యోతిని వెలిగించగా, శ్రీ రేటూరు సింహరత్నంగారు అమ్మకు పుష్పమాల సమర్పించారు. నేను ప్రస్తుతం సంస్థ నిర్వహణ తీరుతెన్నులను గురించి, అడుగడుగునా అభివ్యక్త మవుతున్న అమ్మ అనుగ్రహాన్ని గురించి వివరించాను. సన్మాన సభా కార్యక్రమాన్ని స్థానిక చరిత్రోపన్యాసకులు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారు నిర్వహించారు. ఆగష్టు 15వ తేదీన జరిగిన అన్నపూర్ణాలయ వార్షికోత్సవం తరువాత అంత గొప్పగా జరిగిన పండుగ ఇదే.



## 20. 02. 1993

19వ తేదీన మహాశివరాత్రి ఉత్సవం కూడా చాలా ఘనంగా జరిగింది. స్థానిక వేదవిదులు మంత్రపఠనం చేయగా, అనేకులు రుద్రాభిషేకం చేసుకున్నారు. గర్భగుడిలో బూదరాజు శేషు దంపతులు అభిషేకం చేసుకున్నారు. శేషుకు రుద్రాభిషేకంపై మక్కువ ఎక్కువగా కనిపిస్తున్నది.

శరీరం లేకపోయినా తన కార్యక్రమానికి ఏ మాత్రం భంగం వాటిల్లదు అని శరీరం పరిత్యజించే ముందు అమ్మ ప్రకటించిన సంగతి మనకు తెలిసిందే. ఆ ప్రకటనలోని సత్యాన్ని మనకు అందచేయటానికి అనేక తార్కాణాలను అమ్మ మనకు చూపిస్తోంది. అటువంటి రెండు సంఘటనలు ఇటీవల జరిగాయి.

ఇటీవల జిల్లెళ్ళమూడి వాస్తవ్యుడు శ్రీ రెడ్డి సుధాకర్‌కు అమ్మ కలలో కనిపించి, హైమ అలంకార మందిరాన్ని కొత్త తాటాకులతో కప్పించమని చెప్పింది. ఆ ఆదేశాన్ననుసరించి జనవరి 10వ తేదీన రెడ్డి సుధాకర్ కొందరు సహచరులతో ఆ పనిని చేపట్టాడు. అప్పుడుతను “అమ్మ ఉంటే ఇటువంటి సమయంలో ఏమయినా ప్రసాదం పంపేది. కనీసం అరటి పళ్ళయినా పంపేది కదా!” అనుకున్నాడుట. అంతలో ఒక కుక్క ఒక అరటిపళ్ళ గెలను తీసుకువచ్చి వారి ముందుంచింది. తరువాత విచారించగా అక్కడికి సుమారు 200 అడుగుల దూరంలో ఉన్న మేడమ్ సుగుణ గారింటినుండి ఆ గెలను తెచ్చినట్లు తెలిసింది. . అది ఒక పండును కూడా తాకకుండా, గెలను నోట కరచుకుని జాగ్రత్తగా తెచ్చి, వారికి అందించడం చూస్తే అమ్మ అనుగ్రహం అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఉన్నదని ఋజువవటం లేదా !

అంతకంటె విచిత్రమైన మరో ఉదంతం !

ఫిబ్రవరి 6వ తేదీన సాయంత్రంవంట ప్రారంభించవలసి ఉంది. అందుకు 20 కిలోల బియ్యం తక్కువయ్యాయి. వంటవేళ మించిపోతున్నది. మేనేజరుగారిలో అంధోళన హద్దులు దాట్టుతున్నది. అంతలో చీరాలనుంచి

సుశీల అక్కయ్య అమ్మ దర్శనార్థం వచ్చింది. ఆమె వెంట మేనేజరుగారు కూడా వాత్సల్యాలయం చేరి, అమ్మను దర్శించి, ఏంచేయటానికీ తోచటం లేదని అమ్మతో మొర పెట్టుకున్నారు. బరువెక్కిన హృదయంతోనే ఆయన క్రిందికి దిగి ఆఫీసుకు వచ్చారు. ఆ వరండాలో బల్లపై ఒక ముసలాయన కూర్చొని ఉన్నారు. ఆ ప్రక్కనే ఒక మూట ఉన్నది. మేనేజరుగారు ఆయన్ను - ఎవరు నువ్వు - ఏమిటీ మూట - అని వివరాలు అడిగారు. తాను స్థానికుణ్ణే అని, ఆ మూటలో ఉన్నది బియ్యం అని, అది 20 కిలోలు అని ఆ అగంతకుని సమాధానం వినేసరికి మేనేజరుగారికి గుండె ఝుల్లుమన్నది. అప్పుడు కావలసింది సరిగ్గా 20 కిలోలే కదా ! ఒక్క కేజీ తగ్గినా చాలవు. ఒక్కకేజీ ఎక్కువైనా అనవసరం. ఆ ఆశ్చర్యం నుండి తేరుకుంటూ, మేనేజరుగారు మరో ప్రశ్న అడిగారు - 'ఎందుకు తెచ్చావ'ని. లోగడ మూడు నెలల క్రితం తాను ఇబ్బందులో ఉండగా రామకృష్ణ అన్నయ్య అంటే నేను తనకు సంస్థనుంచి అప్పుగా ఇప్పించారని, ఆ అప్పు తీర్చటానికే తాను ఆ బియ్యం తెచ్చానని అతను చెప్పాడు. అప్పును తీర్చడానికి అప్పుడే రావాలా ? ఒక రోజు ముందు రావచ్చు. లేక తరువాత రావచ్చు. - ఈ ఉదంతం చెప్తూ - మేనేజరుగారు అంటారు "ఈ సంఘటన వల్ల అమ్మ ప్పుడూ మన వెన్నంటే ఉన్నది. మన అవసరాలను కనిపెట్టే ఉన్నది - అని మనకు అర్థం అవటమే కాక, ఇక ఈ సంస్థ నిర్వహణలో నాకేమీ భయంలేదు. ఇక అన్నపూర్ణాలయం ఏ పరిస్థితుల్లోనూ ఆగదు" అని.

ఇటువంటి మహిమాన్వితమైన సంఘటనలను నిత్యమూ ఎందరో తమ జీవితానుభవాల నుంచి చెప్తూనే ఉన్నారు. వాటన్నింటినీ ఎవరైనా సేకరించి, ప్రకటిస్తే మంచి గ్రంథమవుతుంది.



ఏప్రియల్ 1వ తేదీనుండి 3వ తేదీ వరకు జరిగిన "అమ్మ" గోమేధిక మహోత్సవం అత్యంత వైభవోపేతంగా, సర్వజన రంజకంగా, సుమనోమరంగా, చరిత్రాత్మకంగా, నేత్ర పర్వంగా, భక్తజన హృదయంగమంగా, అవిస్మరణీయంగా జరిగింది.

ఏప్రియల్ 1వ తేదీ ఉదయానికే ఆవరణమంతా సర్వాంగ సుందరంగా, శోభాయమానంగా అలంకిరించబడ్డది. అన్నపూర్ణాలయం షెడ్డుచుట్టూ తాటాకు పందిరి వేశారు. తాటాకు పందిరి వేసి ఎన్ని సంవత్సరాలైంది. కొత్త తాటాకు సువాసనలతో ప్రాంగణం ఘుమఘుమలాడి పోయింది. ఈ పండగ సందర్భంగా ప్రాంగణంలోని భవనాలన్నిటికీ సున్నం కొట్టడం జరిగింది. అందువల్ల భవనా అన్నీ దవళకాంతులీనుతూ మెరిసిపోయాయి.

ఆలయాల మార్గం, టి.టి.డి. యిచ్చిన స్థలం, పెద్ద భవనం (త్రిపుర సుందరీ భవనం)కు ఉత్తరాన ఉన్న ఖాళీ స్థలం... అంతటా షామియానాలు వేశారు. ఆ దారుల్లో ద్వారాలు ఏర్పరిచారు. నాన్నగారి పేర, మన్నవ సీతాపతిశర్మ (అమ్మనాన్న) గారి పేర, చంద్రమౌళి చిదంబర రావు (అమ్మ చినతాత) గారి పేర, రెడ్డి చిన సుబ్బయ్య (అమ్మను సేవించుకున్న పుణ్యాత్ముడు) గారి పేర, మాదాసు మంత్రాయి (అమ్మదయకు పాత్రుడైన ధన్యజీవి) గారిపేర ద్వారాలు ఏర్పడి యాత్రికుల దృష్టిని ఆకర్షించాయి. ఈ రకమైన ఏర్పాట్లు జిల్లెళ్ళమూడిలో చేయడం యిదే తొలిసారి. స్తంబాలకు కట్టిన మట్టలతో, పందిరినిండా కట్టిన మామిడాకు తోరణాలతో, షెడ్డునిండా కట్టిన రంగురంగుల తోరణాలతో ప్రాంగణం అందాలు వొలుకబోస్తూ, అందరికీ కనువిందు చేసింది.

ఆ రోజు సూర్యోదయం – అమ్మనుదుట వెలిగే కుంకుమబొట్టులాగా దివ్య శోభలను వెదజల్లింది.

క్రితం రాత్రే కారంచేడు హరేరామ జపయజ్ఞాశ్రమ అధిపతులు శ్రీశ్రీశ్రీ ప్రణవానందగిరి వచ్చారు.

1వ తేది ఉదయం 9 గంటలకు శ్రీ ప్రణవానందగిరి అందరింటి సింహద్వారంవద్ద " అమ్మ" పతాకాన్ని అవిష్కరించారు. నేను వ్రాసిన పతాక గీతాన్ని సోదరి డా॥ ఝాన్సీలక్ష్మి గానం చేసింది. ఆశ్రమంలో మొట్టమొదటిసారి "అమ్మపతాక" రూపొందించబడి ఎగురవేయబడింది. ఆ సంఘటన చాలా ప్రాధాన్యాన్ని సంతరించుకుని పలువురి ప్రశంసల నందుకుంది. తర్వాత. కళాశాల విద్యార్థినీ విద్యుర్థులు దుర్గాస్తుతి, సమైక్యగీతం ఆలపించారు, ఆ సభకు పరిషత్ అధ్యక్షులు శ్రీ రావినూతల రామచంద్రరావుగారు అధ్యక్షత వహించారు. డా॥ ఎస్.ఎల్. కుమారశర్మగారు ఆ కార్యక్రమాన్ని నిర్వహించగా, శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి వందన సమర్పణ చేశారు.

శ్రీ ప్రణవానంద ప్రసంగిస్తూ - అమ్మయందు తమకు గల ఆకుంఠిత భక్తి ప్రపత్తులను వెల్లడించడమేకాక - అమ్మసేవ లో తాను పూర్తిగా సహకరించగలనని ఉద్ఘోషించారు.

ఉదయం 10 గంటలకు మూడు యాగాలు ప్రారంభింపబడ్డాయి. మహా మృత్యుంజయ యాగం, సౌరయాగం, విష్ణుయాగం. ప్రస్తుతం పరిషత్‌నే కాక జిల్లెళ్ళమూడి గ్రామాన్నే కుదిపి అల్లకల్లోలం చేస్తున్న అంత: కలహాలు అంతరించి ప్రశాంత వాతావరణం ఏర్పడటానికీ, విశ్వశాంతి కలగడానికి - యీ యాగాలు ఉద్దేశించబడ్డాయి.

ఈ మూడు యాగాల నిర్వహణకు - మాతృశ్రీ విద్యాపరిషత్ సంయుక్త కోశాధికారి శ్రీ కట్టమూరి వెంకటేవ్వరరావు దంపతులు కంకణం కట్టుకుని, పరిషత్ పక్షాన యజ్ఞ యజమానులయ్యారు. యజ్ఞ నిర్వహణకు తెనాలి వాస్తవ్యులు శ్రీ కాశావఝుల భాస్కరావధానులుగారు ఆధ్వర్యం వహించగా, మాతృశ్రీ విద్యా పరిషత్ కోశాధికారి శ్రీ పొదిలి శ్రీరామమూర్తిగారు పర్యవేక్షించారు.

ఈ యాగాలను హైమాలయం ముఖమండపంలో ఏర్పాటుచేసి యాగశాలను, ఆలయ ప్రాంగణాన్ని చూడముచ్చటగా అలంకరించారు. అక్కడ విరిసిన ప్రతి పూవూ - అమ్మ ముఖారవిందమై, వచ్చిన ప్రతి బిడ్డను అప్యాయంగా పలకరిస్తూ వాత్సల్య మధువులను కుమ్మరించింది.

మధ్యాహ్నం 12 గంటలకు అనసూయేశ్వరాలయంలో శ్రీరామ నవమి సందర్భంగా ప్రత్యేక పూజ జరిగింది.

"శ్రీరామో లలితాంబికా" – ఆ లలితా పరాభట్టారికకు మానవ రూపమే మన అమ్మ. ఆ పూజను శ్రీ రావినూతల రామచంద్రరావు దంపతులు చేసుకున్నారు. డా॥ కుమారశర్మ ఆహ్లాదకరంగా జరిపించారు.

ఏప్రిల్ – 2

సాయంత్రం కుర్తాళ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివచిదానంద సరస్వతి స్వామివారు విచ్చేశారు. వారికి పరిషత్ వారు ఘనమైనస్వాగతం పలికారు. పరిషత్ ప్రాంగణ ప్రవేశ ద్వారానికి బయటనే వారికి ఎదురేగి మంగళ వాద్యాలతో, వేదమంత్ర పఠనంతో, పూర్ణకుంభంతో శ్రీరామచంద్రరావు, శ్రీ బూదరాజు శేషగిరిరావు నాయకత్వంలో అందరూ కలిసి హృదయపూర్వకమైన స్వాగతం యిచ్చారు.

ఆ రోజుననే దంపతీ పూజ చేసుకోవడానికి శ్రీ యం.యస్.ఆర్ ఆంజనేయులు దంపతులు, శ్రీ యం.యల్.కాంతారావు దంపతులు, గోపూజ చేసుకోడానికి శ్రీ కొండముది హనుమంతరావు దంపతులు, మానవధర్మ శిక్షణాసంస్థ వ్యవస్థాపకులు మాస్టర్ మోపిదేవి కృష్ణ స్వామి దంపతులు వచ్చి వారికోసం ప్రత్యేకించబడ్డ విడిదుల్లో బసచేశారు.

ఆ సాయంకాలమే కార్యకర్తల సమావేశం జరిగింది. తెల్లవారితే మహోత్సవ మహా సంరంభం, జనసందోహం తరలి రానుంది. వారికి ఎన్నో ఏర్పాట్లు, వివిధ పూజలు, అమ్మ దర్శనం, బ్రహ్మాండమైన సభ, ఎందరో సత్పురుషులకు సత్కారం ... ఇక జిల్లెళ్ళమూడి అంటేనే భోజనాలు – భోజనాలంటేనే జిల్లెళ్ళమూడి. అందరికీ అన్ని పనులూ అప్పగించబడ్డాయి. ఎందరో ఎందరెందరో నలుమూలలనుండి ఉరకలు వేసే ఉత్సాహంతో తరలి వచ్చారు.

విశేషమేమంటే ఈ బృహత్ కార్యక్రమానికి నాయకత్వం నాదే. 1973లో స్వర్ణోత్సవాలో నేను ఎంత ఉత్సాహంగా, దీక్షగా, దక్షతతో

వ్యవహరించానో – ఈనాడూ 20 సం॥ల తర్వాత అదే ఉత్సాహం. అమ్మ పరిపూర్ణమైన అనుగ్రహం లేకపోతే యిన్ని కార్యక్రమాలు యిట్లా నిర్వహించడం కష్టం. తేడా ఏమిటీ అంటే – అప్పుడు పరిపూర్ణమైన ఆరోగ్యమూ, యౌవనమూ, ఇప్పుడో ! శిథిలమైన ఆరోగ్యం, మీద పడ్డ వృద్ధాప్యం. మిగిలింది పక్వమైన హృదయం, పటిష్ఠమైన మనస్సు.

ఏప్రిల్ – 3వ తేదీ :

అసలు ఉత్సవం యీ రోజుననే. ఆర్.టి.సి. వారు ప్రత్యేక బస్సులు నడిపారు. ప్రభుత్వం తరపున అనేక శాఖలవారు వచ్చారు. ముఖ్యంగా రివెన్యూ డిపార్టుమెంటు తరఫున ఆర్.డి.ఒ. శ్రీమతి ఉషారాణి, ఎమ్.ఆర్.ఒ., డిప్యూటీ సూపరింటెండెట్ ఆఫ్ పోలీసు శ్రీహరిగారు, పబ్లిక్ రిలేషను, పబ్లిక్ హెల్తు, ఎలక్ట్రిసిటీ, పంచాయతీరాజ్, బాపట్ల ఎమ్.ఎల్.ఎ. శ్రీ చీరాల గోవర్ధన రెడ్డి గారు. ఉదయం 10 గంటలయ్యేసరికి ఉత్సవం కోసం వచ్చిన భక్తులతో ప్రాంగణం కిటకిటలాడిపోయింది. గోపూజకు వచ్చిన గోవుల అంబారావాలతో వాతవరణం ప్రతిధ్వనించింది. ఆ అంబారావాలే శంఖారావాలై అంతటా వినిపించాయి.

అన్నపూర్ణలయంలోని వేదికపై ఏ పండగనాడైనా దర్శనం యివ్వడం అమ్మకు అలవాటుకదా ! అదే విధంగా ఆనాడుకూడా ఏర్పాటు చేశారు. ముక్కోటి పండగనాడు అమ్మ దర్శనమిచ్చే రీతిలో అమ్మ ఫోటోకు కటౌట్ తయారుచేశారు. కిరీటంతో, శంఖు చక్రాలతో, ఉర్ధ్వపుండ్రాలతో, నాసికా భరణంతో వెలిగిపోయింది అమ్మ ! ఇంతవరకు చక్కని ఏర్పాటు శ్రీ పాటిబండ్ల బాబూరావు చేస్తే – విజయవాడ కనకదుర్గ దేవాలయ అర్చకుడు, మన కాలేజి పూర్వ విద్యార్థి చి॥ జయంతి చక్రవర్తి వచ్చి అమ్మకు తెల్లని పట్టుచీరె కట్టాడు.

ఉదయం గం॥ 10.30ని॥లకు శ్రీ కుర్తాళ స్వామి వారి సమక్షంలో మాస్టర్ మోపిదేవి కృష్ణస్వామి గారు అప్పటిదాకా మనకు అమ్మకు మధ్య ఉన్న తెరను తొలగించారు. – ఆచార్య బాధ్యతను నిర్వహించారు.

శంఖాలు ధ్వనించాయి. జేగంటలు మ్రోగాయి. ప్రజల జయజయ ధ్వానాలతో షెడ్డు ప్రతిధ్వనించింది. భక్తి ప్రపత్తుల ప్రసూనాల పరిమళాలతో ఆవరణం గుబాళించింది.

ముందుగా స్వామిజీ, ఆపై శ్రీ కృష్ణస్వామీ కొబ్బరికాయలు కొట్టి కర్పూర నీరాజనాలిచ్చిన పిమ్మట – అశేష ప్రజానీకం బంతులు దీరి వేదికపైకి వచ్చి – అమ్మకు నమస్కరించుకుని పులకించిపోయారు.

ఆ మధుర క్షణాల్లో అమ్మను బొమ్మగా ఎవరూ చూడలేదు. సాక్షాత్తూ మనపై అమృత వీక్షణాలను బరపుతూ రక్తమాంసాలతో ఉన్న అమ్మే మన ఎదుట నిట్టనిలువునా నిలుచుని ఉన్నట్లు దర్శించారు.

ఆ భావన, ఆ దర్శనం కేవలం అమ్మ పరిపూర్ణ అనుగ్రహానికి సంకేతం. తర్వాత.... గ్రామస్తులు 70 మంది దంపతులు, అన్ని కులాలకు అన్న మతాలకు సంబంధించినవాళ్లు (ముస్లిములు, క్రైస్తవులు కూడా వాళ్ళలో ఉన్నారు.) కుర్చీల్లో కూర్చుండగా.... శ్రీ యం.యస్.ఆర్. దంపతులు, శ్రీ యం.యల్. కాంతరావు దంపతులు కలిసి ఆడవాళ్ళందరి పాదాలకు పసుపు రాసి, నుదుట బొట్టుపెట్టి, మెడకు గంధం రాసి. పన్నీరు చల్లి ఆహ్లాదపరిచారు. ఆ దంపతులనే అమ్మ – నాన్నగార్లు గా భావిస్తూ, లక్ష్మీనారాయణులను, పార్వతీ పరమేశ్వరులను, సీతారాములను, పద్మావతీ శ్రీనివాసులను స్మరణకు తెచ్చుకుంటూ అమిత భక్తి శ్రద్ధలతో పూజించుకున్నారు.

ఆ పూజలో మరో అంతరార్థంగా కూడా యిమిడి ఉంది. ఆ దంపతులు సమాజానికి ప్రతినిధులు, సమాజమంటే విశ్వానికి ప్రతి రూపం. విశ్వమంటే విష్ణుస్వరూపమేగా ! అంటే అదంతా విష్ణుపూజే, అక్కడ దేవాలయాలవద్ద విష్ణుయాగం – ఇక్కడ విష్ణుపూజ !

ఆ దృశ్యం ఎంత వర్ణించినా చాలదు. కళ్ళారా చూచి తీరవలసిందే. ఆడవాళ్ళందరికీ యం.యస్.ఆర్. దంపతులు – మగవాళ్ళందరికీ యం.యల్. దపంతులు నూతన వస్త్రాలు సమర్పించుకున్నారు. ఆ దంపతులకు అమ్మ మంచి అవకాశాన్ని అనుగ్రహించింది.

తర్వాత జరిగిన గొప్ప సంఘటన - గోపూజ, ఇందుకు వేదిక స్టేటుబ్యాంకు ముందు గల ఖాళీ స్థలం. క్రితం రోజువరకు 70 గోవులు రావడమే అసంభవంగా కనిపించింది. ఎన్ని గ్రామాలకు ఎంతమంది పంపి వెదికించినా - గ్రామాల్లో ఆవులే కరువైనాయి. కానీ, తమాషా తెల్లవారేసరికి 150 గోవులకు పై గా అక్కడకు వచ్చి "అంబా, అంబా" అంటూ అమ్మకోసం గళమెత్తి అరుస్తుంటే - అందరం అశ్చర్యపోయాము.



''గావో విశ్వస్య మాతరం:'' అని ఋగ్వేదం చెబుతున్నది. గోవులో ముక్కోటి దేవతలుంటారు. అని శాస్త్రాలు చెబుతున్నాయి. హిందూ సంప్రదాయంలో గోపూజకు గల ప్రాధాన్యం ''యింత'' అని చెప్పలేము.

ఆనాడు జరిగిన గోపూజ అమ్మ గోమేధిక మహోత్సవానికే తల మానికం. ఆ పూజలో హైదరాబాదు నుండి విచ్చేసిన రాష్ట్ర శాసన సభా స్పీకర్ శ్రీ డి. శ్రీపాదరావు గారు, వారి భార్య శ్రీమతి జయశ్రీ, బాపట్ల ఎమ్.ఎల్.ఎ. గారు, ఈ ఉత్సవంలో సత్కారం పొందటాకినికి వచ్చిన మహనీయులు శ్రీ కుర్తాళ స్వామివారు, శ్రీ మోపిదేవి.... ప్రభృతులు ఎందరో ఉత్సాహంగా - సభక్తికంగా పాల్గొనడం ఆ ఉత్సవాన్ని మహోజ్జ్వలం చేసింది. ఈ గోపూజకు అవసరమైన పైకాన్ని శ్రీకొండముది హనుమంతరావు, శ్రీమతి భానుమతి దంపతులు విరాళంగా సమర్పించారు. గోవులను తీసుకువచ్చిన గో రక్షకులందరికీ ఆ దంపతులు నూతన వస్త్రాలను శ్రీశ్రీపాదరావు చేతులమీదుగా యిప్పించి ఆనందించారు.

మధ్యాహ్నం 12 గంటలకు యాగాలకు పూర్ణాహుతి జరిగింది. ఆ కార్యక్రమంలో యజ్ఞ యజమాని దంపతులతో పాటు శ్రీశ్రీపాదరావు దంపతులు, శ్రీ రావినూతల దంపతులు, శ్రీ కోటంరాజు సత్యనారాయణ,

శ్రీమతి అలివేలుమంగతాయార్లు పాల్గొని కార్యక్రమానికి నిండుదనం సమకూర్చారు.

సరిగ్గా మధ్యాహ్నం 1 గంటకు భోజనాలు ప్రారంభమైనాయి. జిల్లెళ్ళమూడికి జీవనాది భోజనాల పంక్తులేగా. దాదాపు 10వేలమందికి షడ్రసోపేతమైన విందుభోజనం వడ్డన జరిగింది. ఈ కార్యక్రమంలో "సత్యసాయిసేవా సమితి" బాపట్ల శాఖవారు శ్రీ సుబ్రహ్మణ్యంగారి నాయకత్వంలో అందించిన సహాయ సహకారాలు ప్రశంసనీయమైనవి. వారు పనిచేసిన తీరు అందరినీ అలరించింది.

ఇక – సాయంకాలం సభ అత్యంత వైభవోపేతంగా జరిగింది. శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి నిర్వహణలో సభ జనరంజకంగా రూపొందింది. శ్రీ రావినూతల అధ్యక్షత వహించారు, ముందుగా అధ్యక్షులు శ్రీ కుర్తాళ స్వామివారిని సత్కరించారు. ఆ పైన శ్రీ స్వామివారు శ్రీ మోపిదేవి దంపతులను, శ్రీ శ్రీపాదరావు దంపతులను, శ్రీ గోవర్ధన రెడ్డిని, శ్రీ రేటూరు భాస్కర రావు దంపతులను, డా|| వి.వి.ఎస్. శర్మదంపతులను, శ్రీయలవర్తి నరసింహారావును. పూలదండలతో – దుశ్శాలువలతో ఘనంగా సన్మానించారు. కొండముది సుధాకర్ శ్రీపాదరావుగారిని స్వాగతిస్తూ వ్రాసిన పాటను డాక్టర్ ఝాన్సీ లక్ష్మి హిందోళరాగంలో అత్యద్భుతంగా గానం చేసింది. ఆ పాటకు శ్రోతలందరూ ముగ్ధులవటమేకాక శ్రీపాదరావు దంపతులు కూడా ఆనంద భరితులయ్యారు. రచయితను, గాయనిని వేదికపైకి ఆహ్వానించి వారిద్దరికీ దండలు వేసి అభినందించడం జరిగింది.

ఆ రాత్రి వచ్చిన నదీరా గోమేధిక ఉత్సవంగురించి వ్రాసిన పాటను శ్రీమతి లక్కరాజు విజయతో కలిసి పాడి, అందరినీ అలరించారు. శ్రీ నదీరా వేదికపై సన్మానం చేసిన తదుపరి చేసిన ఆవేశపూరితమైన ప్రసంగం శ్రోతల హృదయాలను ఆకట్టుకుంది.

శ్రీ స్వామివారు డా|| శర్మగారికి "వైద్యవాచస్పతి" అనీ నాకు– "కైంకర్య మణి" అనీ బిరుదు ప్రదానం చేశారు.



23-6-1993

నాన్న తద్దినం. హనుమంతు రూ. 20,000/- తెచ్చి యిచ్చాడు. నేనే కబురు చేద్దామనుకున్నాను. వాడే తెచ్చియిచ్చాడు. తమాషా చేతిలో రూపాయి లేదు. ఎవరిని అడగడానికి అందరూ అలాగే ఉన్నారు. వాడే యివ్వగలవాడు. ఇచ్చే స్వభావం గలవాడు. నా అవస్థ చూసి అమ్మే వాడి ద్వారా ఏర్పాటు చేసినట్లు భావించాను.

శేషయ్య లింగం గారు చనిపోయినట్లు వరంగల్ నుంచి ఫోన్ . మంచివాడు, పరమ భక్తుడు. పోయాడు.

25-6-1993

రేపటి నా జన్మదినానికి బెంగుళూరు నుంచి మారుతీ, సీతమ్మల నుండి శుభాకాంక్షలు. వాడికెట్లా గుర్తో !

26-6-1993

బారసాల దేవాలయంలోనే. హైమాలయ ప్రాంగణంలో జపాలు హోమాలు. 'అనసూయేశ్వరాలయం'లో నామకరణం. "శ్రీ విద్య" అని నేనే పెట్టాను. ప్రేమ విద్యాధరి పేరు పలకాలని అడిగాడు. ఆపేరుకు అందరూ ఆనందించారు. ఇవాళనే నా 60వ పుట్టిన రోజు. ఈ ఒక్క సంవత్సరం ఆరోగ్యం బాగా లేకపోయినా సంస్థ నిర్వహణ గురించి పాటుపడాలి. తరువాత కేవలం ఆధ్యాత్మిక చింతన, రచనావ్యాసాంగంలో మునిగిపోవాలి. కొంతకాలంగా అందరి ఆకాంక్ష అదే కదా! **మనలో యింకా అన్ని పనులు ఆధ్యాత్మికమే అన్న భావన రాకపోవడం విచారకరం. భావముంటే. చేసే ఏపని ఆధ్యాత్మికం కాదూ ?**



27-6-1993

కాలేజీ అడ్మిషన్స్ గురించి ఇంటర్వ్యూ. ఆర్థిక పుష్టి కొరకు విద్యార్థుల తల్లి దండ్రుల సమావేశం. అందులో ఆపీల్-నేనే మాట్లాడాను. బూదరాజు శేషు, ప్రిన్సిపాల్ మాట్లాడారు. అందరు ఉత్సాహంగా సహకర్తిసామని వాగ్దానం చేశారు.

ముందుగా శేషు, ప్రిన్సిపాల్ గారు విద్యార్థుల తల్లి దండ్రుల నుండి రూ.116/- డొనేషన్ వసూలు చేస్తామన్నారు. నాకు ఇష్టం లేదు. విద్యార్థుల నుంచి డొనేషన్ వసూలు చేస్తే సంస్థ యొక్క వ్రతమే చెడిపోవడం లేదూ ?

అమ్మ ఆశయం అడుగంటి పోవడం లేదూ ? ప్రజలనుండి ఏ విధంగానైనా విరాళాలు వసూలు చేసి పేద విద్యార్థులకు ఉచిత విద్యాదానం చేయడమే మన కర్తవ్యం. అదే అమ్మ కోరిక. **దాన్ని నెరవెర్చ లేకపోతే మేనేజ్‌మెంటు నుండి వైదొలగి పోవాలి కానీ అమ్మ ఆశయానికి భిన్నంగా నడవకూడదు.**

28-6-1993

మన్నె రామ మోహన రావుతో కలిసి గుంటూరు వెళ్ళాను. అప్పికట్ల లైబ్రరీ గురించి. ప్రస్తుతం లైబ్రరీ ఉన్నస్థలం గవర్నమెంటు పోరంబోకు, దాన్ని జిల్లా గ్రంథాలయ సంస్థకు అనుబంధం చేయాలి. అందుకు కలెక్టరేట్ బి5 లోపని ఆఫీసర్ రాలేదు.

7-7-1993

ఉదయం 5.గం॥ కు వరంగల్. సాయంత్రం ఒక గంటకు పైగా అక్కయ్య, ఉదయ శంకర్, కేదార్, వెంకట రాజు వగైరాలను ఓదారుస్తూ ప్రసంగం చేశాను. వరలక్ష్మి అక్కయ్య అంత దుఃఖః దిగమింగి మాట్లాడటం చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ముఖ్యంగా రాణి ఏడుపు చూడలేక పోయాను.



**28-7-1993**

బాపట్ల నుండి వెంకన్న తమ్ముడు సుబ్బారావు వచ్చాడు. తోటలో దళితుల స్మశానం తగదా గురించి ఆలోచన. ఖగ్గా అంజయ్య, కాలీషా, శేషు వచ్చారు. నేను, సత్య ప్రసాదు, శ్యాము వెళ్ళాము. వెంకన్న చూపించిన హద్దులకు అంగీకరించాము. ఒక విధంగా నష్టమే. స్మశానానికి హద్దులు ఎక్కడా నమోదు కాకపోయినా వాళ్ళు అడిగినట్లు ఇచ్చాము తగదాపడటం ఇష్టం లేక. ఎన్ని తగాదాలు అని ఎందరితో తగాదా అని. విచిత్రమైన వాతావరణం. విచిత్రమైన పరిస్థితి. **కృష్ణుడి తర్వాత యాదవుల పరిస్థితా ?**

**1-07-1993**

జిల్లెళ్ళమూడిలో నీళ్ళు లేనందున పద్మావతితో కలిసి బాపట్ల వచ్చాను. సుబ్బారావు వాళ్ళ యింటికి వచ్చాను. దీప్తి పుట్టినరోజు అక్కడ స్నానం చేసి భోజనం చేసి కృష్ణాలో తెనాలి వచ్చాను.

**2-7-1993**

అప్పారావు పుట్టిన రోజు సందర్భంగా అనసూయేశ్వరాలయంలో అనసూయా వ్రతం. భానుమూర్తి మంత్రమూ, నేను కథా పఠనం. వైభవంగా జరిగింది. నాకు గుడ్డలు పెట్టాడు. ఆ భార్యాభర్తలకు అమ్మ ప్రసాదంగా గుడ్డలు పెట్టాను. అప్పారావు యీసారి చాలా సంతోషంగా ఉన్నాడు. అప్పారావు 'ధ్యానాలయం' గురించి చాలా తృప్తి వ్యక్తం చేశాడు.

**5-7-1993**

సాయంకాలం భావపురి విజ్ఞాన సమితి జూనియర్ కాలేజి ప్రారంభోత్సవం. అటెండ్ అయ్యాను. మాతృశ్రీ సదన్‌కు మంచి వైభవం వచ్చింది. ఒకొక్క స్థల భోగం గురించి చెప్పలేము.

అమ్మ బాల్యం గడిచిన భవనం. అమ్మ ఎన్నో బోధనలు చేసినట్టి భవనం. భోగం ఎందుకు రాదు?



**31-7-1993**

గుత్తా సుబ్బారావు అఖిల భారత రైసుమిల్లర్స్ అసోసియేషన్ సెక్రెటరీగా ఎనుకోబడ్డాడు. మెట్టు, మెట్టు ఎక్కుతున్నాడు. మంచివాడు. సమర్థుడు. **కన్ను నీరువస్తున్నది. గుచ్చుకుంటున్నది. పుసికడ్తున్నది. చూపు తగ్గి పోయింది. డా॥గోగినేని హరి ప్రసాద రావు హాస్పిటల్‌లో కంటి పరీక్ష చేయించాను.**

జిల్లెళ్ళమూడి **2-8-1993**

చూపు సరిగ్గా లేనందువల్ల జిల్లెళ్ళమూడిలోనే ఆగిపోయాను. బయటకు వెళ్ళవలసిన పనులు ఎన్నో ఉన్నాయి. ఆఫీసులో డబ్బుకు కటకట. మీటింగ్స్‌లో ప్రస్తుత ఆర్థిక పరిస్థితి పై సమీక్ష జరగలేదు. అందుకు నిర్ణయాలు తీసుకోలేదు.

**4-8-1993**

జిల్లెళ్ళముడి సా॥ 4.00 గం॥ల నుండి 6.00 గం॥ల వరకు కాలేజిలో "మాతృశ్రీ అధ్యయన వేదిక" అమ్మ గురించి నా ప్రసంగం. ఈ సంవత్సరంలో మొత్తం 10 ప్రసంగాలు చేయాలని సంకల్పం. ఇది మాష్టర్ మోపిదేవి కృష్ణ స్వామి ఆలోచన. ఆ ప్రసంగాల సిరీస్‌కు ఇవ్వాళ ఉపోద్ఘాతం మాత్రం చెప్పాను. నేను అమ్మ దగ్గరకు ఎట్లా వచ్చిందీ, ఎట్లా స్థిరపడిందీ చెప్పాను. అమ్మకు నాకు ఏర్పడ్డ గాఢానుబంధం వివరించాను.

టేప్ రికార్డు చేశారు.

ప్రసంగం ఎంతో బాగుందని అందరూ ప్రశంసించారు. 2 గం॥లు విద్యార్థులందరు చాలా నిశబ్ధంగా కూర్చోని విన్నారు. ఎవరికి ఎంత వరకు అర్థం అయిందో !



5-8-1993

పద్మావతి ఇల్లు కదలనివ్వలేదు. చాలా గోలచేసింది. బయటకు పోవడానికి వీలు లేదు. ఇతరులతో మాట్లాడటానికి కూడా అంగీకరించక పోయేసరికి ఇంట్లోనే కూర్చొన్నాను. 5 పాటలు వ్రాశాను. చాలా బాగా వచ్చాయి. **జైల్లో మంచి గ్రంథాలు రచింపబడటానికి ఇదే కారణమేమో !**

15-8-1993

అన్నపూర్ణాలయం వార్షికోత్సవం. ప్రోగ్రాము బాగా జరిగింది. జనం రాలేదు **ఒక మంత్రో, ఒకస్వాముల వారో రాకపోతే ప్రత్యేక కార్యక్రమాలు లేకపోతే జనం రారేమో** ?

16-8-1993

వైద్యం నిమిత్తం పద్మావతిని రాజమండ్రి పంపించాను. అమ్మాయి, ప్రేమ, సుబ్బారావు వెళ్ళారు. నేను బందా వెంకటేశ్వర రావు గారు కూడా స్టేషన్ కు వెళ్ళాము. బండి గంట లేటు. బందా వెంకటేశ్వర రావు గారితో పాటు గుంటూరు. వెళ్ళాను. ఒక పెళ్ళి సంబంధం విషయమై వల్లూరి రామమూర్తి గారింటికి వెళ్ళాను. వారితో చాలా విషయాలు మాట్లాడినాను.

19-8-1993

సా॥ 3.00-4.30 ని॥లకు కాలేజీలో ప్రసంగం. అమ్మతో అనుబంధం గురించి. పూర్తికాలేదు. ఇంకా రెండు ప్రసంగాలు చేయాలేమో. ప్రసంగం అయిపోయిన తరువాత కాలేజీ ఆఫీసులో 1962 పూర్వం రచనలను చదివి వినిపించాను. ఇ.వి.ఎస్.ఎన్., వరలక్ష్మి, ఝాన్సీ, సుగుణ శ్రోతలు. వాళ్ళు ఆశ్చర్యంగా విన్నారు. సమ్మోగ్ధులైనారు. మా సుబ్బారావు కూడా ఉన్నాడు. షష్ఠపూర్తికి అవి ప్రచురించాలని వాడు ప్రకటించగా ఆ ఖర్చులు తాను ఇస్తానని ఝాన్సీ అన్నది.

జిల్లెళ్ళమూడి

## 23-8-1993

శాంతరామ్ స్కూటర్ మీద అప్పికట్ల వెళ్ళివచ్చాను. వేదాంతం దేశికా చార్యులు వాళ్ళ అన్నదమ్ముల తగాదా పరిష్కారం కోసం.

## 4-10-1993

హైద్రాబాదు. శ్రీనివాస్ వాళ్ళ యింట్లో దిగాం. పెద్దకోడలు శ్యామల బ్రెయిన్, ఎమ్.ఆర్.ఐ. టెస్ట్ కోసం సి.డి.ఆర్, హాస్పిటల్ కు వెళ్లాము. గం॥10.30 ని॥ల నుండి గం॥11.20 ని॥ల వరకు టెస్ట్ జరిగినది. సాయంత్రం రిపోర్ట్ ఇచ్చారు. ట్యూమర్ లేదు. ప్రమాదం లేదు. అమ్మా నా కుటుంబాన్ని కాపాడింది. శ్యామల బాగుంటే నా కుటుంబం బాగున్నట్లే. అందరిని బాగా చూసుకోగలదు.

## 5-10-1993

ఉస్మానియా హాస్పిటల్‌కు వెళ్ళి డా॥ మాధవ రెడ్డి (న్యూరో సర్జన్) గారిని కలిశాము. ఏమి ఆలోచించ వద్దు. మరిచిపోండి. అని సలహా చెప్పారు. ధైర్యాన్ని ఇచ్చారు.

## 9-10-1993

రాణి రూ. 10,000/- ఇస్తానన్నది. ఈ మొత్తం శేషయ లింగం గారి మాసికాలు జిల్లెళ్ళమూడిలో పెట్టడం కోసం. ఇంత భక్తిగల కుటుంబంలో ఇన్ని కష్టాలు ఏమిటి ? అమ్మ కనికరించ దేమిటి ?

రాణి కన్నీళ్ళు అగకుండా ఏడుస్తున్నది. వీటికి ఆనకట్ట కట్టడం అమ్మకు ఎంత పని. శేషయ్య లింగం గారి కుటుంబం సమస్యల పరిష్కారం కోసం నేను ప్రార్థన చేస్తానని వాగ్దానం చేశాను. మరి అమ్మ ఏంచేస్తుందో చూడాలి.



## 11-10-1993

రాచర్ల లక్ష్మీనారాయణ ఫోన్‌లో మాట్లాడి హరిదాసు గారి పదోరోజు సందర్భంగా భోజనాలు ఏర్పాటు చెయ్యమని చెప్పాడు. ఆర్.ఎల్.కు త్యాగం ఎక్కువే. లక్ష్మీనారాయణ హైమాలయ విషయంలోనూ హైమ విషయంలోనూ చూపించే శ్రద్ధా భక్తులు గమనిస్తే హైమాలయం విషయంలో అమ్మ లక్ష్మీనారాయణను ఉపకరణం చేసుకుంది. అనిపిస్తుంది. 14వ తేదిన భోజనం ఏర్పాటు. ఆనాటికి 10 వ రోజు.

## 20-11-1993

ఈ రోజు పదే పదే ఈ విషయాలు స్మృతిలోకి వస్తున్నాయి.



❖ 1968లో హైమ మరణం. దేవాలయం సూచన నేనే చేశాను. ఆ నామకరణం నేను చేసిందే. ఈ మహాయజ్ఞంలో నేను కూడా సమిధ నొక్కటి సమర్పించాను.

❖ 1973లో అమ్మ స్వర్ణోత్సవం. లక్షమందికి భోజనం. అన్ని ఏర్పాట్లు నాచేత చేయించింది అమ్మ.



అమ్మే ప్రకటించింది కదా "అవసరమయితే గడ్డి పోచలను అడ్డం పెట్టుకొని పనులు చేయించు కుంటాను" అని. ఆ గడ్డిపోచ అయ్యే అదృష్టం నాకు దక్కింది. ఈ "కురుక్షేత్ర సంగ్రామంలో" అర్జున పాత్ర ఇచ్చింది.

❖ 1976లో శ్రీ పాద గోపాల కృష్ణ మూర్తి గారు చనిపోతే ఆయన అంత్యక్రియలు. వారి అమ్మాయి గాయత్రికి సహాయకుడిగా నేను చేశాను.

లంకా శర్మ, భృగుబండ నారాయణ మూర్తిగారు. బాపట్ల వెంకట్రావుగారు. రాఘవ రావు మామయ్య, సీతాపతిశర్మగారు వీరందరి అంత్యక్రియలు నాచేత జరిపించింది.



❖ కాత్యాయని శాయమ్మ గారు అన్నయ్యను డాక్టర్ చూపించమ్మ అన్నారు. ఒకసారి నాకు విపరీతమైన నడుం నొప్పి వచ్చింది. ఎటూ కదలలేని తీవ్రమైన నొప్పి. కూర్చోలేక అలాగే అమ్మ మంచం ప్రక్కనే పడుకుంటున్నాను. అమ్మ నాకు స్థానిక వైద్యము చేయుస్తున్నది. నొప్పి తగ్గటం లేదు. ఇది గమనించిన కాత్యాయని, శాయమ్మగారు అమ్మతో "అమ్మా ! అన్నయ్య నొప్పి చాలా తీవ్రంగా ఉంటున్నది. ఈ స్థానిక వైద్యం వలన ఎలాంటి లాభం ఉండటంలేదు. అన్నయ్యను బాపట్ల పంపించి గాని లేదా బాపట్ల నుండి ఎవరైనా వైద్యుని పిలిపించి గాని అన్నయ్యకు వైద్యం చేయించమ్మా" అని చెప్పారు. దానికి సమాధానంగా అమ్మ "నేను కావాలనే వైద్యము ఆలస్యం చేస్తున్నాను. ఈ రకంగానైనా వాడు ఇంటిపట్టున నాకళ్ళెదుట ఉంటున్నాడు. కాని తగ్గితే సంచీ తగిలించుకొని ఊళ్ళమీద పడతాడు". అని ప్రకటించింది. ఆ సమాధానం విన్న అక్కయ్యలు విస్తుపోయారు.



❖ నా అంత్యక్రియలు నువ్వే చేస్తావు. చివరలో ఒకరోజు నేను అమ్మతో "నేను చేయడం బాగుండదు. కొడుకులు చేస్తారు" అన్నాను.

1980లో అమ్మ జబ్బుగా ఉన్నపుడు నాన్నగారు "నాకు ముగ్గురు కొడుకులు రామృష్ణుడు పెద్ద కొడుకు" అని ప్రకటించారు.

నాచేతిలో అమ్మ ప్రాణం వదిలింది.



❖ అమ్మకు ముందు ముఖం కడిగించటం చేసేవాణ్ణి. వరంగల్ యాత్రలో కారు చెడిపోయి వెంట ఎవరు రాలేదు. అప్పుడే అమ్మ " వాడుంటే ఆడ, మగ ఇద్దరూ ఉన్నట్లే" అన్నది. అమ్మ అనుగ్రహం అనుమతి లేనిదే అమ్మ సేవ చేయలేము.

❖ 1968లో అమ్మ చరిత్ర "జీవిత మహోదధిలో తరంగాలు" ప్రచురణ. 15-1-1968 నాడు. మాతృశ్రీ సంచికలో ధారావాహికంగా వెలువడిన మొదటి భాగం ఆవిష్కరణ జరిగింది. ఆ రోజు సభలో అడపా రామకృష్ణారావు గారు, మొసలికంటి తిరుమల రావు గారు పాల్గొన్నారు. గ్రంధాన్ని బహుధా ప్రశంసించారు.

అమ్మ తన జీవిత చరిత్ర పండితుడైన పామరుడు వ్రాయడు. పామరుడైన పండితుడు వ్రాస్తాడు అన్నది. పండితుడైన పామరుడు, పామరుడైన పండితుడు అంటే నాకు తెలియదు. కాని ఆ జీవితాన్ని అక్షరబద్ధం చేసే మహదవకాశం నాకు ఇచ్చింది. ఇంతకంటే అదృష్టము ఏముంటుంది.

ఇక్కడ ఒక విషయం గుర్తు చేసుకోక తప్పదు. నా తొలి ఆధ్యాత్మిక గురువు శ్రీపంగులూరి వీరరాఘవయ్యగారి శిష్యరికం ఇందులో

ఉపయోగించింది. ఆయన 'ఆంధ్ర భక్త మహావిజయము' గ్రంథ రచనకు నేను సహకరించాను కదా! ఆ అనుభవం ఈ గ్రంథ రచనలో ఉపకరించింది.




❖ పాలకొల్లు గోపి

"ఆనాడు రామకృష్ణ - కాళీమాత

ఈనాడు రామకృష్ణ - అమ్మ" అన్నాడు

గోపి వ్రాసిన ఉత్తరం ఇది.



అన్నయ్యా !

దక్షిణేశ్వరంలో నాడు అమ్మ వెనకాలపడి అమ్మా ! అమ్మా ! అని అహరహం అలమటించినందుకు అమ్మ నిన్ను జిల్లెళ్ళమూడి తెచ్చుకొని పేరెత్తి అస్తమానం పిలిచింది. ఇది నిజం. నువ్వు చాలా ధన్యుడవు. నిదానము, ప్రశాంతత, ప్రసన్నత అనే శుభలక్షణాలు అమ్మ నీకు రంగరించి పోసింది. జిల్లెళ్ళమూడి లో నీ ఉనికి ఒక తపస్సులా సాగింది.

– గోపి 12-8-1988

❖ అమ్మ పతాకము నేను, కర్ర. "సమస్తానికి ఆరాధ్యము నీవని ఎలుగెత్తి చాటుతాను నిజం వెలుగిచ్చి చూపుతాను'' అని అమ్మకు లోగడ నివేదించుకున్నాను కదా ! అందుకే అమ్మ సిద్ధాంత పతాకాన్ని వినీలాకాశంలో రెపరెపలాడించే బాధ్యత నాదే అన్న స్పృహ నాకు నూతన ఉత్సాహాన్ని ఇస్తున్నది.

❖ 1966లో పత్రికాప్రచురణ. నాన్నగారు "ఒక మనిషి గూర్చి ప్రతినెలా ఏమి వ్రాస్తావురా" అన్నారు.

"చూసే కన్ను, వ్రాసే పెన్ను ఉండాలి కాని ఎంతకాలం అయినా వ్రాయవచ్చు" అన్నాను. 25 సంవత్సరాలు మాతృశ్రీ మాస పత్రికను నడపగలిగాను. బిడ్డ మాట నిలబెట్టే ధర్మం తల్లిదే కదా. అమ్మ తన తల్లిధర్మం ఏ విషయంలో నేరవేర్చలేదు ?



❖ 1985 జూన్ 11వ తేదిన అమ్మతో సంభాషణ. మిమ్మల్ని వదిలి నేను మాత్రం ఎక్కడకు పోతానురా ? నేను మీతోనే ఉంటాను, మీకు కనబడకపోవచ్చును గానీ, ఎప్పుడులాగే మిమ్మల్ని నేను చూసుకోనూ? బిడ్డల యోగక్షేమాలు చూసుకోవడం తల్లిధర్మం. అన్నపూర్ణాలయం, విద్యాలయాలు, వైద్యాలయాలు, దేవాలయాలు.... అన్నిటినీ యధావిధిగా కొనసాగించండి. ఎట్లానడపడం ? అని భయపడవద్దు ఇప్పుడు మాత్రం ఇదంతా (ఈ సంస్థను నడపడం) మీరు చేస్తున్నారా? మీ ద్వారా జరుగుతున్నది. మీరు నిమిత్త మాత్రులు. ఇప్పుడు ఏ శక్తి జరుపు తున్నదో ఇకముందు కూడా అదే శక్తి జరుపుకుంటుంది.

ఈ సంస్థ, ముందు ముందు మహోజ్వలంగా ఉంటుంది. సాధకులకు, యోగులకు తపస్వులకు ఈ నేల నిలయమవుతుంది. యాత్రికులకు జిల్లెళ్ళమూడి మహాక్షేత్రం అవుతుంది.

నేను కనబడను - అని దుఃఖపడకండి.
అవసరమయినప్పుడల్లా కనిపిస్తాను.



❖ డా॥ ఆర్. జానకి, పాప, విద్యాసాగర్ ఎంతమంది ఉన్నా మందులు నేనే ఇవ్వాలి. అమ్మా ! నీ సేవలలో నన్ను అన్నిరకాల భాగ్యవంతుణ్ణి చేశావమ్మా ! ఏమిచ్చి నీ ఋణం తీర్చుకోగలను ? నా బ్రతుకు నైవేద్యం పెట్టితప్ప.

❖ బ్రహ్మంగారు సిద్దయ్య. బ్రహ్మంగారి అంత్యదశలో సిద్దయ్య ప్రక్కన లేక ఎంతో విలవిల లాడాడు. నాకా గతి పట్టదని అమ్మహామి.

అమ్మ తన ఈ హామీ నిలబెట్టుకున్నది. ఏ హామీ నిలబెట్టుకోలేదు కనుక. 1985 జూన్ 11వ తారీఖు, నేను తప్పని సరిగా గుంటూరు వెళ్ళాల్సిన పరిస్థితి నా బాల్యస్నేహితుడు అప్పికట్ల కుర్ర అంకినీడు హాస్పిటలో మరణశయ్య మీద ఉండి'కరణం కృష్ణమూర్తి' అంటే నన్ను చూడాలని కలవరిస్తున్నాడట, వాడిపిల్లలు కబుర్ల మీద కబుర్లు చేస్తుంటే గుంటూరు బయలు దేరాను. వ్యాన్ దాకా కూడా వచ్చాను. కాని అమ్మ నన్ను వెనక్కి పిలిపించింది. ఆ రాత్రి సంస్థను నాకు అప్పగించింది. ఆ తరువాత నా చేతిలో ప్రాణం వదిలింది. సిద్దయ్య పొందని అదృష్టం.

❖ జూన్ 2వ తేది 1985" వాడి ఋణం నేను తీర్చుకోలేను" అన్నది అమ్మ. మంత్రి ప్రగడ కామేశ్వర రావుతో 'నాకు ఓదార్పు వాడి ఒడిలోనే' అన్నది.



❖ అమ్మ గోదావరి జిల్లాల ప్రయాణం. బామ్మ అనారోగ్యం. 1974 జనవరిలో రాయలసీమ ప్రయాణం, పద్మావతి కనిపించలేదు. రెండు సార్లు చాలా సంకట పరిస్థితి. వ్యక్తిగత బాధ్యతలు సమిష్టి బాధ్యతలు ఘర్షణపడినపుడు ఒకే దారి ఎంచుకోవడం కష్టమైనపనే ! కాని సమిష్ఠి బాధ్యతలు నెరవేర్చడం ఎప్పుడూ అసిధారా వ్రతమేకదా !

❖ మార్గదర్శనమే కాదు చేయిపట్టు కొని నడిపించింది కూడా అమ్మే. సంస్థ బాధ్యతలు నేను నిర్వహిస్తే నా వ్యక్తిగత బాధ్యతలకు అమ్మ పూచీ వహించిందన్న భరోసాయే నన్ను నడిపించింది.



❖ అమ్మ రామకృష్ణ దణ్ణం పెట్టడమ్మా. ఎవరో కంప్లైంట్. "వాడు పెట్టనవసరం లేదు" అమ్మ.

"ఎప్పుడూ నిన్ను ప్రశిస్తాడమ్మా", మరొకరి ఆరోపణ. "వాడికోసం కాదు" అమ్మ సమర్థన.

"రామకృష్ణ నాస్తికుడమ్మా" ఇంకొకరి అభిప్రాయం. నేను నాస్తికు రాలినే- వెంటనే అమ్మ జవాబిచ్చింది.



❖ 1971లో మా అమ్మ మరణం. అంత్యక్రియలు జిల్లెళ్ళమూడిలోనే. బంధువులంతా అమ్మకు సరెండర్ అయినారు.

❖ 1972లో ఫిబ్రవరి 23న సీతమ్మ పెండ్లి–ఆనాడు అమ్మ నాకు మంగళ సూత్రం కట్టింది.

❖ హైమాలయం దారిలో గోడ వ్యవహారం. "నాకు చెప్పకుండా వాడేమీ చేయడు. నాతో మాట్లాడే చేస్తున్నాడు. మీరు మాట్లాడాలంటే ఇక్కడికి రావాలి. వాడు అక్కడ నుండే మాట్లాడగలడు" అన్నది అమ్మ.



❖ 1984లో గాయత్రీ యాగం. నేను కూడా పాల్గొంటాను. మంత్ర దీక్ష ఇమ్మని అడిగాను. "నీవు చేసేదంతా గాయత్రే నాన్నా ! నీకెందుకు వచ్చింది ఈ ఆలోచన, వదిలెయి" అన్నది అమ్మ.

❖ పెళ్ళిళ్ళు ఎవరు ఇక్కడ పెళ్ళిచేసుకున్నా అన్ని ఏర్పాట్లు నేనే చేయాలి. గోపాల్ కూతురు. కొడుకు, లక్ష్మీనారాయణ కూతురు, కేశవ శర్మ కూతురు, సావిత్రి, రమణ, లాలా బ్రదర్స్, రామకృష్ణ శర్మగారి కూతురు, పులిపాక చలపతిరావు గారి కూతురు, భట్టిప్రోలు చలపతి పిల్లలు, పోలిశెట్టిరామ చంద్ర రావు పిల్లలు, తూనుగుంట్ల త్రిలోక అప్పారావు పిల్లలు, మోగులూరి రామచంద్రరావు గారి పిల్లలు.





❖ రోజూ అమ్మే స్వయంగా నాకు అన్న పెట్టేది. ఒక రోజు తింటేనే ఎంతశక్తో అన్నాడు బషీర్ బాబా. మరి నేను ఎన్ని వందలసార్లు తిన్నానో.



❖ ఒకసారి ఒక సోదరుడితో తగాదా వచ్చి నేను అప్పికట్ల వెళ్ళాను. అమ్మ నా వెంటనే నాన్నగారిని పంపించింది. "మర్రిచెట్టు లాంటివాడమ్మ రామకృష్ణ ఆ నీడన మరో మొక్క బ్రతకదు" అని ఆ సోదరుడు అమ్మతో మొరపెట్టుకున్నాడు.





❖ అమ్మ మంచం నాకు ఇచ్చింది. నాడు పాన్పు (ఆదిశేషుడు)కి సేవలు చేసే అవకాశం (లక్ష్మణ స్వామిగా) కలిగించాడు ఆ భగవంతుడు. నేడు సేవలకు మెచ్చి తన పాన్పును బహుకరించింది అమ్మ. పోలిక సరైన దేనా.? ఏమో అమ్మ మాత్రం కరుణించింది.

❖ నవంబర్ 11, జనవరి 16న అమ్మ స్వయంగా తలంటి పోసేది. ఎవరో ఒకరికి చెప్పి కొత్త బట్టలు తెప్పించేది.

❖ చలపతి కూతురు దుర్గమ్మ పెళ్ళి. అమ్మ అఘటనఘటనాసామర్థ్యానికి మచ్చుతునక. దుర్గమ్మ కాబోయే అత్తగారికి మాట ఇచ్చాను. దుర్గమ్మకి బి.ఇడి. సీటు ఇప్పిస్తానని. విచిత్రంగా ఆ సంబంధిత అధికారి స్వయంగా దుర్గమ్మ పెళ్ళికి వచ్చేటట్లు చేసింది అమ్మ. ఆయనకు నూతన వధూవరులు నమస్కరించారు. ఆశీర్వదించమని. ఆయన "అయ్యో ఈ రోజు ఇక్కడ వివాహం జరుగుతుందని నాకు తెలియదే ! ఏ బహుమానము తీసికొని రాలేదు". అని డబ్బు రూపంలో ఇద్దామని జేబులు తడుముకూంటున్నాడు.



నేను వెంటనే " మీరు ఇవ్వగలిగిన బహుమానం మీ దగ్గర ఉన్నది". అన్నాను. "ఏమిటది"? అని విచిత్రంగా చూశాడు. నేను విషయం చెప్పి బి.ఇడి సీటు ఇప్పించమని అడిగాను. ఆయన సంతోషంతో వెంటనే అంగీకరించి బి.ఇడి కాలేజి వారికి సిఫారుసు లేఖ వ్రాయటం ప్రారంభించారు. నేనే వెంటనే "నూతన వధువు తోడి కోడలు కూడా బి.ఇడి సీటు కోసం ప్రయత్నిస్తుంది. ఈ అమ్మాయికి వచ్చి ఆ అమ్మాయికి రాకపోతే

ఏం బాగుంటుంది". అన్నాను. ఆ మాటకు నవ్వుతూ ఆయన ఇద్దరి పేరు మీద సిఫారుసు లేఖ వ్రాశాడు. ఇంతకుముందు ఎందరికో ఎన్నో రకాల సహాయం చేసినా చలపతి కూతురుకు ఈ విధంగా సహాయం చేయటం సంతోషంగా ఉన్నది.

చలపతితో నాకున్న సంబంధం విభిన్నమయింది. కదా-నేను అమ్మకు బహిఃప్రాణమయితే వాడు నాకు బహిఃప్రాణం. వాడి దూకుడు స్వభావంతో నేను ఏకీభవించకపోయినా నా మీద వాడికున్న ప్రేమ విశేషమయింది. జిల్లెళ్ళమూడిలో నేను ' అమ్మ సేవలో' ఇంత అంకిత భావంతో పాల్గొన్నానంటే వీళ్ళందరి పాత్ర మరువలేనిది. అప్పికట్లలో నా కుటుంబ బాధ్యతలు చలపతి చూసుకున్న తీరు నన్ను వాడికి కృతజ్ఞుణ్ణి చేశాయి. ఈ విధంగా కొంత ఋణం తీర్చుకోగలిగాను అంతా అమ్మ కృప.



❖ ఎవరితో ఏమి మాట్లాడాలన్నా అమ్మ ప్రతినిధిగా పంపేది " వాడు అప్పికట్లకు కరణం, నాకు ఉపకరణం " అని అమ్మ స్వయంగా ప్రకటించింది. అమ్మ టూర్ ప్రోగ్రామ్స్‌లో నిర్ణయం తీసికొనే అవకాశం నాకే ఇచ్చేది అమ్మ. మరి నేను ఆంతరంగిక కార్యదర్శిని కదా.

❖ 1973 మార్చి 7వ తేదీన కిరణ్ పుట్టుక. అమ్మ చీరాల ఫ్రేజర్ హాస్పిటల్‌కు వచ్చింది.



నా కుటుంబంలో ఏ సమస్య వచ్చినా అమ్మ ఇలాగే స్పందించింది.

❖ మద్రాసులో 1987 నవంబరు 11వ తేదీన పూజ. చూపురాలేదు. "నా సేవతో తృప్తి పడకపోతే కన్ను ఇవ్వమ్మా మళ్ళీ నీ సేవకే పునరంకితమవుతాను" అని అనుకున్నాను. చూపు వచ్చింది.



❖ 1992 ఏప్రియల్ 2వ తేదీ అప్పికట్ల లో అమ్మ భౌతికంగా రావటం. ఫోటో నుండి కుంకుమ రావటం. అది ఒక దివ్య అనుభవం.

❖ అప్పికట్ల గ్రామస్తుల అనన్యాదరణతో అప్పికట్లలో రామ మందిరం తాళాలు తీయించడం. వాటర్ ట్యాంక్ వర్క్స్ చేయించడం. ఈ సందర్భంలోనే ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు ప్రశంస. దగ్గుబాటి వెంకటేశ్వర రావుతో "కరణాలంటే తగదాలు పెడ్తారని నాకు తెలుసు. ఈ అప్పికట్ల కరణం ఊరు బాగు కోరుతున్నాడే. ఇతనిని చూడాల్సిందే అన్నాడట !

❖ అమ్మ చరణాలే నా చిరునామా. అంత సాన్నిహిత్యాన్ని ప్రసాదించింది. పొత్తూరివారు కూడా "అమ్మ మంచానికి అయిదో కోడు రామకృష్ణ" అని చమత్కరించారు.





09.08.1994

*Dear Prem*

అమ్మ ఆశీస్సులతో...

నీవు ఉద్యోగంలో చేరినట్లు తెలిసింది. చాలా సంతోషం చి॥ల॥సౌ॥ సుబ్బలక్ష్మి నీవూ కులాసాయే గదా. ఆగష్టు 15న ఉత్సవంలో హడావుడిగా ఉన్నాను. ఆగష్టు నెలలో బాపట్లలో, తెనాలిలో రైసుమిల్లుల నుండి బియ్యం వసూలు చేద్దామను కుంటున్నాను. ఆ కార్యక్రమానికి ఏదైనా విఘ్నం కలిగితే నెల్లూరు వస్తాను. అప్పుడే అక్కడ వసూలు చేద్దాము.

ఆగష్టు 15 ఆహ్వానాలు పంపుతున్నాను. అక్కడ నీవు స్వయంగా వెళ్ళి రాంప్రసాద్‌గారికి పేరాలవెంకటేశ్వరరావు గారికి, బూర్సు వెంకటేశ్వర్లుకు అందజేయ్యి. డాక్టర్ అరుంధతి గారికి, కుమార శాస్త్రికి పంపాను.

అమ్మ సేవలో
భవదీయుడు
కొం॥ రామకృష్ణ

# అమ్మ – అన్నయ్య

రామకృష్ణ అన్నయ్య, 'అమ్మ' చల్లని చూపును దర్శన భాగ్యంగా పొందగలిగిన ప్రతి జీవికి అన్నయ్యే....

జిలెళ్ళమూడిలో అడుగిడినప్పుడల్లా, అమ్మని పూజించినప్పుడల్లా, అమ్మని స్మరించి, ధ్యానించినప్పుడల్లా, అమ్మని గురించి సంభాషించినప్పుడల్లా, అమ్మ చల్లని అనురాగపు ధృక్కులను, చిరునవ్వును, అమ్మ సందేశాన్ని, అమ్మ భావాలను, అమ్మ ప్రేమను అన్ని మనల్ని ముప్పిరుగొనేలా మనకు తెలియజేసే రామకృష్ణ అన్నయ్యను స్మరించుకొనే రోజు ఇది.

అన్నయ్య జననం 1934 జూన్ 26న. స్వగ్రామము గుంటూరు జిల్లాలోని అప్పికట్ల. తల్లిదండ్రులు కొండముది అన్నపూర్ణమ్మ, సుబ్బారావు గార్లు.

అన్నయ్య తన 5వ యేటనే తండ్రిని కోల్పోయాడు. అమ్మ, నాయనమ్మల పెంపకం ఆధ్యాత్మిక మార్గంలో నడిపించింది. రామకృష్ణ అన్నయ్య కారణ జన్ముడు. అందుకే పువ్వు పుట్టగానే పరిమళించునట్లు చిన్నతనము నుండే అన్నయ్య జిజ్ఞాసువు అయినాడు. అన్వేషణ అన్నయ్య ప్రవృత్తి అయింది. అన్నయ్య మాటలలోనే

"ఆధ్యంత రహిత – అంతర్మధనంలో
మది ఆగనిదాహం రగిలేను హృది ఆరని దీపం వెలిగేను"

నిత్యసాధన, సత్యస్థాపన కన్నా ఇంకేమి కోరుకోను అన్నాడు. మనిషి ఆశ, నిరాశలను సుదీర్ఘంగా పరిశీలించాడు. అచ్చెరువొందాడు. అందుకే ఇలా వ్రాసుకున్నాడు.

"డెందంలో అంతులేని ఆనందం కదం తొక్కుతుంటే
చింతల దొంతర ఏనాడో చిందులు తొక్కుతుందని సందేహం"
"చరమ ఘడియల శయ్యమీద మృత్యుంగన పరిరంభంలో

హాలాహలం ప్రాణం ప్రసాదిస్తుందనీ ఆరాటం"

"భావనల పవనాల బలంతో - భావిశుభాల మధురజలంతో

నరుల ఘటనాఘట నాద్భుత మన స్సీమలు - నిరాశాలతకు

పూయించు ఆశాసుమములు"

"సుఖశాంతుల అన్వేషణ - నీటిలో నీడలు పట్టుటలే"

జీవితం ఆశాతైల శీకరముల ఆరనిజ్వాల ఆ జననమరణముల

ఆగనిడోల" అనుకున్నాడు.

"జీవితం సుఖదు:ఖాల గంగాయమునల సంగమంలో స్నానం" గా

గుర్తించాడు.

దీనికంతటికి కారణము ఏమిటి ? కారణం ఎవరు? అని అన్వేషణ ప్రారంభించాడు. దీనికి నివారణ ఎవరు చెప్పగలరు ? అని శోధన ప్రారంభించాడు.

"ఎడదను మసిచేసే వేదనను

ఎముకలు నుసిచేసే రోదనను

ఎదిరించి అణిగించి - ఎలిమితో నింపేదెవరో" అని మధన పడ్డాడు.

ఆ మధనంలో నుండి తన మార్గాన్ని నిర్ధేశించుకున్నాడు.

" మారని మనసులు మారి - మానవాళి సుఖమందే దారి శోధించాలని, సాధించాలని నా ప్రయత్నం". అని తన ఊహా ప్రపంచాన్ని ప్రకటించాడు.

కాంతిని సాధించి, శాంతిని స్థాపించి సుందర సరోజంలా

సమతా సమాజం విరచించే స్నేహార్ద్ర సౌహార్ద్ర సువిశాల భావాలు విరజిల్లే ప్రపంచాన్ని కలలు కన్నాడు. ఆ ప్రపంచములో

"జీవితాశలు వీడిన మానవతాంగన అర్ధనిమేలిత వినీల నయన ప్రసూనయుగళి విశాలమై ఆశాలవం సృజింయించెను" అని కలలు కన్నాడు. ఇలాతను.

"లోకంలో అందరికీ మార్గదర్శి కావాలని - స్వర్గానికి సూటి బాట స్వయంగా నిర్మించాలని" ధృఢ నిర్ణయానికి వచ్చాడు. ఇంకేం 'గమ్యం' నిర్ణయమైనది. ఇక కావాల్సింది "మార్గమే".

"ధైర్యంతో, మది స్థైర్యంతో పురోగమిస్తే కలదు శుభం"

" పయనిస్తే .... దీక్షతో దక్షతతో గమనం సుగమమే గమ్యం సుసాధ్యమే" అనుకొన్నాడు.

శుద్ధమైనది, నిజమయినది 'హ్యూమనిజం' అన్న అవగాహన కొచ్చాడు. ఎం.ఎన్.రాయ్ సిద్ధాంతం వెలిగించిన దీపికా కాంతులలోనే ఈ జనత చెందగలదు విముక్తి, అనుకున్నాడు. మానవత్వం నవనవోన్మేషంగా చిగురించి పుష్పిస్తేనే గాని ఈ జన్మకు విముక్తి లేదనుకొన్నాడు.

మానవతా వాదాన్ని ఇలా అన్వయించాడు.

"చేతనైన సాయము చేయుటే ధర్మం.<br>
చేరుటకు స్వర్గమ్ము ఇదియే మర్మం"<br>
"ఒరుల సౌఖ్యమ్ముకై ఒసంగె దేహమే తృణమ్ముగా<br>
ఇది విశిష్ట ధర్మ మనన్యమన్నా"<br>
" బాల్య యౌవన వృద్ధాప్యాల్లో జాగ్రత్ స్వప్న సుషప్తుల్లో<br>
అహరహంగా అఖండంగా ఏది ప్రదీప్తమౌతుందో<br>
ఏది ప్రసుప్తి చెందదో<br>
అది సత్యమయింది,<br>
అదే నిత్యమయింది "<br>
"గౌరవం<br>
మనసుకూ, మంచి తనానికీ<br>
తరిగిపోని, కరిగిపోని సంపదకు"<br>
"ప్రకృతిలో అనవసరమ్ము ఫృధ్విపైన అనర్థమ్ము<br>
ఏదీ లేదూ ............. ఏదీ కాదూ ............ "<br>
"ద్రోహం, దోషం లోపించాలోయ్<br>
స్నేహం, శీలం దీపించాలోయ్"

"ఆశలే అమృతమోయీ ఆపద లన్నృతమోయీ ఖేదమైన, మోదమైన జీవనమే సుధా పానమోయీ జీవితమే సదా గానమోయీ ...

**విశిష్ట కలయిక :**

ఈ సమయంలోనే 'అన్నయ్య' జిల్లెళ్ళమూడి కొన్ని కారణాల రీత్యా వచ్చాడు. అంతకు ముందు కూడా వస్తూ వుండేవాడు. ఒకసారి ఏం జరిగింది అంటే.... అన్నయ్య మాటలలోనే.

"అది 1962 నవంబరు 11వ తేది .... కార్తీక పూర్ణిమ. నా జీవితాన్ని మలుపు తిప్పిన శుభ దినం. నన్ను అమ్మ ఒళ్ళోకి చేర్చిన సుముహూర్తం".

అప్పుడు ఏం జరిగింది ? అది ఈనాటికీ చరిత్రకందని విషయం. అయితే అన్నయ్య ఆ రోజున అమ్మ మీద విశ్వాసం కుదిరింది అంటున్నాడు. మళ్ళీ తనే "నా జీవితంలో అనుభవం ద్వారానే విశ్వాసం ఏర్పడ్డది" అన్నాడు. అమ్మ అనుగ్రహంతో సాధన ప్రారంభమయింది అన్నాడు. అంటే ఆనాటి రాత్రి ఏదో అనుభవంలోకి వచ్చి వుండాలి. అదేమిటి ?

బహుశ ఆ రాత్రి 'అన్నయ్య మనస్సాగర మధనం' జరిగింధి. మానవ జాతి సాధన బాధలు మన:వికారాలు, ఆశానిరాశలు అన్ని ఆ మధనంలో మధించబడ్డాయి. చివరకి 'అమృతం' ఆవిష్కరించబడ్డది. అంతే తన అన్వేషణకు ఫలితం లభించింది. మానవత్వ వాద పుష్పం శతసహస్ర దళాలతో వికసించి ఆయనకు దర్శనం ఇచ్చింది. తన ఆవేదనకే కాదు మొత్తం మానవ జాతి ఆవేదనకే 'అమ్మ' వద్ద పరిష్కారం కనిపించింది. ఇక అన్నయ్య వెనుదిరిగి చూడలేదు.

**అన్నయ్యను అంతగా కట్టివేసిన అమ్మ సిద్ధాంతాలు**

"తీపి చేదు, సుఖమూ, దు:ఖమూ, అమృతమూ హాలాహలమూ అన్నీ సమంగా స్వీకరించాలి"

"హాలాహలం మనం ఆస్వాదిస్తూ – అమృతం మరొకరికి పొయ్యాలి".

" బ్రతుకంటె బాధల పధమే – బాధంటే భగవంతుడే "

మొదట నుండి 'ప్రేమ' మానవ సమస్యలకు పరిష్కారం అని భావిస్తూ వచ్చిన అన్నయ్య

ఆ ప్రేమ విరాడ్రూప సందర్శనం అమ్మలోనే పొందగలిగాడు.

ప్రేమకు పరకాష్ట స్థితిని అమ్మ వద్దనే గమనించాడు.

ప్రేమకు మూలం అమ్మే అనిపించింది.
ప్రేమకు ఆకృతియే అమ్మ అనిపించింది.

ప్రేమే అమ్మ అని, అమ్మే ప్రేమ అని ఈ ఇద్దరికి ఆ బేధమనీ అనిపించింది.

అలాగే మానవ వికారాలన్నింటికి 'ఆకలే' కారణమనుకుంటూ ఉన్న అన్నయ్య 'ఆకలి' నోట్లో రోకలి కుక్కి ఆకలే అర్హతగా అన్నపూర్ణాలయాన్ని ప్రారంభించిన అమ్మ మహోన్నత మానవతా వాదానికి దాసోహమన్నాడు. అసూయా ద్వేషాలు మానవ జాతిని పట్టిపీడిస్తున్న జంట దయ్యాలుగా భావించిన అన్నయ్యకు అమ్మ చెప్పిన

" నీ బిడ్డయందు ఏంచూస్తున్నావో అందరియందు అదే చూడు"

" నీ మమకారాన్ని అపరిమితం చేసుకో " అన్న సిద్ధాంతాలు అమితంగా ఆకర్షించాయి.

" బాధలను నవ్వుతూ అనుభవించాలి" అన్న మాట బాధలను పోగొట్టే తారక మంత్రంగా వినిపించింది. అమ్మ చూపిస్తున్న "అందరిల్లు", "విశ్వ కుటుంబం" అన్ని సమస్యలు పరిష్కరించగలవనిపించింది.

ఇలా తన మానవతా సిద్దాంతానికి జిల్లెళ్ళమూడి 'అమ్మ' ప్రయోగశాల నిర్వహిస్తుందనుకున్న అన్నయ్య తనూ ఆ ప్రయోగశాలలో చేరాడు. అమ్మకు చేదోడు వాదోడుగా నిలబడ్డాడు. అమ్మకు ఉపకరణం అయ్యాడు. అమ్మ చేసిన సత్యావిష్కరణకు సాక్షీభూతుడైనాడు. అమ్మ పతాకం అయితే తాను జెండా కర్ర అయినాడు. అమ్మకు పూజారిగా మారాడు. అమ్మను శతసహస్ర కోణాలలో దర్శించాడు. మనకు " మాతృ దర్శనం" కలిగించాడు. ఆ జీవిత మహోదధి తరంగాలలో మనల్ని ఓలలాడించాడు.

## అన్నయ్య దృష్టిలో అమ్మ

అన్నయ్య దృష్టిలో అమ్మ ప్రేమ స్వరూపిణి. తనను ఎవరు ప్రేమించినా, ప్రేమించకపోయినా, ద్వేషించినా, దూషించినా, హింసించినా ... అందరిని ప్రేమించాలనుకునే ఉదాత్త మనస్విని అమ్మ. అమ్మ మహామేధావి, అమ్మజ్ఞాపక శక్తి అత్యద్భుతము, అనుపమము, అసామాన్యము అయింది. అమ్మ స్థిత ప్రజ్ఞ, అమ్మ దృష్టిలో కష్టసుఖాలు రెండు దైవం ప్రసాదించిన వరాలే. ఆగ్రహానుగ్రహాలు రెండు లేవు. అంతా కటాక్షమే. అమ్మ స్థిర సంకల్ప. అమ్మ శుద్ధ మానసంలో ఏభావ తరంగం ఉత్పన్నమయినా అది క్రియా రూపం ధరించవలసినదే. అమ్మ అమోఘ వచస్క, అమ్మ తమాషాగా అన్నట్లుంటుందిగానీ, అమ్మవాక్కు ఎప్పుడూ వ్యర్థము కాదు. అమ్మ వాక్చతుర, మధురాలాప, నాగేశ్వరి, వాగ్దేవత, అమ్మ నిరుపమత్యాగమయి, అమ్మ సహనమూర్తి, అమ్మ పరమదయాళువు. అమ్మ కరుణారస సాగర. అమ్మ విరాగిణి (విరాగమంటే మమకారాన్ని సర్వజగత్తుకు పరివ్యాప్తం చేయటం). అమ్మ విశాలహృదయ, విశ్వకుటుంబిని, విశ్వజనని, తన బిడ్డయందు ఏమి చూస్తుందో అందరియందు దానినే చూడగల వాత్సల్య స్వరూపిణి అమ్మ. అమ్మ అద్వైతమూర్తి. అమ్మకు జాతి మత భేదం లేదు. వర్గ వర్ణ భేదం లేదు, వయోలింగ భేదం లేదు, జడచేతనా భేదం లేదు. దేశాకాల భేదం లేదు. మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు అనే భేదం లేదు. పెద్దవాళ్ళు, పేదవాళ్ళు అనే భేదం లేదు. పండితులని, పామరులు అని భేదం లేదు. ఇంట్లోవాళ్ళని, ఇతరులని భేదం లేదు. సర్వభేదాలకు అతీతమైన, అత్యున్నతమైన స్థితి అమ్మది. అమ్మ సర్వజ్ఞ సర్వవ్యాపిని, అమ్మ సర్వశక్తిమయి, అమ్మ ఘటనాఘటన సమర్థ అమ్మ దర్శనం అంతా అదేనని. అమ్మ ప్రభోదం అందరిని ప్రేమించమని.

చివరికి అన్నయ్య అంటాడు..... 23 సం॥లు అనుక్షణం, అమ్మను దర్శిస్తూ, అమ్మధ్యాసే ధ్యానంగా జీవిస్తూ, అవగాహన చేసుకున్న పరమాద్భుత

విషయం రెండుముక్కలలో చెప్పాలంటే అమ్మ **"స్వరూప లలిత", "స్వభావ మధుర"**.

ఇట్లా అమ్మను, అమ్మ తత్వాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి చివరకు అమ్మతో తాదాత్మ్యం చెందాడు అన్నయ్య.

'అమ్మ' భౌతికంగా కనుమరుగైన తర్వాత అమ్మ సంస్థలతో తాదాత్మ్యం చెందాడు. అమ్మసంస్థల సేవ అమ్మసేవగా భావించాడు. ఆ సేవలోనే తన తనువు చాలించాడు.

అమ్మా !<br>
నీ సేవలోనే నా బ్రతుకు సాగనీ<br>
నీ ధ్యాసలోనే నా శ్వాస ఆగనీ.... కోరుకున్నాడు అన్నయ్య.

ఇలా అమ్మను కోరి సాధించిన అన్నయ్య ధన్యుడు. ఆ అన్నయ్య బాటను అనుసరిస్తే మనమూ ధన్యులమే.

– జయహో మాత –

– శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య ఫౌండేషన్



# కార్యాచరణలో మహాయోగి

ఉదారా: సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।

అస్థిత : సహి యుక్తాత్మా మమేవానుతమాం గతిమ్ ॥

నా దివ్యమైన సేవయందు నియుక్తుడైనందున అతడు

అత్యుత్తమము మరియు పరమగతియైన నన్ను తప్పక పొందగలడు

-భగవద్గీత -7వ అధ్యాయం

**(మాతృశ్రీ 1973 సెప్టెంబర్ ఆంగ్ల సంచికలో శ్రీ యు. పార్థసారథి వ్రాసిన వ్యాసం "ఎ మహా యోగి ఇన్ యాక్షన్"కు స్వేచ్ఛానువాదం.)**

అమ్మ శ్రీ చరణాలను నిత్యం అర్పించే అర్చకుడు, గోపాలునికి రాధవంటి అమలిన భక్తశిఖామణి శ్రీ రామకృష్ణ అన్నయ్య. ఒక అందం ఒక ఆకర్షణ ఒక కారుణ్య దృష్టిగల వ్యక్తి అతడు. అతని కార్యక్రమాలు మన మనసుల్ని కరిగిస్తాయి. తన చర్యల ద్వారా ఒక కవితావేశం, ఒక సమ్యక్ సదాలోచన కల్గించే అన్నయ్య ఎల్లప్పుడూ ఆనందతరంగితుడై వెలుగుల వెరజిమ్ముతూ ఉజ్వల భావప్రపూర్ణుడై కన్పిస్తాడు. ప్రతియాత్రికుణ్ణి తన మృదు భాషణతో అలరిస్తాడు. ఏ మాత్రం అహంకారం అందులో కనిపించదు. అతడు 'ఆ తల్లి' చుట్టూనే తిరుగుతూ ఉండటంతో అతనిలోని ఆత్మాభిమానం, కించిత్ అహంకారం పూర్తిగా రూపుమాసిపోయినవి. అమ్మ సన్నిధిలో పిపీలికాది బ్రహ్మపర్యంతం సాగే కార్యక్షేత్రం అతనిది. అందరికీ సంబంధించిన అన్ని పనులపై అతనిమనస్సు నిమగ్నమై ఉంటుంది.

శ్రీరామకృష్ణ అన్నయ్య విశ్రాంతి తీసికొనే సమయం నిద్రాసమయం అతిస్వల్పం అనిపిస్తుంది. ఎప్పుడూ అతని కార్యభారం అనంతంగా ఉంటుంది. అతడు చేసేపని ఎక్కువ. తినేది, త్రాగేది తక్కువ. ఒకప్పుడు దృఢ శరీరుడు నేడు దుర్బలుడైనాడు. నిత్యం చేసుకొనే ఇంజక్షన్లే అతనికి ఆహారం. అయినా అతిప్రయాసతో కూడుకొన్న కార్య నిర్వహణ అతను అవలీలగా సాగిస్తున్నాడు. రెండు హస్తాలు, రెండు పాదాలు, రెండు కళ్ళు నిత్య జాగృతాలై ఉండగా

అపారకార్య భారాన్ని అలవోకగా మోస్తున్నాడు. ఎప్పుడూ చెరగని చిరునవ్వుతో ప్రేమాదరణలకు అలవాటైన తన చేతులు చాచి వేలాది భక్తులను ఆహ్వానిస్తాడు. వారితో మృదుమధురంగా భాషిస్తాడు. ఒకే ఒక చూపుతో ప్రతి ఒకరిని పలకరిస్తాడు, అలరిస్తాడు, ఆకర్షిస్తాడు. అసలు **ఆయన విజయానికి ఆయన నెరపే ఈ మానవ సంబంధాలే కారణమని నాబోటి వారి అభిప్రాయం.** తన వ్రేలికదలికలతో శాసించి పనులు జరిపిస్తాడు. భక్తుల అవసరాలు అనుక్షణం గమనిస్తూనే అన్నపూర్ణాలయం పర్యవేక్షిస్తాడు. అంతలోనే స్టోర్‌గది పరిశీలిస్తాడు. అమ్మతో మాట్లాడుతుంటాడు. ఇంతలో టెలిఫోన్ దగ్గరకు పరుగులు తీస్తుంటాడు. కాసేపు ఎస్.వి.జె.పి. ఆఫీసుకుపోతాడు.

భక్తులను క్రమబద్ధంగ కూర్చోబెడుతూనే అమ్మకు అన్ని ఏర్పాట్లు చేస్తాడు. క్షణాలలో శుభ్రంగా సుందరంగా తయారవుతాడు. **ఆయన పంచెకట్టు ఆయనకే చెల్లు. ఆ కట్టు ఆంధ్రప్రదేశ్‌లోనే మరెవ్వరి దగ్గర లేదు** అని అందరూ అనుకొనేవారు.

అప్పుడు తనబిడ్డలకు అనుగ్రహ దర్శనం కలిగించమని అమ్మను వేడుకొంటాడు. వేదిక సిద్ధపరిచి పూజా ద్రవ్యాలను, ప్రసాదాలను సన్నద్ధం చేసికొంటాడు. అమ్మ అర్చనకు అవసరమైన అన్ని అంశాలను అతి శ్రద్ధతో సమకూర్చి పెట్టుకొంటాడు. కొబ్బరికాయలు కొట్టుకొనే వారి కొరకు ఒక రాతిని, ఆ నీటిని పోసేందుకు ఒక పాత్ర సిద్ధం చేసి పెట్టుకుంటాడు. ఇంకా ఎవరైనా అమ్మ బిడ్డలు రావలసిన వారు ఉంటే అమ్మ దర్శనానికి రమ్మని పిలిచినట్లు గంట ఆవరణ అంతా వినిపించేటట్లు మోగిస్తాడు.

సభక్తికంగా అమ్మను ఆహ్వానించి అమ్మను వేదికపై ఆశీనురాలు అయ్యేటట్లు చేస్తాడు. తను అమ్మ పాదాల చెంత కూర్చుంటాడు. ఇలా అనుక్షణం అమ్మ పాదాల చెంత ఉండటంతోనేఏమొ, ప్రముఖ పాత్రికేయుడు శ్రీ పొత్తూరి వెంకటేశ్వర రావు గారు అన్నయ్యను **"అమ్మ మంచానికి అయిదో కోడు రామకృష్ణ"** అన్నారు. రామకృష్ణ అన్నయే స్వయంగా **"అమ్మ చరణాలే నా చిరునామా"** అని సవినయంగా ప్రకటించుకున్నాడు. అమ్మ చరణాల చెంత కూర్చున్న రామకృష్ణ అన్నయ్య అచరణాలను ఒక మెత్తని దిండుపై విశ్రాంతిగా

నిలుపుతాడు. ఆ శిరీషమృదుల చరణాల నుండి పాద రక్షలు తొలగించి ఆ బంగారు చీర అంచులు అమ్మదు పాదాలకు మరింత శోభచేకూర్చే విధంగా అమరుస్తాడు. ఇక అక్కడ కొద్ది నిముషాలు సేపు నిశబ్దం అలముకుంటుంది. ఈ లోగా అన్నయ్య అన్నీ సరిచూసుకుంటాడు. సర్వం సిద్ధమైపోగా అప్పుడు అమ్మ మోమును అనుగ్రహం కోసం వీక్షిస్తాడు. **అమ్మపెదవి కదిల్చి చెప్పేడి దాకా పనిలేదు. అమ్మకదలికలో అర్థమెరుగు.** అమ్మ కంటి కొనలనుండి ఏతెంచిన ఆజ్ఞలను ఔదలదాల్చి భక్తకోటిని ఒకొక్కరినే ఆహ్వానిస్తాడు. వారు అమ్మ ఎదుటకూర్చొని అమ్మపాదాలు తాకి అర్థించేవీలు కల్పిస్తాడు. భక్తుడు తెచ్చిన పూజా ద్రవ్యాలను తీసికొనేందుకు ఒకపళ్ళెము తనచేత దాల్చి సిద్ధంగా ఉంచుకుంటాడు. అప్పుడు అమ్మవాటిని తాకి ఆశీర్వదించి తిరిగి భక్తులకు ఇవ్వటం జరుగుతుంది.

ఇలా అనేక పనులు ఏకకాలంలో కేవలం తనకున్న రెండు చేతులతో నిర్వహిస్తాడు. ఒకచేతితో కుంకుమ పొట్లాలు, కొబ్బరిచిప్పలు తీసికొని కర్పూరం వెలిగించమని భక్తులకు అందించి మరో చేతితో అక్కడి నైర్మాల్యాలను తొలగించి శుభ్రం చేస్తాడు. వారి ఊరు పేరు అడిగి భోజనం చేశారా అని ప్రేమతో ఆరా తీస్తాడు. ఆ విధంగా ఒకరి తర్వాత ఒకరు భక్తులు సత్ప్రవర్తనతో అమ్మను దర్శించేందుకు దోహదం చేస్తాడు. వారిని ప్రేమతో చిరునవ్వుతో సాగనంపుతాడు. సుదీర్ఘకాలం సాష్టాంగదండ ప్రమాణాలు చేసే భక్తులపట్ల ఓరిమివహిస్తూనే అతనికి అసౌకర్యం కలగకుండా చూస్తాడు. ఆ తల్లి పాదాల చెంత ఉంచిన ప్రసాదాలను భక్తుల చేతిలో పెట్టి వారికి సమాశ్వాసన కలిగిస్తాడు. అమ్మతో సంభాషించాలని అభిలషించే భక్తునికోర్కెను అమ్మమ్రోలపెట్టి అమ్మ అనుజ్ఞ కోసం ఎదురు చూస్తాడు. చాలా సార్లు ఆ భక్తుని వేదన, నివేదన అతనే ఆలకిస్తాడు. తగుసమాధానాలు తనే ఇస్తాడు. ఈ సందర్భాలలోనే అమ్మ **"వాడువింటే నేను విన్నట్లే, వాడుచెబితే నేను చెప్పినట్లే"** అన్నది. జనం ఎక్కువైనప్పుడు కొంతసేపు ఓపిక పట్టమని అందరికి 'మాతృదర్శనం' కలిగిస్తానని చెప్పి సాదరంగా అర్థిస్తాడు.

ఈ విధంగా ఏక కాలంలో నిర్వహింపబడిన అనేక పనులు క్రమబద్ధంగా స్వభావ సుందరంగా అతడు నిర్వహిస్తాడు. ఇంత సున్నితంగా పొరపాటు లేకుండా తొట్రు పాటు పడకుండా అన్ని పనులు చేయటం అన్నయ్యకు కాకపోతే కేవలం అమ్మకు మాత్రమే సాధ్యమవుతుంది. అందుకే అమ్మ **"వాడుంటే శివపూజ, వాడు లేకుంటే శవ పూజ"** అన్నది. నొచ్చుకున్న వారికి నివరణ ఇచ్చింది. పూజారి స్థానంలో వాడులేకపోతే నేను వెళ్ళి పూజారి స్థానంలో కూర్చొంటాను, అని. అన్ని సమయాల్లో అతడు నిస్వార్థంగా కేవలం అమ్మ ఆ పరిసరాల పట్ల మాత్రమే దృష్టి కలిగి కన్పించేవాడు.

ఈ దివ్య సౌందర్య మహిమ ఆ దృష్టితో చూసేవారి కళ్ళకు మాత్రమే కనిపిస్తుంది. సాధారణంగా అనేక తప్పులు చేస్తూ వ్యక్తులు తమ హోదాకు లోటు కలిగేలా జారిపడిపోతారు. చేతకాక బేల చూపులు చూస్తారు. కాని విశుద్ధమై, నిస్వార్థమై, కళంక రహితమై, నిత్యోత్సాహియైన సోమరితనం లేని ఈ యోగి చర్యలు ప్రేమ అనే ఒక అదృష్ట చలనం ద్వారా ఆవరణాన్ని యావత్తు ఊడ్చివేస్తాయి. ఈ విధంగా వివిధ చిన్న, పెద్ద పనులను సంపూర్తిగా సమృద్ధిగా నిర్వహించి, సంతృప్తితో అతడు అమ్మకు హారతి ఇవ్వటంతో ఆనాటి దర్శన కార్యక్రమం సమాప్తమౌతుంది. అతడు తిరిగి పాద రక్షలు అమ్మకు భద్రంగా తొడిగి ఆ త్రోవను శుభ్రపరిచి అమ్మను, అమ్మ గదికి తీసికొని పోతాడు. ఒక నీడవలె, అడుగు జాడవలె ఆమెతో కలిసి ఆ గదిలోకి అడుగు పెడతాడు.

ఆ తర్వాత జిల్లెళ్ళమూడిలో అతను పర్యవేక్షించని ఉండదు. ఇన్ని పనులలోనే ఆయన సంపాదకీయంలో 'మాతృశ్రీ' మాస పత్రిక సర్వాంగ సుందరంగా తయారై బిడ్డల చేతుల్లోకి వస్తుంది. ఆయన సంపాదకీయం కోసం భక్తులు ఉత్సుకతో ఎదురు చూస్తారు. ఇంత కార్యక్రమంలో నిమగ్నమైన వ్యక్తి సాయం కాలాలు మాతృశ్రీ సంస్కృత కళాశాల విద్యార్థులతో మమేకమై వారితో క్రీడాకార్యక్రమాలలో పాల్గొని వారి ఇంటి దిగులు పోగొడ్తాడు. ఈ కార్యక్రమాల మధ్యలోనే అప్పికట్ల కరిణీక నిర్వహణలో బాపట్ల నుండి రెవెన్యూ అధికారులు అడిగే ప్రశ్నలకు ఫోన్‌లోనే సమాధానాలిస్తాడు. ఇవన్నీ ఒక ఎత్తు అయితే అన్నయ్య సాహిత్య సేవ మరో ఎత్తు. **అమ్మ జీవిత చరిత్రను "జీవిత**

**మహోదధిలో తరంగాలు"గా "రహి" అన్న కలం పేరుతో మాతృశ్రీ మాస పత్రికలో సీరియల్‌గా ప్రచురిస్తున్నాడు.**

ఈ విధంగా ఒక ఒంటరి ఏకైక వ్యక్తి, తన సర్వస్వం తల్లికి అర్పించిన వ్యక్తి, ఆమె దివ్య సన్నిధిలో రోజంతా గడిపే వ్యక్తి, ఒక స్వార్థ రహితుడైన వ్యక్తి, పేదైనా ధనికుడైన అందరినీ ఒకే విధంగా చూసే వ్యక్తి, అందరిని తన **'చెదరని చిరునవ్వు'తో** ఆదరించే వ్యక్తి, అక్కడి వందలాది చిన్నా చితక పనులతో పాటు కొండల వంటి పెనుభారాలను సైతము ఒకేసారి తన భుజస్కంధాలపై మోస్తూ ఉంటాడు.

ఈ విధంగా జిల్లెళ్ళమూడి అమ్మ శ్రీ చరణ మందారాల సమక్షంలో ఒక కార్యశీలుడైన మహాయోగి సాక్షాత్కరిస్తాడు. ఇక్కడ ఒక వ్యక్తి 'కార్య నిర్వహణాదక్షత' కనిపించక మానదు. ఇటువంటి అనితర సాధమైన కార్యక్రమం నిర్వహించటం **అహంకార రహితునికే సాధ్యం. అమ్మ ఆశీ:ఫలం పొందిన వారికే సాధ్యం.** ఇటువంటి కార్యక్రమాలు వీక్షించటం కంటికి విందు మనస్సుకు పసందు కలిగిస్తుంది. ఇంతకంటే మహాయోగం మరొకటి లేదు. **రామకృష్ణ అన్నయ్య మహాయోగి.**

జయహోమాతా !







American Biographical Institute, Inc.

Publisher of Biographical Reference Works since 1967
Member of the Publishers Association of the South
National Association of Independent Publishers

Main Office: 5126 Bur Oak Circle, PO Box 31226, Raleigh, North Carolina 27622 USA * Established 1967 * ISBN Prefix 934544
Library Distribution Center: 5436 Pine Top Circle, Raleigh, North Carolina 27612
Fax: 919-781-8712

January 10, 1997

Mr. Konda Mudi Ramakrishna
Viswajanani ParishatMatru
Sri Vidya Parishat
Pojillellamudi AP 522113 INDIA

Dear Mr. Ramakrishna:

Congratulations! Because of exemplary performance your name has been recommended recently to the Institute's Governing Board of Editors for biographical inclusion in the Seventh Edition of INTERNATIONAL DIRECTORY OF DISTINGUISHED LEADERSHIP by Dr. Kamarajugadda Seshasai.

Focusing on true definitions to success of only a few selected men and women of this decade, the Seventh Edition of the INTERNATIONAL DIRECTORY OF DISTINGUISHED LEADERSHIP [illegible] 1997. Copies are reserved by worldwide libraries, professional groups, universities, publishers, researchers, and businesses that have collected ABI titles for twenty-nine years

The enclosed brochure provides you with information about this prestigious international volume and the handsome Commemorative Awards made available to you for specifically recognizing your outstanding achievements. Although there is no entry fee or purchase prerequisite, a LIMITED number of copies of the Seventh Edition will be offered ONLY to biographees at PRE-PUBLICATION prices as noted on the enclosed leaflet.

Selection is based entirely upon merit, and I congratulate you on the fine example you are setting for your peers and society, Mr. Ramakrishna. My best personal wishes for all of your future endeavors. I look forward to hearing from you here at our headquarters.

Respectfully,

J. M. Evans

J. M. Evans
EDITORIAL DIRECTOR

P.S. I kindly ask that you reply by **February 28, 1997** to assist our Editors

రామకృష్ణ అన్నయ్యకు అంతర్జాతీయ గుర్తింపు లభించింది. ఇది ఆయన చేసిన "అమ్మ సేవ"కు లభించిన గుర్తింపు. అయితే అనారోగ్య కారణాల రీత్యా ఈ సంస్థ కు జవాబు పంపించటం సాధ్యపడలేదు.

–శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య ఫౌండేషన్

❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋



దివి.08.02.1992న రామకృష్ణ అన్నయ్యకు జరిగిన

# సన్మాన సభలో

మాతృశ్రీ విద్యా పరిషత్ వారు సమర్పించిన

## ప్రశంసా పత్రము.



❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋ ❋

**మాతృశ్రీ అనసూయాదేవి మానసపుత్ర రత్నమా !**

మీకివే మా సౌహార్ద్ర సౌభ్రాతృత్వ సంభృత నమస్సుమనస్సులు

**వచన గేయ కవిశేఖరా !**

పిన్న వయసునందే మీ మేధావైహాయస వీధీ వినిర్గతమైన వచన కవితా స్రవంతి అ ప్రతిమ ప్రతిభాపాటవ కవితయై మాధుర్య ప్రసాదాది గుణశబలితయై సంస్కృతి సౌరభ సమ్మిళితయై జగజ్జననీ చరణారుణ కమల వర్ణనా సుధా వాహినియై సహృదయ హృదయ కేదార సమోద సస్య సంవర్ధనియై విరాజిల్లుతున్నది.

**జగజ్జనయిత్రీ పవిత్ర పాద సేవా సతృష్ణా ! రామకృష్ణా !**

ప్రణయ రమణీయ యౌవనంలోనే ప్రవయస్స మంచిత ప్రజ్ఞా పరిణతితో, ప్రజ్ఞాపరిణతిని మించిన పరమభక్తి ప్రపూర్ణ మయిన సమర్పణ బుద్ధితో పరమేశ్వరీ వరివస్యా రహస్య కళాకౌశలం గడించి ఆమె వాత్సల్యామృత సాగరంలో నిరంతరం నిరంతరాయంగా సోదదబృందాన్ని ఒలలాడించిన మీ ప్రపన్న జీవన క్రీడనం ధన్యతాస్రమేడనం.

**సరళ సౌహార్దప్రాకారకా ! విశ్వజనని విశ్వకుటుంబ ప్రధాన పరిచారకా!**

జగన్మాతృ సంకల్పబలంతో అంకురించి మీ వినిర్మల ప్రేమమయ త్యాగజలంతో దినదిన ప్రవర్ధమానమై బహుళ ఫల భాసమానములై వర్ధిల్లిన మాతృశ్రీ విద్యాపరిషత్, విశ్వజననీ పరిషత్ కల్ప మహీరుహాల కు మీరు చేసిన సేవ జనసామాన్యమునకు కానరానంత లోతుకు పోయి తల్లివేరుగా

నిలిచి కుల గుణ వర్ణ లింగ భేదం లేకుండా అందరికి అండగా నుండి నిష్కామ కర్మణ్య మార్మికతకు ప్రధమోదాహరణంగా వెలుగుతున్నది.

**మాతృశ్రీ జీవిత మహోదధి కర్ణధారా ! మధుర భక్తి సుధా ధారా !**

మీ బుద్ధి మందర మధనా విర్భూతమైన అనసూ దేవి జీవిత చరితామృతం ఆపన్నులకు తాపోపశమనం కలిగించి చింతామణులను వెదజల్లుతున్నది. మీ భాష ఆంధ్రభాషా మోష కమూల్య భూష, గంగాయమునా తుల్య వాత్సల్య సఖ్య భక్తి భాసురమైన మీగేయ సారస్వత కైంకర్యం సోదర భక్త శిరోధార్యయై విలక్షణ ప్రక్రియా మాధుర్యమై సౌకుమార్య సుందరమై లలిత భావబంధురమై విలసిల్లుతున్నది.

**జగజ్జననీ చరణానువర్తీ ! సహిష్ణు చక్రవర్తీ !**

దూషణ భూషణ తిరస్కార పురస్కారాలు పరిపూర్ణాధ్యాత్మిక వికాసానికి అత్యావశ్యక సంస్కారాలుగా అంబికా దత్తవరాలుగా భావించి అనన్య సామాన్యంగా అమ్మ నారాధించిన మీ నడవడి విశ్వజననీ కుటుంబ సభ్యులకు మేలిమొరవడి.

**మాతృశ్రీ మహితాంతరంగ భక్తశిరోమణీ !**

సర్గస్థితి ప్రత్యవహార కారిణి, మహామాయా స్వరూపిణి అయిన అమ్మ అగాధ ప్రేమలోని పోడిమినీ, వేడిమినీ అనన్యాదృశంగా అనుభవించి ఆ మాతృమూర్తికే అపార వాత్సల్యామృతాన్ని నిర్విరామంగా నిస్సీమంగా అందించిన మీ మహోన్నత వ్యక్తిత్వం వాత్సల్య భక్తికి నిదర్శనం, అమ్మ భక్తుల కాత్మ విమర్శనం.

– మాతృ శ్రీ విద్యాపరిషత్





# మాతృశ్రీ

మాసపత్రిక

విడిపత్రి రూ. 10/-

సంపుటి : 20 జనవరి, 1985 సంచిక : 6

గౌరవ సంపాదకులు : కొండముది రామకృష్ణ



## అన్నయ్య గురించి ....



రామకృష్ణమూర్తి ఒక సమ్మోహన శక్తి.

**- శ్రీ తుమ్మల సీతారామ మూర్తి**

సుకవి రామకృష్ణ ఒక రాజహంస - లేదా పరమహంస కాదా రామకృష్ణ పరమహంస.

**-కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి**

"వస్తువు మాయమై నీడకు గాయమయింది" అన్న వాక్యం చాలు ఈనూరేండ్ల ఆధునిక కవుల కన్నా అన్నయ్య గొప్పవాడు - అనిచెప్పడానికి.

**- డా॥ ముదిగొండ శివప్రసాద్**

సమస్త సృష్టిలో అమ్మపాదాలను చూడగలగడం రామకృష్ణ పూర్వజన్మ సుకృతం లేదా అమ్మ కరుణా పీయూషం.

**- ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

అమ్మ వాత్సల్య గంగా తరంగాలలో మూడు దశాబ్దాలుగా మునకలువేసి దోసిళ్ళ కొద్దీ ఆమె దయామృతాన్ని పావనంచేసిన వాడు రామకృష్ణ అన్నయ్య.

**- శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు**

అమ్మ శ్రీరామచంద్రమూర్తి అయితే అన్నయ్య ఆంజనేయుడు అమ్మ రామకృష్ణ పరమహంస అయితే అన్నయ్య వివేకానందుడు.

**- ప్రొఫెసర్ ఎల్.ఎస్.ఆర్. కృష్ణ శాస్త్రి**

అమ్మ మంచానికి అయిదోకోడు రామకృష్ణ.

**- శ్రీ పొత్తూరి వెంకటేశ్వర రావు**

అన్నయ్య గురించి....

వాడు అప్పికట్లకు కరణం, నాకు ఉపకరణం.

- అమ్మ

వాడికి చెబితే అమ్మకు చెప్పినట్లే, వాడు వింటె అమ్మవిన్నట్లే.

- నాన్నగారు

రామకృష్ణ - పరమహంస.

- శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర స్వామిజీ

రామకృష్ణ - కైంకర్యమణి.

- శ్రీశ్రీశ్రీ కుర్తాళం సిద్దేశ్వరీపీఠాధిపతి

అమ్మ మహోన్నత హిమవత్ శృంగం.

ఆశృంగాన్ని సందిట పొదవుకున్న మంచు 'శ్రీరామకృష్ణ'

- శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులు

జిల్లెళ్ళమూడి అమ్మ తన ప్రతినిధిగా

ప్రతీకగా కొండముది రామకృష్ణను నిలిపింది.

- శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్

అమ్మ రామకృష్ణను తన సింహాసనంగా స్వీకరించింది.

తన సందేశాన్ని ఈ సింహాసనం నుండి వినిపిస్తున్నది.

- మాష్టర్ మోపిదేవి కృష్ణ స్వామి



అమ్మ వెనుక నే నడచి వస్తా
అమ్మ కొరకు నా బ్రతుకు నిస్తా

★★★★★

అమ్మ ధ్యాసే నా శ్వాస
అమ్మ ధ్యానమే నా ప్రాణము

★★★★★

అమ్మకు ఉపకరణము నేనై
అమ్మ కై బ్రతుకును సాగిస్తా

★★★★★

అమ్మకు నాకు తెరలు వద్దు
అమ్మ తప్ప సిరులు వద్దు

★★★★★

అమ్మ కోసమే నా జీవితం
అమ్మ సేవకే నే నంకితం

★★★★★

అమ్మ అన్నదే నాకు సందేశం
అమ్మ ఉన్నదే నాకు కైలాసం

★★★★★

అమ్మ సేవ వినా చింతన లేదు
అమ్మ ధ్యాస వినా సాధన లేదు

★★★★★

నా దేహం అమ్మకే - నా జీవం అమ్మదే

★★★★★

అమ్మను మరిచి బ్రతుకలేను
అమ్మను విడిచి నేనులేను.

★★★★★

అమ్మే నా కలం- నా సకలం

★★★★★

అమ్మ తలపే నాకు ప్రాణం
అమ్మ మరుపే నాకు మరణం

★★★★★

అమ్మ చరణాలే - నా చిరునామా
అమ్మ సేవ మానను - అమ్మ సన్నిధి వీడను



- శ్రీ కొండముది రామకృష్ణ అన్నయ్య

Rohit Printes-9030866059